# పునరాగమనం



రచన :

బోరిస్ పోలెవోయ్

అనువాదం :

"ప్రసన్న"



విశాలాంధ్ర ప్రచురణాలయం,

విజయవాడ.

# పునరాగమనం

(నవల)

TRANSLATED FROM

HE CAME BACK

By

B. POLEVOI

# 1

ఉక్కు కర్మాగారంమీద మంచుతుపాను హోరె త్తింది. సుళ్ళుతిరిగి ఇళ్ళమీద జారుతోంది. భయంకర హాహాకారాలతో బజార్ల వెంట దాడిచేస్తోంది. ఆ సుడి గుండంలో మన్నూ మిన్నూ ఏకమయ్యాయి. ఇంత తుపాను హోరులోను దూరంనుంచి వినవచ్చే బరువైన లోహపు మోతా, సుళ్ళుతిరిగే మంచును హఠాత్తుగా దీప్తివంతం చేసే అరుణకాంతీ మాత్రమే ఇదేదో స్టెప్పీప్రాంతంకాదనీ, ఎక్కడో దగ్గరలోనే ఉక్కును కరగించి పోతబోసే పెద్ద కర్మాగారం ఒకటి పనిచేస్తోందనీ తెలుపుతున్నాయి.

క్లావియాష్లికోవా నడుపుతున్న పాతలారీ తన టైర్లతో ఆ పాతరోడ్డును వెతుక్కుంటూ కష్టంగా, మెల్లగా సాగిపో తోంది. కదలిపోయిన లారీశరీరం బోలుగా గణగణలాడింది. తలదీపాలు రేడియేటరుదగ్గరున్న చీకటినిమాత్రమే చెదర గొడుతున్నాయి. ఇంజనును మొదటి 'గేరు' లోనే నడు పుతూ, ఎప్పటికప్పుడు హారన్ మ్రోగిస్తూ క్లావియా తన లారీని జాగ్రత్తగానే తోలింది - అయినా ఎంత జాగ్రత్త పడినా ఒక మనిషిని ఢీకొన్నది.

అసలు ఆ మంచుమబ్బులో ఆ మనిషి హఠాత్తుగా సరిగ్గా లారీముందు కనబడ్డాడు. అతడేమీ పారిపోవడంలేదనీ, మంచు చిమ్ముకుపోయిన ఆరోడ్డునడుమ విచిత్రంగా నిలబడి ఏదో దీర్ఘాలోచనలో నిమగ్నమై వున్నాడనీ మాత్రమే ఆమె చూడగలిగింది. సరిగ్గా తన లారీచక్రాలక్రిందకే వచ్చిపడ్డ ఆదద్దమ్మమీద కలిగిన కోపోద్రేకంతో బలంగా బ్రేకులు నొక్కింది. లారీ ముందుకు జారింది. మెత్తగా ఒకధ్వని విని పించింది– అంతే: ఒకమనిషి రేడియేటరు క్రింద అంతర్ధాన మయ్యాడు. అతనిచేతనున్న సూట్ కేసు ఎగిరిపోయింది.

ఏదో తీగచుట్ట తన్నితే ఎగసిపోయినట్టు పైనున్న కాబిన్‌లోంచి క్లాడియా దూసుకువచ్చి బయట పడింది. లారీక్రింద పొడిమంచును విరజిమ్ముతున్న తుపాను హోరు మాత్రమే వినిపించింది గాని బాధను సూచించే మూలుగైనా కూడా వినబడలేదామెకు. ముందున్న బంపరు క్రిందనుంచి ఒకమనిషి ప్రాకుతూ బయటకొచ్చాడు. మంచుతో మసక బారిన ముందుదీపాల గ్రుడ్డివెలుతురులో దూరాన అతని సూట్ కేసును చూసింది—బహుశా ఆ అదటుకు ఆ పెట్టె తెరుచుకుపోయి వుండవచ్చు. దాంట్లోంచి తొంగిచూసే ఒక ఎర్రవాగు తుండుగుడ్డచివళ్ళతో తుపాను ఆటలాడింది ; పైగా మంచుదువ్వను దోసిళ్ళతో ఎత్తి లోపల పోసింది. సబ్బుపెట్టె, గడ్డం గీచుకునేందుకు ఉపయోగించే 'మగ్గూ' దూరదూరంగా పడివున్నాయి. క్లాడియా కంటికి పురాణ కాలంనాటి అలారం గడియారం ఒకటి — నికెల్ పూతా, నెత్తిమీద గంటకలది కనిపించింది.

"మీరు బాగానే వున్నారా? మీకేం దెబ్బతగల్లేదు గదా! నేను హారన్ గూడా మోగించాను — ఒట్టు!" తత్తరపడుతూ అన్న దామె.

"ఇంతకూ మీ కేమిటి సంబంధం?" ఆవిడవంక కన్నెత్తి అయినా చూడకుండా కృతజ్ఞతా రహితంగా అన్నాడు.

లారీదీపాల పసిడివెలుతురులో పాతబడిన మిలిటరీ ఆఫీసరుకోటు ఒకటి ధరించిన విశాలభుజాలుగల మనిషి, సమ మట్టమైన వాడొకడు నిలబడ్డాడు. ఏటవాలుగా, దట్టముగా పడుతున్న ఆ మంచులో అతని ముఖకళవళికలను ఆమె సరిగ్గా చూడజాలకపోయింది. కాని స్త్రీ సహజమైన పరిశీలనా పటి మతో అతని భుజాలమీద ఆఫీసరు బద్దీలు ఇంకా మాసిపో లేదనీ, అతని టోపీమీద గాఢంగా అంటిన నక్షత్రఛాయను వెంటనే కనిపెట్ట గలిగింది.

తనకు సంభవించిన హఠాత్సంఘటన కారణంగా అతడేమీ ఆమెను బూతులూ తిట్టలేదు; బెదరించనూలేదు. కనీసం ఆవిడ డ్రైవరులైసెన్సునైనా చూపించమని నిగ్గదీయ లేదు. ఇంతవరకు ఎలాంటి మచ్చాలేని తన డ్రైవరుకౌశలాన్ని, ఖ్యాతినీ యీ విధంగా తన తొందరపాటుతో సవాలు చేసిన వాడిమీద క్లాడియాలో ద్వేషం ప్రజ్వరిల్లబోయింది; కాని అంతలో తనకు తెలియకుండానే ఒక విధమైన కృతజ్ఞతా భావానికి అది తావిచ్చింది.

ఆ పరాయిమనిషికి సహాయపడేందుకు ఆ సూట్ కేసును దులిపి, అందులో సామాగ్రినంతా సర్ది పెట్టసాగింది.

"ఈ ప్రాంతాలకు మీరు కొత్తవాళ్ళనుకుంటాను. ఏం? బహుశా దారితప్పి ఇటు వచ్చారేమో. ఇలాంటి వాతావరణంలో అదేమంత ఆశ్చర్యంకాదు... నా లారీలో వస్తారా ?"

"సరే" నని ఆ మనిషి బదులుపలికాడు—మరేమంత పెద్ద కుతూహలం చూపించకుండానే.

"ఎక్కడివరకు ?"

"అదే నేనూ తెలుసుకుందామని వుంది" అని సాలోచనాపూర్వకంగా చెప్పాడు. "నే నీ నగరంలోనే పుట్టి పెరిగాను. కాని నాకైతే దీనినిగురించి ఒక్కటీ తెలిసినట్టు లేదు. అటు కేసి హోటలుకు వెళ్ళాను. ఐతే అక్కడ దాని ఆచూకీ యేం మిగలలేదు—ఓ...త్తి ఖాళీస్థలమే, దీం తగలెయ్య! అక్కడనుంచి కర్మాగారందగ్గర అతిథిగృహానికి పోయాను. పాతరోజులు చూసైనా నా కింత చోటు చూపక పోతారా అనుకున్నాను—కాని దాన్నికూడ కర్మాగారపు పరిపాలనా కార్యాలయంక్రింద మార్చేశారు. పాతభవంతి తగలబడిపోయిందనుకుంటా, ఏం ?"

"అవును, ఫాసిస్టులవల్ల చాలావినాశం జరిగింది."

ఈ పరాయివాడు తన ముందుకు ఖాళీగా తేరిపార చూస్తు వుండిపోయాడే గాని ఒక్కసారి అయినా క్లావియా వైపు కన్నెత్తలేదు. కొంపాగోడూ కోల్పోయిన యీ దురదృష్టవంతుణ్ణి చూస్తూండగానే ఆమె గుండె అంతా జాలితో నిండింది, అనుకోకుండానే తనింటికి ఆహ్వానించింది.

"మీరీ రాత్రికి మా ఇంటికి ఎందుకు రాకూడదు? శత్రువులు ఆక్రమించినప్పటినుంచీ మేమెలా జీవితం గడుపుతున్నామో మీకు తెలిసేవుంటుంది. అదికూడా బారకాసుల్లో. పైగా ఒకే ఒక చిన్నగది మాది. దానిని శుభ్రపరచడానికైనా తీరిక దొరకడంలేదు— యీ లారీని నడుపుతూ రోజూ ఒకటిన్నర, ఒక్కోసారి రెండేసి షిఫ్టులు తిరుగుతూండాలి."

"మరేం పర్వాలేదులే. పోనివ్వండిక," ఏమీ పట్టనట్టుగానే అన్నాడు ఆపరాయి వ్యక్తి. అతను పలికిన ధోరణి చూస్తే ఆ రాత్రికి ఎక్కడ గడపవలసివచ్చినా అతడు లెక్క చేయనట్టు తోచింది క్లావ్డియాకు. లోలోన ఏదో కొంత చింతించింది; తానా విధంగా అనుకోకుండా ఆహ్వానించినందుకు పశ్చాత్తాప పడింది. అయినా ఇక యిప్పుడు చేయగలిగిందీ ఏమీలేదు.

లారీ బయలుదేరింది. మరో దుర్ఘటన ఏమయినా జరుగుతుందేమోననే భయంతో తనముందు ఘోషించుతున్న తెల్లని తుపానులోకి కండ్లు పోటుపెట్టేవరకు చికిలించుకు చూచింది క్లావ్డియా. ప్రక్కనే యీ పరాయివాడు తన మిలటరీ కోటుచేతుల్లోకి ముంజేతులు దూర్చి నిశ్శబ్దంగా, కోపంగా కూర్చున్నాడు. ఏదో కునికిపాట్లు పడుతున్నట్టువున్నాడేగాని ఇంటికి చేరేవరకు ఒక్కపలుకైనా పలకలేదు.

ఒక చీకటివసారాలోనుంచి సమిష్టి పాకశాలగుండా అతనిని తీసుకుపోయింది. అక్కడ ఒక పెద్ద పొయ్యిముందర

చేరిన అనేకమంది స్త్రీలు ఆశ్చర్యంగా కళ్ళువిప్పి వీరివంక చూడసాగారు. క్లాడియా నివసించే గదిలో కాలుపెట్టడంతోటే అతడు వెళ్ళి ఒకమూలన తనసూట్ కేసును దించాడు. ప్రక్కకు తిరిగి ఆవిడవంక ఒక్కసారి అయినా చూడలేదు. తలుపుప్రక్కన వున్న మేకుకు తనకోటూ, టోపీ తగిలించాడు. చేతులు నలుపుకుంటూ వెచ్చగావున్న పొయ్యివద్దకు వెళ్ళి దాని పెంకులకు తనవీపును గట్టిగాచేర్చి నిలబడ్డాడు.

"ఏమిటిది? తన సొంతఇల్లులాగ వ్యవహరిస్తున్నాడే?" అని క్లాడియా గందరగోళపడుతూ ఆలోచించింది; "కనీసం తన కోటు సూట్ కేసూ ఎక్కడ పెట్టమంటారని అయినా అడగవలసింది. అదేమీ లేదు సరే. మరి నన్నైనా పలకరించవచ్చునే! ఏం మూగనోమో!"

"లారీని యీప్రక్కనేవున్న గారేజిలో చేర్చివస్తాను. అప్పుడు మీకు కొంచెం టీ తయారుచేసి పెడతాను." అని కొయ్యబారినట్లు కదలిక ఏమీలేని ఆవ్యక్తినిచూస్తూ అన్నది క్లాడియా. మరల ఒక నిమిషం ఆగి, ఒకవైపున మంచంమీద నిద్రపోతున్న తనబిడ్డను ఆ గుడ్డి వెలుతురులో చూచి, వాడు సమంగా వదులుతున్న ఉచ్ఛ్వాస నిశ్వాసాలను ఒకసారి చెవియొగ్గి విని, హెచ్చరికను సూచించే స్వరంతో మళ్ళీ అన్నది:

"మావాడు స్లావ్కా ఒకవేళ లేస్తే వాడినేమీ భయపెట్టకండి. నే నిప్పుడే వస్తానని చెప్పండి......మరి, ఇక మీరు కూర్చోరా యేం?"

సమాధానంగా తలమాత్రం పంకించాడు. కాని పావు గంట అనంతరం ఆమె తిరిగివచ్చినప్పుడు అతను మాగన్నులతో అలాగే నిలబడివున్నాడు. అతని వాలకం అంతా యెంతో అలసటను, నిస్తేజాన్ని చూపుతోంది. ఆమెకు జాలిగొలిపి, పొయ్యిదగ్గరకు ఒక కుర్చీని లాగి అన్నది :

"మీ రెందుకు కూర్చోరు? అక్కడనే......ఆ పొయ్యి ప్రక్కన. కొంచెం వెచ్చగా కాగి, విశ్రమించడానికి, ప్రయత్నించండి. ఇంతలోనే నేను టీ నీళ్ళను ఎక్కిస్తాను. తర్వాత టీ త్రాగుదాం. జరగవలసిం దేమిటంటే......"

"ధన్యవాదం. కాని నా కేమీ అవసరంలేదు. మీ రేమీ శ్రమపడకండి" అన్నా డతను.

క్లాడియా టీ పాత్రతో పాకశాలకు వెళ్ళేముందు ఆచ్ఛాదనం యేమీ లేకుండా, ఒక తీగచివరచేరిన నీటి బుడగలాగ కనిపించే దీపపుబల్బుమీద ఒక పేపరుకాగితం కప్పి వెళ్ళింది. ఆ దీపాన్ని చూస్తేనే తెలుస్తోంది ఈ గదిని నివాసయోగ్యం చేయడానికి ఎవరూ పట్టించుకోవడం లేదని. టేబుల్ మీద పిల్లవాడి పుస్తకాలసంచీ, అందులోనుంచి పొడుచుకొనివచ్చిన పెన్సిళ్ళపెట్టె పడివున్నాయి. దాని ప్రక్కనే ఒక కాగితంమీద భోజనపు అవశేషాలు, త్రాగిన టీ కప్పులు వున్నాయి. విశాలమైన కిటికీ అంచుమీద మలినమైన పాత్రలు ప్రోగులుబడ్డాయి.

ఆగదిలో ఒకమూల, పెద్దకొయ్యమంచంమీద పడుకున్న ఏడేళ్ళ పిల్లవాడొకడు నిద్దట్లో నిగడదీసుకున్నాడు. ఒక

కుర్చీమీద అతని చిన్నలాగు, కోటు, మేజోళ్ళు అమరికగా తీర్చబడివున్నాయి. ఆ కుర్చీక్రిందనే వెడల్పాటి పంజాగల చిన్న ఉన్నిబూట్లజత ఒకటి ఒకదాని సరసన ఇంకొకటి అందంగా అమర్చబడివుంది. ఇంత పరిశుభ్రంగా తీర్చిదిద్దినట్టు ఆ వస్తువులను అమర్చడంలో చూపిన జాగ్రత్తను గమనిసే ఆ గదిలో నిరాదరణ మరింతగా ప్రస్ఫుట మవుతోంది.

ఈ పరాయివాడు ఆచిన్న ఉన్నిబూట్లవంక చూస్తూ అలాగే చాలసేపునిలబడ్డాడు. చివరకు ఒకచిన్న చిరునవ్వు—ముఖంలోని నరాలను ఏ అదటో కదిలించినట్లయిన చిన్న చిరునవ్వు ఒకటి-అతని చెక్కిళ్ళపై చిందులాడింది.

# 2

క్లాదియాష్లికోవా మంచి నీతీ, నిజాయితీగల మనిషి అనే ఖ్యాతివుంది ఆ బారకాసుల్లో నివసించే ఇరుగు పొరుగు స్త్రీలల్లో. అయినప్పటికీ ఏమున్నూ ముఖం తెలియని ఒక పరాయివాడిని, ఏ కారణమూ లేకుండానే, ఏదో వట్టిజాలితో మాత్రమే తనగదిలో తలదాచుకోమని ఆహ్వానించిందని పొరుగువారందరినీ నమ్మించడం చాలకష్టం. టీ మరగబెడు తూంటే తనవైపు ఇరుగుపొరుగు మహిళాసమాజమంతా విచిత్రంగా, వ్యంగ్యంగా, జాలిగా చూసే చూపులనుగురించే ఆమె తలపోసింది.

ఇలాంటి ఆలోచనలతో క్లాదియా ఆందోళనచెంది ఆ పొయ్యిముందర నిశ్శబ్దంగా నిలబడివున్నదేగాని ఆవిడ కనుబొమలు కోపంగా ముడివడ్డాయి; తన్నుతానే చీవాట్లు వేసికోసాగింది. అలా ఆఫీసరుదుస్తుల్లో తనగదిలో నున్న ఆ పరాయిమనిషిని తలచుకొన్నకొలదీ అతడిపై వ్యతిరేక భావం కలిగి గందరగోళపడింది.

క్లాదియా గదిలోకి తిరిగివచ్చింది. కోపంగా టీపాత్రను టేబిల్ మీద గభీమని పెట్టింది. అయినా అతడు ఆవంతైనా

తిరిగిచూడలేదు. ఎదురుగా గోడమీద వ్రేలాడుతున్న ఒక ఫొటోను ఏకాగ్రచిత్తంతో పరిశీలిస్తూ నిలబడివున్నాడు. ఆఫొటోలో నలుగురు మిలిటరీ ఆఫీసర్లు నిక్కబొడుచుకున్న క్రొత్తదుస్తులు, శ్రామికవీరపతకాలను ధరించి వున్నారు. వెనుక క్రెమ్లిన్ భవన ప్రాకారాలు ఎత్తుగా కనబడుతు న్నాయి. ఈచిత్రానికి పైభాగాన మరొక ఫొటో విడిగా కొంచెం పెద్దసైజులోది వ్రేలాడుతోంది. వానినిచూస్తూనే అందులోని వ్యక్తి దృఢకాయుడనీ, ఆ ఎత్తైన దవడలు అత నికి అందాన్ని చేకూర్చుతున్నాయనీ సులభంగా తెలుసు కోవచ్చు.

"ఎవరాయన?" ఆ చిత్రాన్ని వ్రేలితో చూపుతూ ప్రశ్నించాడు. పొడిఆరిన ఉద్రేకంతో విచిత్రంగా వణకింది అతని కంఠస్వరం.

"నా భర్త", అని ఆమె సమాధాన మిచ్చింది. "స్టాలిన్‌గ్రాడ్‌లో మరణించారు. 1942 వర్షఋతువులో..." అతని కంఠధ్వనిలోని కంపం ఆమెకుకూడా వ్యాపించినట్ల యింది.

"జాగ్లిష్లికోవ్?"

"అవును. ష్లికోవ్. ఏం, ఆయన్ను ఎరిగున్నారా?"

"ఉక్కును పోతబొయ్యడంలో ఆయనది అందెవేసిన చెయ్యి," అని పలికి గ్రూపుఫొటోలో ఒకచివరనున్న పొట్టి మనిషిని చూపించి అడిగాడు: "లిసిత్సైన్ ఎక్కడ?"

"ఊరల్ పర్వత ప్రాంతాల్లోనే వుండియుండాలి. ఇక్కడనుంచి యుద్ధకాలంలో ఉక్కు కర్మాగారాన్ని ఊరల్స్‌కు తరలించుకుపోయినపుడు దానితోబాటే అతనూ వెళ్ళాడు. మళ్ళీ తిరిగి రాలేదు. సరేగాని, మా వాళ్ళందరినీ మీ రెలా ఎరిగున్నారు?"

అందుకు అతడేమీ సమాధానం చెప్పకుండానే తిరిగి అడిగాడు: "మరి, అఫానిన్ ఏమయ్యాడు?" అని ఒకనీలైన కోటును ధరించి, ఆ కోటు జేబులోనుంచి అందమైన జేబు రుమాలొకటి తొంగిచూస్తుండగా ధీమాగా నిలబడ్డ ఒకవిగ్రహాన్ని ఆ ఫొటోలో చూపించాడు.

"అతడుకూడ ఊరల్స్‌లోనే వుంటున్నాడు. మా వాళ్ళంతా అక్కడే వుండిపోయారు. అక్కడే తమ సంసారాలు స్థిరపరచుకున్నారు. ఇక్కడకు తిరిగి వచ్చింది చాల కొద్ది మందిమాత్రమే. పోతే, ఇక్కడున్న వాళ్ళంతా కొత్తవాళ్ళే. ఆ ఫొటోలో నాలుగో వ్యక్తిపేరు పాంతెలీ పెత్రోవిచ్ కాజిమోవ్. బహుశా ఆయన్నుగూడ మీరెరిగే వుంటారనుకుంటాను. ఆయనగూడ నా భర్తతోబాటే సైన్యంలో చేరారు. యుద్ధం ముగిసినతర్వాత అతడు అక్కడే జర్మనీలో ఏదో నగరంలో కమాండెంటుగానో, మరేమిటోచేస్తూ వుండి పోయాడంటారు. పాపం! యుద్ధసమయంలో ఇక్కడనుంచి తరలించేటప్పుడు ఆయన కుటుంబంలో అంతా చనిపోయారు. బహుశా తిరిగి ఇక్కడకు రావడానికి ఆయనకు కష్టం కలిగి వుండవచ్చు. ఉక్కును కరగించే మావాళ్ళందరిలోను ఆయన ఉద్దండుడు— చాల హుషారైనవాడు."

"అలాగే వుండేవాడు," అని జీరంగురుపోయిన బాధా తప్తస్వరంతో బరువుగా పలికాడు. ఆ గొంతుకలో వినిపించిన వ్యథవల్ల అతని బక్కచిక్కిన ముఖంలోకి, లోతుగా ముడు తలుబడి ఒక చెంపమీద కణతనుండి క్రిందివరకు దిగజారి ఎర్రగా గాతపడిన మచ్చగల ఆ జీర్ణవదనంలోకి పరిశీలనగా చూడాలనిపించింది క్లావ్దియాకు. చూసి గుర్తించింది. గుర్తించి చిన్నగా అరచింది. అలసటజెంది వంగబడిపోయిన యీ బట్టతలమనిషీ, గుండ్రటిముఖం, నిర్మలనయనాలు, ఒత్తుజుట్టూకలిగి స్నేహపూర్వకంగా తన భర్తభుజంమీద చేయివేసి ఆ ఫోటోలో నిలుచున్నవ్యక్తీ ఒక రేనని గుర్తించి బాధపడింది.

ఒక చిన్న చిరునవ్వు అతని చెక్కిలిని కదలించింది.

"అవునుమరి, కామ్రేడ్ ప్లికోవా. అదంతా నిజమే. ఉక్కును కరగబోయడంలో అత డేమంత చెడ్డచెయ్యి కాదు; అతనికి ఒక కుటుంబమూ వుండేది. ఐతే అదంతా ఒకనాటి మాట. మరి యిపుడో... ఏమీలేదు." కఠినంగా, బాధతో పలికాడు.

క్లావ్దియా భయకంపితయై, చేతులను గుండెల కదుము కొని అలాగే నిలబడిపోయింది. యుద్ధకాలంలో ఆమెకూడ యమయాతన లన్నీ అనుభవించే వుంది. అందుకనే ఒక నాడు తన సర్వస్వం—తన కుటుంబం, తన స్నేహితులు, తన పని—అన్నింటితోను కలకలలాడిన తన సర్వస్వం కోల్పోయి ఈ శూన్యప్రదేశానికి తిరిగి వచ్చిన యీ వ్యక్తి పడే వ్యథ ఆమెకు అర్థమైంది. కాబట్టి పాంతెలీ కాజిమోవ్‌కు.

యిప్పుడు కావలసింది సానుభూతీ, ఓదార్పు కాదనీ, మన శ్శాంతి ఒకటి లభిస్తే చాలుననీ భావించింది. గతించిన ఆ సుఖమయ ప్రపంచంనుండి యీ వ్యక్తి హఠాత్తుగా వచ్చి పడినందువల్ల ఆమె గుండెల్లో మానుపట్టిన గాయం తిరిగి రేపినట్టయింది. నిబ్బరాన్ని కోల్పోకుండా వుందామని ఎంత ప్రయత్నించినా ఆమె పెదవులు వణకాయి; ఎడతెగని వేడి కన్నీళ్ళు జలజల రాలాయి.

ఏమిచేయడానికి తోచలేదా అతిథికి. ఏదో గొణిగి అటునిటు చూడసాగాడు.

తమతమ దుఃఖాలను ఏండ్లతరబడి ఒంటరిగా భరిస్తూ కాలం వెళ్ళబుచ్చేతరహా మనుష్యులు ఒక్కొక్కసారి చేసినట్టు అతి సన్నిహిత సైనిక మిత్రులకైనా ఎన్నడూ తెలియబర చని తన వ్యక్తిగత విషయాలను దాదాపు తన కెలాంటి పరిచయంలేని యీామెకు నివేదించసాగాడు.

ఈ ఉక్కుమిల్లులో పూర్వం పాంతెలీ కాజిమోవ్ చేసిన పనియొక్క ప్రాముఖ్యంవల్ల యుద్ధంవచ్చినప్పుడు వెంటనే అతడు సైన్యంలో చేరనవసరం లేకపోయింది. కాని తన స్వీయనగరపు పొలిమేరల్లోకే ఆ యుద్ధరాక్షసి చొచ్చుకు వచ్చినప్పుడు అనేకమంది పార్టీసభ్యులతోబాటు తాను గూడ ఐచ్ఛికంగా పోయి సైన్యంలో చేరాడు. ఒక నెలగడచింది. అప్పటివరకు ఉక్కును కరగించడంలో తన జీవితం గడపిన యీ కార్మికుడు ఒక టాంకుడ్రైవరుగా తర్ఫీదు పొంది దక్షిణరంగ యుద్ధభూమిలో పాల్గొన్నాడు. ఆసంవ

త్వరగా శీతాకాలం ఆరంభంలో తన కుటుంబంవారంతా ఊరల్స్ పర్వతశ్రేణులమధ్య ఎక్కడో నక్కివున్న ఒకచిన్న పట్టణానికి తరలిపోయినట్టు తనకువచ్చిన జాబులనుబట్టి తెలుసుకున్నాడు. దేశపటంలో ఆనగరం ఎక్కడున్నదో నని ఎంత వెదికినా కనిపించనేలేదు. భార్యవద్దనుంచి మాత్రం ఉత్తరాలు వచ్చేవి: తానొక భవననిర్మాణపు పనిలో కుదిరాననీ, తనూ బిడ్డలు సుఖంగా జీవిస్తున్నారనీ వ్రాసింది. మరల హఠాత్తుగా జాబులువ్రాయడం ఆపివేసింది. కొన్ని మాసాలు గడచాయిగాని తన కుటుంబక్షేమ సమాచారాలు ఏవీ అతనికి తెలియలేదు. చిట్టచివరకు ఒకరోజున తను ప్రాణాలకు తెగించి దాదాపు చక్రబంధంలో చిక్కుకున్న స్టాలిన్‌గ్రాడ్ నగరరక్షణలో పోరాడుతున్న సమయంలో దూరాన ఆఊరల్స్‌లోని ఉక్కుకర్మాగారపు పార్టీఆర్గనైజరు వద్దనుండి ఒకజాబు వచ్చింది : తనభార్యా బిడ్డలు టైఫస్ వ్యాధితో మరణించినట్టు కాజిమోవ్‌కు తెలిసింది.

అనేక దినాలు పాంతెలీ కాజిమోవ్‌కు మాట పడిపోయింది. అప్పటికే అతనిసైన్యం పురోగమిస్తోంది. కాజిమోవ్ టాంకుదళం యుద్ధం అతితీవ్రస్థాయిలో జరిగే రంగంలోనే ఎప్పుడూ పోరుసల్పుతూండేది. నిర్దాక్షిణ్యకాఠిన్యంతో సాగే దాడులవల్ల, సైనిక జీవితపు ఒడుదుడుకులవల్ల అతని దుఃఖం బండబారింది. అయినప్పటికీ యీ సీనియర్ లెఫ్టనెంటు కాజిమోవ్‌లో కలిగిన మార్పు అతని సహచరుల దృష్టినుండి తప్పిపోలేదు: ఎల్లప్పుడూ కలకలలాడుతు, కలుపుగోలుగాతిరిగే యీ వ్యక్తి నిరసనగా మూగవోయిన మనసు

గల మనిషిగా మారిపోయాడు. పూర్వం తనతోటి కార్మికు లుగా పనిజేసిన వారితో జరిపే ఉత్తరప్రత్యుత్తరాలు హఠాత్తుగా ఆపివేశాడు. యుద్ధానంతరం తిరిగి స్వస్థలానికి పోకూడదని నిశ్చయించుకున్నాడు.

దుఃఖంతో కాజిమోవ్ ఎంతగా కుంగుతున్నప్పటికీ సమరంలో అతని ధీశక్తి ఏమీ పారుబోలేదు. తన టాంకు దళంతో నాలుగు దేశాలగుండా సాగిపోయాడు; చివరకు జర్మనీలో ఎల్బ నదీతీరంమీద ఆగాడు. సాయుధ శకట సైన్యంలో సీనియర్ లెఫ్టనెంటు పదవినీ, ఆరు పతకాలను, నాలుగు గాయపు మచ్చలను సంపాదించుకున్నాడు.

శక్తిసామర్థ్యాలుగల శిక్షితుడైన వ్యక్తిగా కాజిమోవ్ పేరొందాడు. తన క్రిందివారియెడల చూపే నిక్కచ్చితనాన్నే తన విధుల్లోను చూపేవాడు. పైగా అతనికి పారిశ్రామిక రంగంలో ఎంతో అనుభవంకూడ వుంది. అందువల్లనే యుద్ధం ముగిసిన అంతిమదినాన ఇతని టాంకుదళమే విముక్తి జేసిన ఒకచిన్న నగరంమీద కమాండెంటు పదవిని తీసుకొమ్మని సూచించారు. యుద్ధానంతర జీవితాన్ని పునర్నిర్మించుకోవలసిన అవసరం యీ విధంగా తప్పిపోయినందుకు సంతసించి వెంటనే ఆపదవికి ఆమోదించాడు. ఒకనాటి ఉక్కును కరగబోసే కార్మికుడే ఇప్పుడిక్కడ ఆర్థిక వ్యవహారాల రంగంలో సహాయ కమాండెంటుగా కుదిరాడు.

ఎంతో కష్టపడి పనిజేసి తన విధులన్నీ నిర్వహించేవాడు కాజిమోవ్. అతని సహచర సైనికాధికారులు సమి

ష్టిగా సమావేశమైన సమయాల్లో యితనిని ఒక ఆదర్శ ప్రాయునిగా యెంచుకొనేవారు.

కాని యీ టాంకుదళాధిపతి హృదయాంతరాళంలో నిజాని కింకా ఉక్కును కరగించే కార్మికుడుగానే వుండి పోయాడు. ఒకసారి యుద్ధఘోషలన్నీ సమసిపోయి, విజయ భేరీ నినాదాల హోరు సద్దుమణిగి, ఫిరంగుల మూతులమీద కాన్వాసుముసుగులు కప్పినతర్వాత తన పాత ఉక్కుకర్మా గారానికి తిరిగి వెళ్ళేందుకు అనుమతించాలని వొత్తిడి చేయ సాగాడు.

యుద్ధం ముమ్మరంగా సాగేరోజుల్లో ఇతని టాంకుదళం ఏదయినా పారిశ్రామికపట్టణాన్ని ఆక్రమించినపుడు అక్కడ ప్రతిదీ—నల్ల బారినమంచు, గంధకపుపొగలతో ఉప్పనైన గాలి, కాలిక్రిందబురద—ప్రతిదీ తానుపనిచేసిన ఉక్కుమిల్లు వాతావరణాన్నే స్ఫురణకు తెచ్చేది. ఈ ఆఫీసరు గుండెల్లో ఏదో కలకవేసినట్టయ్యేది. దూరాన ఊరల్స్‌లో ఆ విచిత్ర నగరములో పనిచేస్తూన్న తన చిరకాల మిత్రులతో సమా గమం కోసం ఎంతగానో తహతహలాడేది. అయితే నేమి? టాంకులు మున్ముందుకే దూసుకుపోయాయి. ఉక్కు కర్మా గారం—దానిస్మృతులు అన్నీ వెనుకబడ్డాయి. యుద్ధప్రమా దాలు, ఊహాకందని కష్టనష్టాల నడుమ తన పాతపనికోసం అతనుపడే వ్యథ అంతా అంతరించిపోయింది.

అయితే యుద్ధం సమాప్తమై, ఆ ఎల్బ్‌నదీ తీరాన ఒక పరాయినగరంలో మరోసారి శాంతియుత జీవితంలో

అడుగిడినతర్వాత తిరిగి యీ పాతకోర్కె లన్నీ యింకోసారి అతని హృదయంమీద దాడిచేశాయి. ఆ క్రొత్త స్థలంలో, సహజసిద్ధమైన ఒంపుసొంపు లేపి లేక, పురాతన 'గాథిక్' శిల్పాన్ని తెలిపే చర్చిగోపురం తన కిటికీకి యెదురుగా నిత్యం కంటబడుతూన్న ఆ పట్టణ రూపురేఖలు—ఆ నగరం ఎంత గౌరవనీయం, నిర్మలం అయినా—అతనిలో వెగటునే కలిగించింది.

పగలు అస్తమానం కమాండెంటు పదవితో సంభవించే అనేక క్లిష్టసమస్యల పరిష్కారంలో మునిగి తేలుతు తన గతాన్ని మరవగలిగాడు. తన పనిని యెంతో చైతన్యంతో, కొంత ఉత్సాహంతో కూడ చేసుకుపోయేవాడు. కాని రాత్రివేళలూ, ఆదివారాలూ యీ ఆఫీసరుకు నరక కూపంలా తయారయ్యాయి. ఇంటిమీద గాలితిరిగి తను పొందే ఆందోళన మరీ భరించరానిదైనపుడు సాధారణ పౌరదుస్తులు ధరించి బజార్లవెంట తిరగడానికి వెళ్ళేవాడు. అది 1945. ఆ పట్టణంలోనున్న ఫ్యాక్టరీ లన్నీ పాతవే. వాటిమీద యాజమాన్యం ప్రైవేటువ్యక్తులదే. పాతవ్యవస్థే యింకా అమలులో వుంది. తన దేశంలో ఆ సువిశాలమైన 'స్టెప్పీ' నడుమ యెంతో విశాలంగా నిర్మింపబడిన తన బ్రహ్మాండమైన కర్మాగారంతో పోల్చగలిగింది యేదీ కనిపించలే దతనికి.

ఐనప్పటికీ ఆ పొగచూరిన నేలమీద గంటలతరబడి తిరుగుతూనే వుండేవాడు. అతని ఆలోచన లన్నీ వెనక్కి

మళ్ళాయి. తన బాల్యంలో భవననిర్మాణపు పనిలో యెలా పనిచేసిందీ, ఇప్పటి బ్రహ్మాండమైన కర్మాగారానికి పునాదులు వేసేనాడు యెలా యిటుకలు మోసిందీ జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. అటుతర్వాత ఆ మిల్లులోనే విద్యార్థిగా జేరాడు. అక్కడ ఘోషించే ఖార్ఖానాలో పనిచేయ మొదలెట్టినప్పుడు అక్కడ చేరిన యువకు లందరిని నిప్పులుకక్కే బట్టీముందుకు నెట్టుకుపోయి తా మందరికీ తర్ఫీదునిచ్చే ముసలి పొలిట్రాప్ ద్మిత్రియెవిచ్ సుఖోవ్ యిలా సంబోధించేవాడు :

"కార్మికవర్గ సోదరులారా! మీరు ప్రేమించిన ప్రియసఖినిఎలాచూసుకుంటారోఅలాగేయీబట్టీనికూడచూడండి. దీనితో పని చేయాలంటే అదికోరే ప్రతి గొంతెమ్మకోరికా మీరు తీర్చవలసిందే" ఆతర్వాత తనూ, తన అసిస్టెంటూ, మొత్తం దళమంతా కలిసి ఎలా మొట్టమొదటిసారిగా ఆ బట్టీ ముందర పనిచేశారో మరోసారి మననం చేసుకొన్నాడు. ఆ బట్టీలోనుంచి కరగిన ఉక్కును—కుతకుతలాడుతూ పొంగిపొర్లి ప్రవహించే ఉక్కును—సజీవపదార్థం లాగ తమ అభీష్టానుసారం ఎలానడపిందీ ఇంకోసారి జ్ఞాపకం జేసుకొన్నాడు. అత్యంతవేగంతో ఉక్కును కరగబోయడంలో దేశంమొత్తం మీద తనూ, తనదళమూ కలిసి 'రికార్డు' స్థాపించిన దినాన ఎంతగా ఉప్పొంగిపోయాడో!

ఇవన్నీ జ్ఞప్తికితెచ్చుకోవడం అంతా వృథా! ఒక్కసారిగా ఇంత అమూల్యమైన ఊహాచిత్రా లన్నింటినీ ఎంతో బాధతో వెనక్కునెట్టేసి, తిరిగిపోయి, తను మామూలుగా ధరించే ఆఫీసరు దుస్తులు వేసుకొని, మరల తన కమాండెంటు

విధుల్లో నిమగ్నమయ్యేవాడు. కాని అతడు తన పాతపని కోసంపడే తహతహ మరింత బలంగా పెనవేసుకోసాగింది. రాత్రిళ్ళు కళ్ళను పొడిచేలా ప్రజ్వరిల్లుతూ, ప్రవాహాలుగా బయటపడే ఉక్కునుగురించే కలలు గన్నాడు. మధ్యలో ఏవో సంతోషం, ఏదో బాధమిశ్రితమైన కలవరపాటు రాగా అంతలోనే మేల్కొనేవాడు. మరల ఉదయమయ్యేసరికి యీ గందరగోళమంతా సర్దుమణిగేది.

చివరకు ఒకనాడు యీ క్షోభను ఇక భరించలేక పోయాడు కాజిమోవ్. నోటిమాట చేసిన అభ్యర్థనలన్నీ వమ్ము అయిన తర్వాత పై అధికార్లకు లాంచనప్రాయంగా వ్రాత పూర్వకంగా తన రాజీనామాను అందించాడు. అందులో అలా రాజీనామా పెట్టడానికి కారణంగా దేశానికి అనుభవజ్ఞులైన ఉక్కు కార్మికులెంతఅవసరమో వాదించాడు. ఆనగర కమాండెంటుకూడ అతనితో కలిసి యుద్ధంలో పోరినవాడే. కాబట్టి కాజిమోవ్ పడేబాధ అతనికీ అనుభవమే. అందువల్ల కాజిమోవ్ అభ్యర్థనను అతడుకూడ బలపరచాడు. సైన్యం లోనుంచి విడుదలపొందినట్టి ఉత్తరువులు అందీ అందడం తోటే తనకు రావలసిన జీతభత్యాలకొరకైనా వేచియుండక స్టేషనుకు పరుగెత్తాడు. తనమాతృభూమినుండి వీచే స్వచ్ఛంద స్వేచ్ఛావాయువులను పీల్చినంతనే తన దుఃఖమంతా పటాపంచలవుతుందనే నమ్మికతో ఎంతో హాయినిపొందాడు.

ప్రయాణం ఆరంభమైంది. తనరైలు వానపాములాగ మెల్లగా పోతూన్నట్టు భావించాడు మొదట్లో. ఆగిన ప్రతి

స్టేషనులోను తన దేశసరిహద్దు మరింకెంత దూరమున్నదో నని ముందుకురికి ఆచోకీలు తీశాడు. చివరకు ఇంత ఆలస్యాన్ని భరించలేక తనుచేరిన మొట్టమొదటి పెద్దనగరంలో దిగిపోయాడు. రైలు టిక్కెట్టును గాలిలోకి గిరవాటు వేసి అక్కడనుంచి విమానంలో ప్రయాణం సాగించాడు.

లక్ష్యాన్ని చేరుకునేటప్పటికి సాయంకాలమయింది. కాని ఇక్కడ ఇంకో క్రొత్తదెబ్బను ఎదుర్కొనవలసివచ్చింది; ఇంతకాలంగా తను ఏసహచరులు, స్నేహితులకొరకు తహతహలాడి పోయాడో, ఏఆప్తుల సహచరత్వంలో తను వృద్ధిగాంచాడో, తనుసాధించిన అమోఘవిజయాలను ఎవరితోడ్పాటుతో సమకూడినాయో ఆ పూర్వమిత్రులు,ఆప్తులు అందరు తమ నగరాన్ని వదలి సుదూరాన ఎక్కడో ఊరల్సనడుమను నెలకొన్న అపరిచిత ప్రదేశానికి వెళ్ళిపోయారు. వీరంతా యుద్ధకాలంలో తమ ఉక్కుమిల్లుతో బాటు తరలిపోయినవారే. వెళ్ళి అక్కడే ఆ ఉక్కుకర్మాగారంలో పనిచేస్తూ స్థిరపడిపోయారని తెలుసుకున్నాడు. మరి ఇక్కడ, ఒకప్పుడు తన స్వస్థలమైన యీ ప్రదేశంలో తిరిగి ఇంకొక ఉక్కుమిల్లును కట్టారు. బయటకు తమ పాత కర్మాగారంలాగే కనబడుతున్నది గాని అందులో పనిచేసే వారంతా-పార్టీకమిటీలోను, ఆఫీసులోను, చివరకు యీమిల్లు వార్తాపత్రికలో గూడ-పనిచేసేవారందరు తనకుక్రొత్తవారే. సైన్యంనుండి విడుదలపొంది ఇంత ఆత్రుతతో ఇంటికిచేరిన యీఆఫీసరుకు సుపరిచితమైన ముఖం ఒక్కటీ కనిపించలేదు.

పాతమిల్లుకు బదులు మరో క్రొత్తది వెలిసింది. కాని మధ్యవయస్కుడయిన యీ మాజీ ఆఫీసరును గుర్తించిన వారు ఒక్కరైనా లేకపోయారు. కాజిమోవ్‌ను కలిసేందుకు ఒక్కరూ ముందుకు రాలేదు; ఎవరూ ఆప్యాయతతో కౌగలించుకోనూలేదు. దీర్ఘకాల మిత్రులు చిరకాలానికి కలిసినప్పుడు జరిగేవిధంగా ఎవరూవచ్చి అతని చెంపలమీద ముద్దులు పెట్టలేదు. ఇతరులకు పరిచయం చేయబడినప్పుడు తన పేరు విన్నవారికి దాని అర్థం ఏమీ తెలియలేదు. మిల్లులో ప్రతిచోట పరిశీలనగానో, మర్యాదపూర్వకంగానో అతనివంక చూశారుగాని ఒక స్నేహితుణ్ణి చూసినట్టుమాత్రం చూడలేదు.

ఇలాంటిదే ఒకటి జరిగింది పాంతెలీ కాజిమోవ్‌కు ఒకనాడు. ఆరోజు బాగ ఉక్కపోస్తోంది. ఫెళాఫెళా పేల్చి పెడుతున్న మండుటెండలో తమ టాంకుదళాలు దూసుకుపోతున్నాయి. టాంకులమీద లోహకవచాలు కాలిపోతున్నాయి. వేడిదుమ్ము నలుదిక్కులా విరజిమ్మతోంది. నలుదిశలా అంతులేని 'స్టెప్పీ' భూమి. కాని మిలిటరీ మ్యాప్‌లో ఒక చిన్నచర్చ్, దాని ప్రక్కన ఒకబావి ఉన్నట్టు గుర్తుపెట్టబడింది. కాజిమోవ్ నాయకత్వాన అతని టాంకుదళం ఆచోటుకు ఉరకలుదీసింది. అతని సైనికులందరూ అలసటతో, దప్పికతో స్పృహదప్పి పడిపోయేలాగున్నారు. అయినా తమకు ముందర త్రాగేనీరు దొరుకుతుందనే ఆశతో ముందుకే త్రోసుకుపోయారు.

చివరకు ఆ ప్రదేశానికి వచ్చి చేరారు—పచ్చని చెట్లు, ఆ చిన్న చర్చికి బదులు కూలిపోయి ప్రోగుపడిన యిటుకలగుట్ట అగుపడ్డాయి. తన టాంకు యింకా ఆగి ఆగక మునుపే కాజిమోవ్ బయటకు ఉరికి పారజూచాడు. ఆశ్చర్యంతో ఎండి పొడిబారిన వేడిగాలిని పీల్చుతు అలాగే నిలబడిపోయాడు. అక్కడ బావికి బదులు ఫిరంగిగుండ్లకు పగిలి బద్దలైన ఒక పెద్ద అగాధం అగుపించింది. దాని పంచలందు తేమ యింకా ఇంకిపోలేదు. బెరడంతా వూడిపోయినా ఒక చిన్న మొక్క యింకా చావకుండ నిలబడేవుంది. కాని త్రాగేందుకు నీరుమాత్రం ఒక్క చుక్కయినా దొరకలేదు. ఈ సంఘటన కాజిమోవ్ స్మృతిపథాన్నుండి దాదాపు చెరగిపోయింది. అయినా అతడు మరల తన స్వస్థలానికి చేరుకున్న యీనాడు ఆ విషయం పదేపదే స్ఫురణకు రా సాగింది.

"అదీసంగతి, క్రామేడ్ ష్లికోవా పిట్ట గూటికిచేరింది. కాని ఆగూడే మారిపోయింది. అందులో కాపురం చేస్తున్న పిట్టలూ పరాయివే," అని నిట్టూర్చాడు భారంగా పాంతెలీ పెత్రోవిచ్. సిగరెట్టు ఒకటి వెలికిలాగి ముట్టించబోయాడు గాని నాలుగైదు అగ్గిపుల్లలు విరిగినా అది అంటనేలేదు. మరల ఆ సిగరెట్టును నలిపేసి జేబులోపల పెట్టేశాడు. "నేను తిరిగి ఇక్కడకు రావడంలో అర్థంలేదనేది సుస్పష్టం. పాంతెలీ కాజిమోవ్‌ను ఎరిగున్న వాళ్ళెవరూ లేరిక్కడ. అసలు యీ కాజిమోవ్ ఎవరు? ఆయనకేం కావాలిక్కడ?"

మరో సిగరెట్టు తీశాడు; వణుకుతున్న అతడి హస్తాన్ని ఆమె చూసింది.

"అయితే, పాంతెలీ పెత్రోవిచ్! గుర్తించడానికి మాత్రం ఎవరున్నారిక్కడ? ఈ వచ్చిన వాళ్ళంతా కొత్త వాళ్ళేనాయె, యుద్ధసమయంలో తరలిపోయిన నేనుకూడ తిరిగి ఇక్కడకు వచ్చినప్పుడు నా మకాం ఎక్కడో నాకే అర్థంకాలేదు- ఇదేనా నా గృహం? ఇందులో నేనా నేను గృహిణిని లేక నేనేమయినా ఒక అతిథిని మాత్రమేనా?... సరే, ఆ ట్రంకుమీద మీకు పక్క వేస్తాను- మీకేం- అభ్యంతరం లేకపోతే," అన్నదామె.

క్లావ్దియా పక్క పరుస్తూనే ఒకసారి తలెత్తి అటుగోడ మీద వ్రేలాడుతున్న ఫొటోవంక చూసింది— అందులో నిర్మలనయనాలు, ఉత్సాహవంతమైన వదనంగలవిగ్రహం కనిపించింది. తిరిగి యీవైపు చూచినప్పుడు అదే సజీవ విగ్రహం మధ్యవయస్కుడై, వంగబడిపోయి, బట్టతలతో, తనముందు చల్లారిన టీపాత్రను పెట్టుకొని కూర్చునివున్నాడు. మరోసారి దీర్ఘంగా నిట్టూర్పు విడిచిందామె. గదిలో వెలుగుతున్న బల్బుమీద పేపరు కాగితం మడతవేసి తొడిగింది. గదినంతా అంధకారం అలుముకున్నది.

"సరే, ఇక పడుకోనండి. ఇంత ప్రయాణం జేసి వచ్చిన తర్వాత కొంచెం నిద్రపోవడమే మంచిది. మనమేమో చాల ప్రొద్దుపోయేవరకు మాట్లాడుతూ కూర్చున్నాం. నేను రేపు ఉదయం ఆరింటికే లేచి మిల్లుకు వెళ్ళి అక్కడనుంచి పోత

పోసిన ఉక్కును స్టేషనుకు చేరవేయాలి. అది చాల అర్జంటు పనికూడ - మైమరచి నిద్రపోకపోతే నయమే" అన్నది క్లావ్దియా.

కాజిమోవ్ లేచివెళ్లి తన సూట్‌కేసులోనుంచి ఆ పాత అలారం గడియారాన్ని బయటకు తీశాడు. 'కీ' ఇచ్చి, 5-30 గంటలకు అలారంబెట్టాడు. దానిని టేబిలు మీాద వుంచడంతోటే గదిఅంతా దాని టిక్కు టిక్కులతో నిండిపోయింది. గదిఅంతా వెచ్చనై మరింత సుఖదాయకమైనట్టు తోచింది క్లావ్దియాకు.

"మీారుకూడ పడుకోండి, మరి ఈ 'ఆర్దర్లీ' చాల సమర్థుడు; తప్పకుండా మిమ్మల్ని టైంకు లేపుతాడు. మీాకు అంగీకారం అయితే నే నింకా కొంచెంసేపు మేలుకొనే వుంటాను," అని కాజిమోవ్ ఆమె మంచంవేపు వీపుత్రిప్పి కూర్చున్నాడు. ఆవిడ మార్చుకుంటున్నదుస్తులు గలగలమంటూంటే తనముందున్న గడియారపు ముళ్ళకేసి సాలోచనాపూర్వకంగా చూస్తూ ఆవిడతో సంభాషించాడు.

"నాకు యీా గడియారం స్టాలిన్‌గ్రాడ్ నగర శిథిలాల్లో దొరికింది. దీనికి 'కీ' ఇచ్చి చూశాను; ఏదో ప్రాణంపోసినట్టు వెంటనే టిక్కు-టిక్కుమని రొదపెట్టింది. ఎందుకో తెలుసుకోకుండానే నా గ్యాస్‌కవచపు సంచీలోకి తోసేశాను. మళ్ళీ నా కందకంలోకి చేరిన తర్వాత చూస్తే ఇది ఇంకా కొట్టుకొంటూనే వుంది. ఆనాటినుంచి నాతో కలిసి దేశదేశాలు తిరిగింది. ఇది అలా ఆనందంతో టిక్కులుకొట్టు

తూండడం నాకెంతో యిష్టమయింది; నాకు మా యిల్లు జ్ఞాపకానికి వచ్చేది. నా భార్యకు బహుమతిగా దీనిని తీసుకు వెళ్ళి మా డ్రాయరుమీద నిలబెట్టాలని తోచింది. ఇదైతే యూరప్ అంతా తిరిగివచ్చిందిగాని దీనిని నిలబెట్టేందుకు ఏమీ మిగులలేదు......ఇవ్వాళ స్టేషనులోనుంచి బయటకు రావడంతోటే పూర్వం నేను నివసించిన పేటకు వెళ్ళాను. కాని అక్కడకూడ ఏమీ మిగులలేదు—అంతా ఖాళీ ప్రదేశమే!"

"ఖాళీ ప్రదేశం? అక్కడ ఇళ్ళ బజార్లు రెండు వెలిస్తే! అక్కడికే మేము చాలసార్లు ఇటుకలు మొదలైన భవన నిర్మాణ సామగ్రిని చేరవేస్తూంటాం," అన్నది క్లావ్డియా. ఆమె అలా మాట్లాడుతూనే ఆరాత్రికి ఇక విశ్రమించేందుకు ప్రయత్నిస్తున్నదని ఆమె మంచంనుంచి విన వచ్చే కిర్రుకిర్రుమన్న శబ్దం తెలియజేస్తున్నది.

"ఆ ఇళ్ళ వరుసలు ఉన్నాయేమో, మరి. నేనైతే గమనించలేదు. అప్పుడు మంచుతుపాను కూడ చెలరేగింది. ఒకవేళ ఉన్నాయేమోలే. నిజమే, ఎవరైనా ఒక కొత్త ఇల్లు కట్టుకోవచ్చు. కాని నాయిల్లో...ఏంప్రయోజనంలే!"

సరిగ్గా ఉదయం ఐదున్నరకు గడియారం క్లావ్డియాను లేపింది. హఠాత్తుగా లేచి పక్కనడుమను కూర్చున్నది. మొదట్లో ఆతాళయుక్తమైన టకటకశబ్దం ఎక్కడిదో అర్థం కాలేదామెకు. ఆవిడ ప్రక్కనే నిద్రపోతున్న పిల్లవాడికికప్పిన కంబళీ జారిపోయింది. అలవాటుచొప్పున దానిని సర్దిపెట్టి

ఆప్యాయంగా వాడి చెక్కిలి నిమిరింది. అంతే. ఒక్కసారిగా గతుక్కుమని తేరుకున్నది. పొగాకువాసన, తేమబారిన బూట్లవాసన, పరిచయంలేని వాసనలు ఏవేవో దేనినో పరిచయం చేస్తున్నట్లయింది. హఠాత్తుగా నిన్నటి సంఘటన స్ఫురణకు వచ్చింది. చిన్నగా ఒక్కసారి అరిచి, పక్కమీది గుడ్డలతో గొంతువరకు కప్పుకొన్నది.

"సరే కానివ్వండి. గుడ్డలు వేసుకోండి" అన్నాడు కాజిమోవ్. అత డింకా వీపును ఆమెవైపు వుంచి అలాగే టేబిలుముందు కూర్చునివున్నాడు.

అతని ముచ్చిలినీ, ఇటీవలనే సంస్కారంపొందిన అతని జుట్టును, మెడమీద గాట్లు తేలిన ముడుతలను కళ్ళు వప్పగించి ఆశ్చర్యంతో చూచింది క్లావ్దియా. అతను ఎప్పుడు లేచి, దుస్తులు ధరించాడా అని విస్తుబోయింది. అప్పుడు ఆమె దృష్టి అక్కడే టేబిలుప్రక్కన ప్రోగులుపడిన సిగరెట్టు ముక్కల మీదకు మళ్ళింది. గదినంతా నీలంగా అలముకున్న పొగ తెరలగుండా చూసినప్పుడు అతనిపక్కమీద తలగడ ఏమీ చెదరక, సాఫీగానే వున్నట్లు కనబడింది. కాబట్టి అసలు ఆ వింతమానవుడు విశ్రమించనే లేదన్న మాట!

ఇంటినీ, సంసారాన్నీ కోల్పోయి యేకాకిఅయిపోయిన యీ మనిషిని చూచినపుడు ఆమె హృదయం కరుణతో నిండిపోయింది. కాని యీ కరుణ అంతలోనే చీకాకువల్ల మలినమైంది. బ్రతుకే భారమై అనేక కష్టాల్లో మునిగి తేలుతూన్న తన జీవితంలోకి యితనెందుకు ఊడి

పడ్డాడు ? ఐనా అతడూ తనవారిలోనివాడేగదా ! తన భర్తకు మిత్రుడుకూడ. మరి అతన్ని వెళ్ళిపొమ్మని చెప్పడ మెలా? అంతేగాదు. అత నెంత దుఃఖాన్ని భరించవలసివచ్చిందో! మరి యీ గదినిచూస్తే—అసలు కాలు కదిపేందుకే చోటు లేదే! దీనికితోడు యిరుగుపొరుగువాళ్ళ యికిలింపులు, సకిలింపులు భరించాలి. ఊఁహూఁ! అదిమాత్రం సహించలేను. కాని అతడు మాత్రం వెళ్ళగలిగేది యెక్కడికి ?"

ఏది ఏమయినాసరే అలా తీరికగాకూర్చుని ఆలోచించడానికి టైంలేదు. క్లావ్దియా దుస్తులు వేసుకొని, ఉన్ని చెప్పుల్లోకి పాదాలుదూర్చి, ఒకతుండు లాక్కొని భుజానవేసుకొని గబగబా స్నానాలగదిలోకి పోయింది. ఎర్రబారిన ముఖంతో, కోపంగా తిరిగివచ్చింది. తన అతిథివంకఅయినా చూడకుండానే ఒక రొట్టెను ముక్కలుగా తరిగింది. ఒక పళ్ళెంలో పోసివున్న ఉడకపెట్టిన పొట్టుతీయని బంగాళాదుంపలను ఒక పేపరుకాగితంలో పొట్లంకట్టింది. ఇంత నములుకుంటూపోయి వాకిట్లోకి దారితీసింది.

"క్లావ్దియావాసిల్యేవ్నా! సాయంత్రంవరకు నా సూట్ కేసును యిక్కడే పెట్టుకోనా?" అని కాజిమోవ్ అడిగాడు.

"వదిలేసి వెళ్ళండి" అని సమాధానం చెబుతూనే గుమ్మంలోకివెళ్ళిన మనిషి మరల వెనక్కుతిరిగి, "సాయంత్రంవరకే," అన్నది.

వెళ్ళిపోయేముందు ఒకసారి తన ఇంటిని యీజమాన్యపు దృక్కులతో కలయజూచుకొన్నది; కాజిమోవ్ భుజాలమీద వంపు మరింత ప్రస్ఫుటమయినట్లు తోచిందామెకు.

# 3

యుద్ధం అనేకపాఠాలు నేర్పుతుంది. అందులో మొట్ట మొదటిది స్వీయశిక్షణ. గతదినం ఏమిజరిగినా సరే, నీ వెంత అలసిపోయివున్నప్పటికీ, ఆరాత్రి నిద్ర లేకపోయినా యీరోజు మళ్ళీ క్రొత్తరోజే. క్రొత్తసమస్య లనేకం. నీ కాలాన్ని ఏమాత్రం వృధాపుచ్చక యీ సమస్యలన్నీ నీవు పరిష్కరించాలి—నీ మనస్సు ప్రొద్దులు ఎలా వున్నప్పటికీను. అనేక యుద్ధరంగాలలో పోరాడి ఆరితేరిన అసంఖ్యాక అత్యుత్తమ వీరుల అనుభవాలమీాద రూపొందిన నియమ నిబంధనలను అనుసరించే నీవు యీసమస్యలు పరిష్కరించడానికి పూను కోవాలి.

బయట ఇంకా చీకటిగానేవుంది. ఉద్రిక్తపవన తరం గాలు కిటికీ చట్రాన్ని కుదిపివేస్తున్నాయి. పొడిమంచు కిటికీ అద్దాలను గీరుతోంది. గడియారం ఉదయమైనట్టు తెలిపింది. కాజిమోవ్ కుర్చీనుంచి లేచాడు. బట్టలపై బడిన సిగరెట్టు పొడిని దులిపేసుకున్నాడు. సూట్ కేసులో ఒక ఫ్లానల్ గుడ్డలో చుట్టిపెట్టిన బ్రష్‌లు, బూటుపాలిషువగైరా సామగ్రి బయటకుతీసి తన బూట్లకు మెరుగుపెట్టసాగాడు. అవి నీడలు

బారేలాగ మెరుపు తేలిన తర్వాత తన ఆఫీసరు దుస్తులకు ఒక సరిక్రొత్త తెల్లకాలరును కుట్టుకున్నాడు.

అంతలో గదిలో ఒకమూలన ఏదో కదలినట్లని పించింది. కాజిమోవ్ ప్రక్కకు తిరిగి చూశాడు: ఆ పిల్ల వాడు కప్పుకున్న కంబళీని తిరిగి తన్నేసి, వెచ్చదనంకోసం '3' అంకెవేసి పడుకున్నాడు. "వీడి పేరేమిటో"నని అను కొన్నాడు కాజిమోవ్. వాడి మంచం దగ్గరకువెళ్ళి, వాడి గుడ్డలను సర్ది పడుకోబెట్టి, వాడి గొరిగిన గుండ్రని గుండు వంక, నిద్దట్లో ఎర్రబారిన వాడి ఎత్తైన దవడలవంక తేరిపార జూచాడు. ఐచ్ఛికంగా యితర కమ్యూనిస్టులతోసహా తాను సైన్యంలోచేరిన సమయంలో తమదళాలను సమరరంగానికి తరలించిన రైలుబండివద్దకు వీడ్కోలివ్వడానికి తన కుటుంబం అంతా వచ్చింది; అప్పుడు కొడుకు వయస్సుగూడా ఇంతే! అయితే అతని బిడ్డ బక్కపల్చగా, బద్దంకిలాగ నల్లగావుండే వాడు; కాని వీడుమాత్రం ఎర్రగా, గుండ్రని ముఖంతో అందంగా వున్నాడు.

దూరాన్నుంచి ఒక కూత వినిపించింది. పూర్వం కాజిమోవ్ యెరిగినరోజుల్లో వినవచ్చే కూతలాగగాక యీ కూత బొంగురుగా, ఉబ్బసపు శబ్దం కలిగివుంది. ఏమైనా అలాంటి పిలుపుకు అలవాటుబడీన యీ పాత ఉక్కు కార్మి కుడు వెంటనే పనిలోకి వెళ్ళేందుకు త్వరపడ్డాడు. సబ్బుబిళ్లా, తుండుగుడ్డా పుచ్చుకొని బైట నడవలోకి వచ్చాడు. పచ్చ బారిన దరిద్రపు బల్బు ఒకటి ఆ నడవలో గ్రుడ్డివెలుతురు

నిస్తోంది.. అప్పటికే పగటి పనిలో చేరవలసినవారు అటునిటు మెసలుతున్నారు. కాజిమోవ్‌ను దాటిపోతూ ఆశ్చర్యంగా అతనివంక చూశారు. ఐనా లెక్క-జేయకుండా, వేలాది మైళ్ళదూరం నిద్రాహారాలు లేకుండా నాలుగేండ్లపాటు తన టాంకులో ప్రయాణంచేసి, ముక్కూ-ముఖం తెలియని పరాయి కొంపల్లో లెక్క-లేనన్ని రాత్రిళ్ళు గడపిన నిబ్బరంతో కాజిమోవ్ తన పనిమీద వెళ్ళిపోయాడు. ఏమూలన తన సైనిక సంచీని దించుకుంటాడో, ఏ మేకుకు తన కోటు, టోపీని తగిలించుకుంటాడో ఆ ప్రదేశాన్నే తన స్వగృహంగా ఎంచుకోడానికి అతడు అలవాటుపడే వున్నాడు.

పాకశాలగుండా నడచిపోయాడు; అక్క-డ పొయ్యి ముందరచేరిన మహిళాసమాజం మూతివిరుపులు, గుసగుసలతో విచిత్రంగా ఇతని వైపుచూసింది. అయినా అతడేమీ పట్టించుకోలేదు. కాని ఆ గుసగుసల్లో తరచు వినవచ్చిన "క్లావ్దియా" అన్నపదం అతని మనస్సులో కలుక్కు-మన్నది; ఆలోచనకు పురిగొల్పింది.

చల్లని మంచుతో బిగదీసుకుపోయిన కిటికీ అద్దాలగుండా మసక వెలుతురు వడపోసుకున్నది. ఆ అద్దాలమీద మంచుకురిసి పేరుకున్న వింతచిత్రాలు ఉదయ సంధ్యాకాంతిలో మెరసి, జిగేల్మంటున్నాయి. ఉదయభానుని కిరణ ప్రకాశంముందు నిలువజాలక తిరోగమించిన ఆబల్బు వెలుతురు గదిలో టేబిలుపైన పేరుకుపోయిన సిగరెట్టుపొడిమీద, అణగారి తేమఎక్కి-న సిగరెట్టు పీకలమీద పడుతోంది. ఒక మూలన మసకగా అతనిబూట్లు మెరుస్తున్నాయి. కాజిమోవ్

ముఖం చిట్లించాడు. అవి అలామెరవడం—ఎన్నడూ కడుగ బడని, బహుశా కసువైనా తుడువబడని యీ గదిలో—అవి అలామెరవడం ఏదో తిరస్కారభావాన్ని, ఆత్మసంతృప్తిని తెలుపుతున్నట్టుగా వుంది. ఏ ప్రదేశంలోనయినా, ఎంత తాత్కాలికంగానే అయినా, కొద్ది గంటలకాలం మాత్రమే అయినా ఆ ప్రదేశాన్ని తుడిచి, శుభ్రపరచే అలవాటు ఒక్కసారిగా యీ అనుభవజ్ఞుడైన సైనికునిలో పైకి ఉబికింది.

కాజిమోవ్ చుట్టూ కలయజూచాడు. ఒకప్రక్కన పొయ్యిదగ్గర చింపిరిచీపురు ఒకటి అగుపడ్డది. మొదట్లో కసువు తుడవడానికి ఉపక్రమించబోయాడు గాని అసలు పాదోట్టు దులపకుండా ఊడవడం తెలివితక్కువ అనిపించింది. గుడ్డపేలిక ఒకటి పెట్టెలోనుంచి తీసి కిటికీలు, టేబిలు, డ్రాయర్లమీద చేరుకున్న దుమ్ము దులపసాగాడు. గదులు ఊడ్చడం, గిన్నెలు కడగడం, ఒకొక్కసారి వంటచేయబూనుకోవడం - ఇలాంటివన్నీ సంసారజీవితానికి సంబంధించి వుండడంచేతనేమో బహుశాయుద్ధరంగాన్నుండి తిరిగివచ్చిన సైనికులకు ఆ పనులంటే ఎంతో ఆకర్షించబడతారు. కాని ఒకసారి సాధారణ జీవితం అలవాటుగా తయారైనప్పుడు వీరే మళ్ళీ ఆపనులనే సంసారలంపటానికి చిహ్నాలుగా పరిగణించి వాటి జోలికైనా పోరు.

ఆ పరాయివారి ఇంటిని తుడిచి శుభ్రపరచడంలో కాజిమోవ్ ఒకవిధమైన సంతృప్తిని పొందాడు. ఇంత కాలంగా తనను ముందుకు పడద్రోసుకు వచ్చిందీ, నిన్నటి

రోజుననే తనను నిరుత్సాహపరచిందీ, గతరాత్రినిద్రలేకుండా చేసి అంతులేని ఆలోచనల్లో ముంచిందీ-అలాంటి అనిర్వచనీయమైన, ఆందోళనాకరమైన ప్రతిదానిని గురించీ ఒకవిధమైన ఉపశమనం అనుభవించాడు.

వంటగదిలో కుళాయిక్రింద మలినపాత్రలన్నీ పేర్చాడు. అంతలో ఎవరో తనను తేరిపారజూస్తున్నట్టయ్యి వెనుదిరిగి చూశాడు. పక్క మధ్యలో పిల్లవాడు కూర్చునివున్నాడు. వాని గుండ్రటికళ్లు భయం సంతోషాలతో మెరుస్తున్నాయి. అలా వారు ఇంతలేసి కళ్లు చేసుకొని చూస్తుంటే కాజిమోవ్‌కు శరీరం గగుర్పొడిచింది.

"ఎవరు మీరు?" చెవిలో వూదినట్టు మెల్లగా అడిగాడు ఆకుర్రవాడు. ఒళ్లుఅంతా నిక్కబెట్టి మరీ కూర్చున్నాడు. ఏక్షణాన్నైనా ఎగిరి గంతేసి వచ్చి తనపై బడి గట్టిగా కౌగలించుకుంటాడా అనిపించింది కాజిమోవ్‌కు. అలాభావించి ఆత్రుతగా సమాధానం ఇచ్చాడు.

"నేను ఒక ఆఫీసరును... అంతే ఒకప్పుడులే!"

"మీరు...?" అని అరచి అర్ధోక్తిలోనే ఆపివేశాడు ఆపిల్లవాడు.

గోడమీద వ్రేలాడే తన తండ్రి ఫొటోవంకా, తన ఎదుట నిలబడినవానివంకా చూస్తుంటే వాడి కళ్ళల్లో ఆశా నిరాశలు రెండూ కొట్టుకున్నాయి. ఈకుర్రవాడు ఎవరనుకొని అపోహపడుతున్నాడో కాజిమోవ్ గ్రహించాడు. అతని పసిహృదయంమీద తానెంత దెబ్బతీయవలసివస్తు

న్నదోకూడ అతనికి అర్థమయింది. యుద్ధభూమిలో ఎడతెగని ఫిరంగిగుండ్ల వర్షం తన టాంకుయొక్క ఉక్కుకవచంమీద పడి, భూనభోంతరాళాలు బద్దలయినట్టు ప్రేలుతూన్న సమయంలో ఎలా కుదించుకుపోయేవాడో అలాగే ఇప్పుడుగూడ తన ముఖ కళవళికలో మార్పేమీ లేకపోయినా లోలోన కుంచించుకుపోయాడు. అయినా కత్తిరించినట్టుగా, విస్పష్టంగా పలికాడు :

"మీ నాన్నకు నేను స్నేహితుణ్ణి. యుద్ధానికి మేమిద్దరం కలిసే వెళ్ళాం; కలిసే పోరాడాం. నా పేరు పాంతెలీ కాజిమోవ్."

ఎవరో చేయివేసి తుడిచినట్టు ఆ పిల్లవాడి కళ్ళల్లో మెరసిన వెలుగంతా ఒక్కసారి ఆరిపోయింది. శరీరం కుంచించుకున్నది. అయినా ఏడవకుండా నిబ్బరాన్ని చూపాడు. వెడల్పయిన పాదాలుగల తనకాళ్ళను జారవేసి ఊపుతూ అడిగాడు :

"మా నాన్నను ఫాసిస్టులు చంపడం చూశారా మీరు ?"

"మీ నాన్నది వీరమరణం"

యుద్ధకాలంలో నష్టపడిన అనేక సైనిక కుటుంబాలకు కాజిమోవ్ తన సానుభూతిని తెలియజేస్తూ ఎన్నో జాబులు వ్రాసివున్నాడు. కాని యీ క్రొత్త స్నేహితుడికి అలాంటి సానుభూతి పలుకులు ఎన్ని చెప్పినా తనివిదీరదనేది స్పష్టం.

అతను అన్నమాటను మర్యాదపూర్వకంగా విన్నాడు; విని హఠాత్తుగా అడిగాడు :

"ఆ సిగరెట్లన్నీ తాగింది మీరేనా? ఇక్కడ మాతో వుండిపోవడానికే వచ్చారా?"

"ఊఁ, ఏమిటంటే కొంతసేపు......" అని యిద మిద్ధంగా తేల్చిచెప్పలేక ప్రక్కతిరిగి సూట్ కేస్ వంకచూస్తూ అన్నాడు కాజిమోవ్. ఆ ప్రక్కనే టేబిల్ మీదవున్న అలారం గడియారాన్ని తీసుకున్నాడు ఆ పిల్లవాడు. చెవికి దగ్గరగా పెట్టుకొని విని, తిరిగి దానిని యథాస్థానంలో పెట్టేశాడు.

"చాల మంచి గడియారం. మీదేనా యిది?" అని కాజిమోవ్‌ను చూస్తూ తన విజ్ఞత నంతా ప్రదర్శిస్తూ అడిగాడు, "ఈ గది అంతా మీరు వూడ్చి ఉండాల్సిందిగాదు. ప్రతి శనివారంరోజున అమ్మా, నేనూ కలిసి యిల్లు శుభ్రం చేస్తాం. అమ్మ రోజంతా పని చేస్తూనే వుంటుంది; ఎప్పుడూ లారీ నడుపుతూనే వుంటుంది. మరి మీకు తెలుసో లేదో— సరిపడినన్ని లారీలు లేవుగా!"

మరోసారి గడియారాన్ని చెవికి ఆనించాడు.

"భలే గడియారం. అలారం కొడుతుందిదీ? బలే ఒళ్ళు మరచి నిద్రపోయి ఇక స్కూలుకుపోవడం తప్పిపోయేపనిలేదు. అసలు రోజంతా దాదాపు నా యిష్టంవచ్చినట్లు తిరుగు తూంటాలే—బజారుకెళ్ళి సరుకులు తెస్తా; మళ్ళీ మధ్యాహ్న

నికి భోజనం తయారుచేసుకుంటూ; హోంవర్కు కూడ పూర్తి చేస్తాను. రోజంతా గిరగిరా తిరగడమే సరిపోతోంది నాకు."

మాట్లాడుతూ మధ్యలో ఆగి ఆ గదిని ఓపికగా ఇంకా శుభ్రపరుస్తున్న అతిథిని పరకాయించి చూసి అన్నాడు:

"మీ కేనండి చెప్పేది! ఈపని మీరు చేయనవసరం లేదులే. నే ననేది...... అన్నిపనులూ చేసుకోగలను నేను. మా నాన్నవంటివాడిననీ, ఆయనలాగ చురుకైనవాడిననీ, అమ్మ అంటూంటుంది. మిమ్మల్ని పాంతెలీ మామఅని పిలవనా? నన్ను స్త్యోతోస్లావ్ లేకపోతే స్లావ్కా అంటారు. ఏం?''

ఈ స్త్యోతోస్లావ్ సిద్ధహస్తుడైన గృహస్తు. చలాకీ అయిన వేళ్ళతో బంగాళాదుంపలన్నీ పెచ్చుదీసి, ముక్కలు తరిగి పోశాడు. అలమరలోనుంచి దుమ్ముకొట్టుకున్న ఒకసీసా తెచ్చి ఆ ముక్కలమీద యింత వంట నూనెను గుమ్మరించాడు. వంటింట్లోనుంచి మరగకాచిన నీళ్ళు పట్టుకొచ్చాడు. పంచదార అయిపోయింది; అది లేకుండానే వట్టి టీ తాగేశారు. ఆ వేడివేడినీళ్ళు లోహపు కోపాలోనుంచి ఆర్చుకు ఆర్చుకు తాగడం కాజిమోవ్‌కు ఎంతో హాయినిచ్చింది. మధ్యలో ఒక్కోసారి తను నిజంగానే స్వగృహానికి చేరుకున్నట్టూ, తన పిల్లవాడే ప్రక్కన కూర్చునివున్నట్టూ, తనకెంతో సుపరిచితమైన బరువాటి పదధ్వని ఏ క్షణంలోనైనా వినబడవచ్చుననీ, అంతలోనే గదిగుమ్మంలో గుండ్రటి తేలిన, కలుపుగోరుతనంగల తనభార్య ప్రత్యక్షం కావచ్చుననీ, ఆ వెంటనే ఛలోక్తిగా ఏదో అంటుందనీ భావించాడు.

"మీరు వెళ్ళేప్పుడు తలుపు సరిగా తాళంవేసి మరీ వెళ్ళండి. వేసినతర్వాత ఒకసారి లాగిచూడడం మరచేరు! తాళంచెవిని ఆమూల నిప్పులార్పేదానికింద దాచి వెళ్ళండి. ఉన్నది ఒక్కటే చెవాయె అసహ్యంగా!''

స్వ్యతోస్లావ్ జాకిట్టులాగ మోచేతులవరకుమాత్రమే వచ్చిన ఒక చిన్న కోటు తొడుక్కొని వెళ్ళిపోడానికి సిద్ధమయాడు. టోపీమీదినుంచి క్రిందికి ఒక శాలువా కప్పుకొని ఏదోవిధంగా దాని చివళ్ళను వీపువెనక ముడివేసుకున్నాడు. కాని ఎందుకనో ఇలా దుస్తులు ధరించడంఅంటె అతనికి ఏదో న్యూనత అనిపించినట్టుంది:

"ఇదంతా అమ్మకోసం. ఇలా చుట్ట చుట్టగా నేను శాలువా కప్పుకోవడం ఆమెకు బాగుంటుందట. సరే కానియ్!'' అని కొంచెం కోపంగా "ఈ ఆడవాళ్ళకేం! సరే లెండి. వెళ్ళేప్పుడు తలుపును ఒకసారి గుంజిచూసి మరీ వెళ్ళండి-ఎందుకంటె తాళం తుప్పుబట్టివుంది;సరిగాపడదు.''

అతని ఉన్నిబూట్ల పాదాలు నడవకుండా మెత్త మెత్తగా ధ్వనిచేస్తూ సాగిపోయాయి. తర్వాత కిటికీక్రింద మంచుముక్కలు కరకరలాడాయి. అతన్ని తన మనోనేత్రంతోనే కాజిమోవ్ అనుసరించాడు. దిక్కుమాలిన చిరునవ్వు ఒకటి—ఏదో నరాల అదటులాగ—అతని చెక్కిలిమీద చెదరిపోయింది.

"మరి యీ స్వ్యతోస్లావ్ ఎవరి పోలిక? వాళ్ళ అమ్మా, నాయనా!'' అనే ఆలోచనలోపడి గోడమీద

వ్రేలాడుతున్న ఫోటోలో కనబడే విశాలమైన భుజాలు, ఎత్తైన దవడలుగల విగ్రహంవంక చూశాడు. బహుశా తండ్రివంటివా డనుకుంటాను... కాక తల్లి పోలికేనేమో!'' క్లాడియా షిక్‌లోవాను పోల్చుకోబోయాడు. కాని మందపాటి కోటూ, లాగూలు వేసుకొని, మగవాళ్ళబూట్లు తొడుక్కొన్న ఒక ధృఢకాయురాలు, ఆమె లోతైన, కొంచెం గీరబోయిన గొంతూ మాత్రమే అతని స్ఫురణకు అందాయి. ముఖం ఎలాగుంటుందో మాత్రం పోల్చుకోలేకపోయాడు. అసలతను అటుకేసి చూడనేలేదుగదా!

అయితే వెళుతూ చెప్పిన క్లాడియా మాటలుమాత్రం బాగానే గుర్తుకొచ్చాయి. బయటకు వెళ్లేందుకు సిద్ధమయాడు. తాత్కాలికంగా సైనికులు విడిది దిగే విశ్రాంతి ప్రదేశానికి హఠాత్తుగా ఆజ్ఞలు జారీ అయినప్పుడు అలవాటుగా చేసినట్టుగానే తన తుండుగుడ్డా, సబ్బుబిళ్ళ, బూట్ల బ్రష్షూ, చివరకు ఆ అలారం గడియారంతోసహా అన్నీ సూట్‌కేసులో సర్దేసి సిద్ధమయాడు.

ఆ పరాయిగదిని వదలినపుడు జాగ్రత్తగా తలుపుకు తాళంవేశాడు. దానిని ఒకసారి గుంజి లాగిచూసి, చెవిని నిప్పులార్పే దానిక్రింద దాచాడు. ఇదంతా చేస్తూంటే ఆ పిల్లవాడితో ఆ ప్రొద్దుటజరిగిన పరిచయం గుర్తుకొచ్చింది.

తిరిగి సాయంకాలానికి యేదైనా మరో వసతి దొరికిన సందర్భంలో యీ కుర్రవాడిని వొదిలేసి పోవాలిగదా అని కొంచెం విచారించాడు.

# 4

ఈ ఉక్కు కర్మాగారపు క్రొత్తడైరెక్టరుకు పాంతెలీ కాజిమోవ్‌తో పరిచయంలేదు. కాని యీ పాతఉక్కు కార్మికుని కీర్తి యీవరకే కర్మాగారం అంతటా వ్యాపించింది. అది యీ డైరెక్టరూ వినివున్నాడు. కాజిమోవ్ ధరించిన రంగురంగుల రిబ్బన్లను ఒకమారు పారజూచి కూర్చోమని ఆహ్వానించాడు. అతడు ఇంతకాలంగా పాల్గొనివచ్చిన యుద్ధాన్నిగురించీ, జర్మను దేశాన్నిగురించీ కమాండెంటు విధులను గురించీ ప్రశ్నించసాగాడు.

ఈ ఉక్కుమిల్లులో అనుభవశాలురైనవారు తక్కువగానే వున్నారు. అందుచేత కాజిమోవ్ తన అనుభవాలను చెబుతుండగా పరిశ్రమలో, యుద్ధంలో అతడు ప్రదర్శించిన శక్తిసామర్థ్యాల గురించీ, కమాండెంటు కార్యాలయంలోని ఆర్థికవ్యవహారాలపరిపాలనాదక్షతనుగురించీ శ్రద్ధగాఆలకించి అతనికి ఎలాంటి పదవి ఇచ్చినట్లయితే ఉత్తమంగా వుంటుందోనని ఆలోచించసాగాడుడైరెక్టరు.సైన్యంనుండి క్రొత్తగా విడుదలపొంది వచ్చిన యీ ఆఫీసరుయొక్క వ్యావహారిక పద్ధతీ, చురుకుదనం చూచినప్పుడు డైరెక్టరుకు సంతృప్తి

కలిగింది. చివరకు తమ సమావేశాంతంలో బాధ్యతలన్నీ సమగ్రంగా పరిశీలించి ఆ కర్మాగారంలో పరిపాలనా బాధ్యతల నిర్వహణలో వున్న అనేక పదవులలో ఏదో ఒకటి ఎన్నుకోనమని కాజిమోవ్‌ను కోరాడు.

ఈ ప్రతిపాదనను వినడంతోటే ఆగంతకుని ముఖం జేవురించింది.

"నేనంటే మీకు ఏమయినా ఎగతాళిగా వుందా ?" అని తనకేదో అవమానకరమైన విధులు సూచించబడినట్లు మధ్యలోనే అందుకొని అన్నాడు కాజిమోవ్.

"మీ రన్నది నాకు అర్థంకాలేదు."

"నేనూ మిమ్మల్ని అర్థంచేసుకోలేకపోతున్నా. ఇంత దూరం పడి వచ్చింది మీ ఆఫీసు కుర్చీల్లో ఆసనం అరగ దీసుకుంటూ కూర్చోడానికి అనుకున్నారా? కర్మాగారపు కార్ఖానాకోసం, అందులోని పెద్దబట్టీకోసం నా గుండెలన్నీ తహతహలాడుతున్నాయి తెలుసా?" అని ఈ చివరిపలుకులు బిగ్గరగా అరచాడు. అంతలోనే మరల సంబాళించుకొని అన్నాడు :

"ఆఫీసుపనికి కుదరటం నాకేమాత్రం ఇష్టంలేదు. ఇస్తే బట్టీముందర పని ఇవ్వండి—అది కాకపోతే ఇంకేమీ అవసరం లేదు. నా అవసరం ఒకవేళ మీకు లేకపోతే ఆమాటే చెప్పివేయండి ! ఊరల్స్‌లో పనిచేస్తున్న మావాళ్ళతో చేరతాను. నేనింకా వాళ్ళకు బాగ జ్ఞాపకమే వున్నాను—నన్ను అర్థంచేసుకోగలరు గూడ."

"కార్ఖానా లోపనిచేయాలని పట్టుదలగావుంటే మీరు అలాగే చేయవచ్చు. ఉక్కును కరగబోయటంలో అనుభవజ్ఞుడుకి ఎప్పుడూ ఖాళీ దొరుకుతుంది," అని యీ చిక్కిపోయిన పెంకిఘటం తనలో రేపుతున్న క్రోధాన్ని అణచుకోజూస్తూ పలికాడు డైరెక్టరు : "అయితే ఒక్కవిషయం గుర్తుంచుకోండి : చాలకాలంనుంచీ మీరు యీపని చేయడంలేదు. అందుచేత చాల కష్టంగానే వుంటుంది. అంతేగాక మా టెక్నిక్ కూడ చాల పురోగమించింది. మీరిక్కడలేని కాలంలో మేము ఎంతో ముందుకుపోయాము సుమా!"

"సరే. ఆ విషయం గుర్తుంచుకుంటాను. మరి నే నిక వెళ్ళిపోవచ్చునా?"

ఆ వెళ్ళిపోయే విగ్రహాన్నిచూస్తూ డైరెక్టరు ముఖం చిట్లించుకున్నాడు. తన ముందున్న టేబిలుగ్లాసుమీద వేళ్ళతో దరువువేస్తూ ఆలోచించాడు; మళ్ళా హఠాత్తుగా నవ్వసాగాడు. తానైనా ఎలాంటి అలసత్వాన్ని చూపించే వాడుగాదు. అందుచేత యీ విధంగా తమ పట్టుదలను నెగ్గించుకోడానికి పూనికబూనేవాళ్ళంటే ఆ డైరెక్టరుకు ఎంతో యిష్టం.

ఒక అరగంట దాటింది. మిలిటరీ భుజకీర్తు లన్నీ తీసివేసుకున్న యీ బట్టతల ఆఫీసరు ముళ్ళమీద నడిచినట్టు అడుగులో అడుగు వేసుకుంటూ మెల్లగావెళ్ళి 'బంయ్' మని రొదపెడుతున్న కార్ఖానాలో ప్రవేశించాడు. ఊపిరి పీల్చలేనంతగా అతనిగుండె దడదడలాడింది. తాను పుట్టి

పెరిగిన ఇంట్లో ప్రవేశిస్తున్నట్టు, కాని అందులో మరొకరు ఎవరో కాపురమున్నట్టుగా భావించాడు.

కార్ఖానాలో అడుగిడడంతోటే పాత అనుభవాలన్నీ గుర్తుకురాసాగాయి. బట్టీలనుండి అగోచరంగా ప్రవహించే ఉష్ణతరంగాలు, కాల్పులవల్ల ఉప్పనైనగాలీ, చీకటికోణాలను గూడ మెరిపిస్తున్న మంటలప్రకాశమూ, క్రేన్‌లను నడిపే వారి హెచ్చరికలు, చిమ్మిరియంత్రాల బుసబుసలు— ఇవన్నీ అతని యౌవ్వనంనుండే సుపరిచితమైన యీ ప్రపంచమంతా గూడ అతనికి ఎంతో దూరమైపోయిన ఆ పాత సుఖమయ జీవితస్మృతులు మరల ఇంకోసారి అతని స్ఫురణకు రాసాగాయి.

పరుగుపరుగునపోయి ముందుకు ఉరుకుదామనే ఉత్సాహాన్ని ఎంతో కష్టంతో అణచుకొని దూరంగా ఒకమూలన తానెన్నో ఏండ్లుగా పనిచేసిన బట్టీవలె కనిపించిన బట్టీవద్దకు వెళ్ళాడు కాజిమోవ్. కాని వెంటనే తెలుసుకోగలిగాడు అది తన పాతబట్టీ అని అనుకోవడం వట్టి భ్రమ అని. ఆ కర్మాగారంలో అన్ని విభాగాలలో మాదిరిగానే యీ బట్టీ కూడ అధునాతనమైందీ, పెద్దదీను. దానిలో అమర్చిన అత్యాధునిక యంత్రాల ప్రయోజనం ఎలాంటిదో కాజిమోవ్‌కు బోధపడలేదు.

దృఢమైన వ్యాయామశరీరంగల యువకుడొకడు నీలిరంగు దుస్తులు ధరించి, నీలికళ్ళద్దాలను టోపీపైకి నెట్టి ఆ బట్టీముందు అటునిటు తిరుగుతూన్నాడు. ఒకసారి అద్దాలను

కళ్ళమీదికి దిగలాగి కరగబోత పని ఎలా సాగుతూందో పరిశీలిస్తున్నాడు; ఇంకోసారి వాటిని నెత్తిపైకి త్రోసేసి, చేతిగడియారంకేసి చూసుకుంటున్నాడు. అప్పుడప్పుడూ "పైరోమీటరు" సహాయంతో ఉష్ణోగ్రతను లెక్కగడుతున్నాడు.

కాజిమోవ్ పూర్వం పనిచేసిననాటి కరగబోత కార్మికులకూ యీ యువకుని పోలిక ఏమీలేదు. ఇతని దుస్తులు, పనిచేసేపద్ధతి, నిబ్బరంగా 'పైరోమీటరు' తో పనిసాగించుకు పోవడం – ఇదంతా చూస్తే ఎవరో ఒక ఇంజనీయరు ఇక్కడ జరిగే ఉక్కు కరగబోతపనిని ఒకసారిచూసి వెళదామని వచ్చినట్టుంది. బట్టీపక్కన నిలబడిన తన వంటి పరాయివాడికోసం అలా బడాయిపోతున్నాడేమో ననిపించి వెటకారంగా నవ్వుకున్నాడు కాజిమోవ్.

అయితే అంతలో ఆ యువకుడు తనకళ్ళద్దాలను పైకి త్రోసేశాడు. ముఖంమీద దట్టంగా కారుతున్న చెమటను తుడుచుకున్నాడు. ఒక్కక్షణం నిలబడి ఆలోచించుకొని, ఏదో ఒకనిర్ణయానికి వచ్చినవాడిలాగా వెనక్కు తిరిగాడు. తిరిగి యీ పరాయిమనిషి తనప్రక్కన నిలబడి వుండడం చూశాడు. చూచి దిగ్భ్రమతో అలాగే నిలబడిపోయాడు. ఈయువకుని ముఖం ఏదో లీలామాత్రంగా పరిచయమైనట్టిదిగా గోచరించింది కాజిమోవ్‌కు. కాని ఎక్కడ ఏ పరిస్థితుల్లో చూశాడో స్ఫురణకు తెచ్చుకొనేలోపుననే ఆ యువకుడు ఒక్కసారిగా ఈలవేసి, తన దృఢకాయానికి ఏమాత్రం పొసగని పిల్లకాయ గొంతుతో ఒక్క అరుపుపెట్టాడు.

"పాంతెలీ మామ!"

ఇప్పుడు గుర్తించాడు కాజిమోవ్. ఉపాధ్యాయుడు బోధించే ప్రక్రియలన్నీ గంటల తరబడి నిలబడి శ్రద్ధగా గమనించే కుర్రవాడొకడు గుర్తుకొచ్చాడు. ఆనాడు అతడొక ఎర్రటి బుగ్గలుగల పిల్లవాడు మాత్రమే. పనిలో పరిశీలనా శక్తినీ, నిక్కచ్చితనాన్ని ప్రదర్శించేవాడు. ఇవ్వాళ ఆ డైరెక్టరు మాట్లాడుతూ తమ కర్మాగారంలో ఒక ప్రఖ్యాత పురుషుడు వున్నాడనీ, అతను సోషలిస్టు పోటీలో నాయకుడనీ, పేరుమోసిన ఉక్కు కరగబోత కార్మికుడనీ చెప్పినపుడు కాజిమోవ్ తన పాతధోరణిలోనే అలాంటి వ్యక్తి ఎవరో వయసు ముదిరినవాడై వుంటాడనీ, దీర్ఘకాలానుభవంతో ఆరితేరినవాడై వుండాలనీ తలపోశాడు. కాని ఆ మహావ్యక్తి తనక్రింద తర్ఫీదుపొందిన బాలురలో ఒకడనిగాని, ఆ నాటి గులాబిబుగ్గల వోలోచ్కాయే యీనాడిక్కడ ఒక నూతన వీరుడుగా తయారయ్యాడనిగాని అతనికి తట్టనేలేదు.

ఊహుం! ఈ ఉక్కుకర్మాగారంలో ఒకనాటి కాజిమోవ్ స్థానాన్ని ఆక్రమించి కూర్చున్నది యీ వ్యక్తేనన్న మాట!

కాజిమోవ్ చాల ఆప్యాయతతో తనపూర్వ విద్యార్థిని పలుకరించి, ప్రక్కనేవున్న యినప పడకకుర్చీలో కూర్చున్నాడు. అతడు పనిచేసివున్న ఆ పాతరోజులలో యిక్కడ యీ కుర్చీబదులు నల్లబారి, పెచ్చులేచిపోయిన పాతబల్ల ఒకటి వుండేది! అలాగే కూర్చుని షుమిలోవ్ బట్టే

ముందర పని చేస్తూండడాన్ని పరీక్షగా చూశాడు. చూచినకొలది ఆ యువకుడు ఒక ఇంజనీయరులాగే అగుపించాడు. అతడు ధరించిన దుస్తులు, పైరోమీటరుతో చేసే పని, అలవాటుచొప్పున సెకండ్లముల్లుకేసి చూచుకోవడంలో కంటే యేదో అనిర్వచనీయమైన గంభీరతలో, దాగియున్న దేనిలోనో యీ పోలిక కనబడుతోంది. ఈ పోలికను ఎంత అనుభవశాలియైనా గ్రహించవలసిందేగాని కంటికి కనిపించేదిగాదు. షుమిలోవ్ తన నోటుబుక్కులో ఆ యీ అంశాలు వ్రాసుకొనే పద్ధతిలో, ఒకపని చేయబోతూ ముందు సాలోచనగా ముఖం ఉంచుకోవడంలో అతడు కరగించేది ఉక్కు కానట్టూ, అతిక్లిష్టమైన ప్రయోగాత్మక క్రియ యేదో చేస్తున్నట్టూ లెక్కలుకట్టడంలోనే ఆ పోలిక గర్భితమై వుంది. ఇదేమీ బడాయికాదని కాజిమోవ్‌కు స్పష్టమైంది. ఇక్కడ అమలులోవున్న పద్ధతి యిదేనన్న మాట. కాజిమోవ్ సైన్యంలోవుండగా యిక్కడ ఆచరణలోకివచ్చిన కొత్తపద్ధతికూడ యిదే అయివుండాలి.

ఇక్కడ పనియెడల వీళ్ళు కనబరచే యీ అపురూపమైన ధోరణి చూసి అత నెంతో కౌతుకాన్నీ, ఉత్సాహాన్ని పొందాడు; అయితే అతని విస్పష్ట ఊహాచిత్ర మధుకలశంలో చిక్కటి తారుబొట్టు ఒకటి జారిపడింది. ఆ నాడక్కడ యుద్ధరంగంలో తన జీవితాన్నే పణంగా ఒడ్డి పోరాడాడు; అపుడపుడూ తిరోగమించాడు; తిరిగి పురోగమించి దాడులు జరిపాడు; మంచులో బిగదీసుకుపోయాడు;

దుర్భర ఉష్ణోగ్రతలో ఉక్కిరిబిక్కిరి అయ్యాడు; ఆస్పత్రుల్లో గాయాలతో పడివున్నాడు; తిరిగి తేరుకొని యుద్ధరంగంలో దూకాడు. ఈనాడు యిక్కడకు తిరిగివచ్చాడు. అయితే అతని కిక్కడ ఎదురయిం దేమిటి? అతను లేనికాలంలో యింటివద్దనే వుండిపోయినవాళ్ళు క్రొత్తచదువులు చదివారు; డిగ్రీలు పొందారు; క్రొత్తయంత్రాలు అమర్చారు; చివరకు దుస్తులుగూడ వింతవింతగా వేసుకో మొదలెట్టారు. ఇపుడీ కాజిమోవ్ యేమిచేయాలి? తను యే నరకంనుండి వూడిపడ్డాడోగాని స్వీయనాడి స్పందనం అతని కెంతస్వానుభవమైందో అలాంటి సుపరిచితమైన బట్టీమోతను వింటూగూడ ఒకప్పుడు తనక్రిందనే పనిచేసినవాడు యిపుడిక్కడ ఒక గృహస్తులాగ సంచరిస్తోంటే కాజిమోవ్ ఒకానొక ఆగంతకుడువలెనే వుండిపోవలసివచ్చింది!

ఒకనాడు తన క్రింద విద్యార్థిగా తర్ఫీదుపొందిన యీ యువకుని చూస్తూంటే కలుగుతున్న అసూయను కష్టంతో అణచుకొని, అతనుచేసేపనిని చూస్తూ కూర్చున్నాడు కాజిమోవ్. అతని ఆలోచనలు చాలా బాధాకరంగా వున్నాయి. ఒకప్పుడు విపులఖ్యాతిని గాంచిన కాజిమోవ్ యిప్పుడు వెనకబడిపోయాడు; ఒకనాడు ప్రతివారినీ ఆశ్చర్యచకితులను జేసిన తన పద్ధతులకు యీనాడు కాలదోషం పట్టినట్టయింది.

"ఏం, పాం తెలీమూమ! మనిద్దరం కలిసి కాసేపు పని చేద్దాం?" అని తన షిఫ్ట్ పూర్తి అయింతర్వాత షమిలోవ్ అడిగాడు.

దుస్తులు మార్చుకోనే గదిలోంచి షుమిలోవ్ బైటికి వచ్చాడు—అతని వాలకం చూస్తే యేదో క్రీడారంగంలో ఆటలాడి వచ్చినట్లుందిగాని ఒక షిఫ్ట్‌కి షిఫ్టంతా నిప్పులు క్రక్కే బట్టీముందు పనిచేసి వచ్చినట్టుగా లేదు.

కాజిమోవ్ అదరిపడ్డాడు. ఆ ప్రశ్న అతనిని ఎంతో ఆశ్చర్యపరచింది.

"నాకు తెలియదు; నిజంగా నాకేం తెలియదు" అని కాజిమోవ్ ఆందోళనపూర్వకంగా మొఖం చిట్లించి సమాధానం చెప్పాడు. షుమిలోవ్ ధరించిన తెల్లని పూలు స్వెట్టరూ, ఓరవాటుగా పెట్టుకొన్న టోపీనీ నమ్మలేనట్టుగా చూస్తూ అన్నాడు! "నీబోటివాళ్ళవేపు చూస్తేనే తెలుస్తోంది—ఆకాశమే హద్దు అని. మీతో సరిసమానమవుదామని నాబోటి వాళ్ళం కలలుగూడ కనలేం; యీ మధ్యకాలంలో మేము పోరాటంలో వున్నట్టు నీకు తెలుసుగా!"

"సరే. సరిసమానమయ్యే విషయంగురించి తర్వాత మాట్లాడుదాంలే! మామా, నీవు ఉద్దండుడివిసుమా! ఇక ఆధునికపద్ధతులంటావా అవి ఎక్కడైనా కనబడతాయి—నీవెక్కడికిబోయినా సరే. అందులోవుండే ప్రతి కొత్తవిషయాన్నీ నీకు చూపుతాం. మాఅందరికీ నీవేగదా అసలు నేర్పినవాడివి! అందుకు మేమెప్పుడూ నీకు రుణపడేవున్నాం"

ఈ యువకార్మికుడు నీకు "నేర్పుతాంలే" అనేమాటలు అనకుండా నీకు "చూపుతాంలే" అని అనడమూ, పాతరోజుల్లోలాగ "పాంతెలీ మామా" అని పిలవడమూ ...

చూస్తే తననైపుణ్యం అక్కడివారికి యింకా జ్ఞాపకముందనీ, తన పూర్వఖ్యాతిని నిజంగానే మెచ్చుకుంటున్నారనీ ఈ పెద్ద వాడికి రుజువయింది. అయితే తిరిగి పనిలో చేరడమంటే అతనికి వున్న భయాన్ని ఇది యింకా పెంచింది. ఒకవేళ ఏమీ చేతగానివాడని ఇప్పుడు పనిలో తేలితే ఎలాగ? ఈ కొత్త శకంవారితో తను సరిసమానం కాలేకపోతే ఎలాగ? బహుశా ఆలస్యం జరక్కముందే, తనను తిరిగి ఉద్యోగంలో చేర్చుకొనే తంతు పూర్తిగాకమునుపే ఇక్కడినుంచి తరలి పోతే మంచిదేమో! దూరాన ఎక్కడికో, తనను ఎవరూ ఎరుగని కొత్త ఉక్కుకర్మాగారాల్లో పనికి కుదిరితే సరి— అక్కడే తన నైపుణ్యాన్ని గుట్టుచప్పుడుగా పునర్నిర్మించు కొనే అవకాశం దొరుకుతుంది.

# 5

ఆనాటి సాయంసంధ్యా సమయంలో, ఉక్కు బట్టీ కార్ఖానా భవనంమీద అస్తమిస్తున్న అరుణ కిరణాలు కెంజాయ వెల్తురును వెదజిమ్ముతుండగా, బజారు లైట్లు ఆ వర్షాకాల సంధ్యాంధకారంలో మిణుకుమిణుకు మంటూండగా మిలిటరీకోటు ధరించిన వ్యక్తి ఒకడు యీ ఉక్కు కర్మాగారపు కార్మిక పేటలో మెల్లగా అడుగులు వేసుకుంటూ వెళుతు న్నాడు. బాగా పాలిషు పెట్టిన అతని బూట్లు ఆనగలిగిన మంచుమీాద నడుస్తూంటే అడుగడుక్కీ కిరకిరమంటున్నాయి. అతని ముఖం గంభీరంగాను, ప్రశాంతంగాను వున్నది; అతని వాలకం ఆత్మవిశ్వాసపూరితంగా వుంది—ఇదీ బయటనుంచి చూచివారెవరైనా అతని గురించి వర్ణించేది.

కాని అతని హృదయమంతా ఆత్మవిశ్వాసమూ, గంభీరతలతోగాక అలసట చెందిన నిర్లిప్తతా, ఆందోళనలతో నిండివుంది. పరాయి భూమిలోవుండగా గోపురాకారంగా పొడుచుకొనివచ్చిన అక్కడి పెంకుటిళ్ళూ, మసకమసకగా దూరాన కనిపించే చర్చి గోపురాలూ చూచినప్పుడు ఎన్ని సార్లు తన స్వస్థలాన్ని గురించీ, ఇంటికి తిరిగివచ్చి, తన పాత

స్నేహితులను కలుసుకోవచ్చనీ కలలుగన్నాడు ; వారి స్నేహమూ, తనకు బాగాపరిచయ మున్న పనీ తన ఏకాకి తనాన్ని పారద్రోలగలవనీ, తను పొందిన నష్టంయొక్క భారం కొంత తేలికపడుతుందనీ భావించాడు.

సరే, తిరిగి వచ్చాడు ; కాని తన యిల్లెక్కడ ? కర్మాగారానికి వెళ్ళాడు; కాని అదిగూడ పరాయిదై మారి పోయింది. ఇక తన స్నేహితులు, ఉత్పత్తిని పెంచాలనిచేసే ప్రథమ కృషిలో పాల్గొన్న తన సహచరులు ఏరీ ? ఇదివర కటిలాగే వారూ దూరమయ్యారు. పైగా ఆ రాత్రికి ఎక్కడ గడపాలో గూడా కాజిమోవ్‌కు బోధపడలేదు. హోటల్ అసలేలేదు. అతిథిగృహం నిండిపోయి వుంది. మరో ఇల్లు కుదుర్చుకోడానికైనా తాను ప్రయత్నించలేదు. కాని క్లావ్డియా వెళ్లుతూ "సరే వదలివెళ్ళండి—సాయంత్రం వరకు," అని మాత్రం పలికింది. అంటే తనుచేసే ఫిర్యాదు ఏమీలేదు. అందరూ — డైరెక్టరూ, కార్ఖానాలో కార్మి కులూ, చివరకుపూర్తిగా పరాయిదైన యీ స్త్రీగూడ అందరూ తనను ఆప్యాయంగా, సానుభూతితో ఆహ్వానిం చారు. అయితే అంత హడావిడిగా జర్మనీదేశాన్ని వదలి పోవాలని ఎంతో ఆతృతగా ఎదురుచూచిందీ, ఆశించిందీ యీ ఇంటికేనా? తన జీవితాన్ని మొదటినుంచీ తిరిగి మొద లెట్టాలనిగానీ, తిరిగి పనిలో చేరినతర్వాత మరల క్రొత్తగా చదువులు చదవాలనిగానీ ఎప్పుడైనా ఆలోచించాడా !

కమాండెంటుగా వుండగా జర్మనీలో పెద్ద ఉక్కు కర్మాగారాలకు వెళ్ళిన విషయాన్ని కాజిమోవ్ జ్ఞాపకంచేసుకొన్నాడు. జర్మన్ ఉక్కుపోత కార్మికులు పనిచేస్తోంటే గంటలతరబడి చూసేవాడు. వాళ్ళు చేసేపని సమర్థవంతంగా, నిర్దుష్టంగానే వుందిగాని అక్కడి బట్టీలన్నీ చాలాపాతవి ; వాళ్ళ పని పద్ధతులుగూడ కాజిమోవ్‌కు సోషలిస్టు పోటీల ఆరంభదినాల్లో సుపరిచితమైనవే. ఒక్కొక్కసారి కాజిమోవ్ తన కోటును గిరవాటేసి, అక్కడ కరగబోసేవాళ్ళతో చేరి పోయి, ఒకడిదగ్గర టోపీ ఎరువుపుచ్చుకొని, నిజమైన సోవియట్ నిపుణుని నైపుణ్యంతో ఆ జర్మన్లను చకితులనుచేద్దామని గాఢంగా ఆశించేవాడు.

అయితే యిప్పుడు తిరిగి తన కర్మాగారానికే వచ్చిన తర్వాత,తను పనిచేసిన బట్టీవంటి బట్టీముందర నిలబడివుండగా అలాంటి ఆలోచనలు ఏవీ కలుగలేదు. యుద్ధానికి పూర్వం వున్న మిల్లుకంటే యీ క్రొత్తమిల్లు చాలా భిన్నంగావుంది; ఉక్కను కరిగించడంలో అనుసరించే నైపుణ్యం నిజంగానే చాలా ఎత్తున పెరిగింది. షుమిలోవ్ పనిచేస్తుండగా చూస్తోంటే ఆయువకుడు పాతరోజులకోసం తననుబట్టీముందు పనిచేయమని అడుగుతాడేమోనని భయం కలిగింది.

ఇదంతా కాజిమోవ్‌కు ఎలా అనిపించిందంటే ఎవరో ప్రయాణీకుడు రైలెక్కుదామని స్టేషనుకు వెళితే, అప్పుడే బయలుదేరి సాగిపోయేబండి చివరిపెట్టెయొక్క వెనుకభాగం చూపుకు దూరమవుతూ కనిపించినట్లయింది. అయితే ఆ బండిని చేరడానికి ఉరకలుదీయాలనీ, దానిని అందుకోవా

లంటే తన శక్తినంతనీ వెచ్చించాలనీ ఆ ప్రయాణీకుడు ఎరిగే వున్నాడు—అయినా అతనిలో మాత్రం శక్తిఅంతా ఉడిగి పోయింది.

అంతకంటే నికృష్టమైంది అతన్ని శక్తిహీనుణ్ణిగా జేస్తున్న అపనమ్మకం: ఇదంతా అవసరమేనా? కావలసినంత మనోనిబ్బరం, జ్ఞాపకశక్తీ, నైపుణ్యం ఇంకామిగిలివున్నాయా? తనకింకా మిగిలివున్న ఆ పాతఖ్యాతిని కించపరచననే గ్యారంటీ ఏమయినావుందా? ఏవేవో పరిపాలనా పదవులను సూచించి నపుడు బహుశా ఆ డైరెక్టరే సరైన పని జేశాడేమో! ఇక ఎవరితోనూ ఏమాటా మంతీ లేకుండానే, అసలు పెట్టెబేడా సర్దేసుకొని ఊరల్స్‌కుపోయి తనవారితో జేరిపోవడం మంచిది గాదా?

ఈ అపనమ్మకాలు, నిరుత్సాహాలు అన్నీ ఎవరో తెలియనివారు తనకేదో అపకారం చేసినట్లు బాధాకరంగా భావించేలా చేశాయి.

గతరాత్రి నిద్రలేకుండా గడిపినతర్వాత విశ్రాంతి కోరింది అతనిశరీరం; కాని తనది అని చెప్పుకోదగ్గ జాగా జానెడైనా లేకపోయింది. ఇక క్లావ్దియానే ఆరాత్రికిగూడ గడపనీయమని అర్థించడంమినహా మరోమార్గం లేదు; సైని కుడుగా వుండగా ఎక్కడపడితే అక్కడ పరాయికొంపల్లో కాలం వెళ్ళబుచ్చడానికి అలవాటుబడ్డవాడే—కాని తన సైనిక సహచరుని విధవరాలును అలా అర్థించగలగడం సామాన్యమా?

ఈ ఆలోచనలతో ఎంత సతమత మవుతున్నా బయటికి తన నిబ్బరాన్ని మాత్రం కాజిమోవ్ కోల్పో లేదు; బారకాసు మెట్లన్నీ ఎక్కి, ఆ వంటశాల గుమ్మం ముందుగా నడచిపోయాడు. లోపలవున్న అమ్మలక్కల మాటి విరుపులు, గుసగుసలు అతన్ని వెన్నంటుతూనే వున్నాయి. అయినా చలించకుండా తనకిప్పుడు సుపరిచిత మైన ఆ గదితలుపును గట్టిగా వ్రేళ్ళకణుపులతో తట్టాడు.

"ఒక్కక్షణం" అని ఒక స్త్రీస్వరం లోపలనుంచి వినవచ్చింది.

తలుపు తెరుచుకొంది; సిగ్గుపడుతూన్న క్లావ్దియా యెదురైంది. ఆవిడ కాలికి చెప్పులు లేవు. మొహం యెర్ర బారివుంది. ముక్కుమీద చెమటచుక్కలు దట్టంగా పట్టి వున్నాయి. రొంటిలో లంగా దోపుకుంది. నీరు వోడుతున్న ఒక పాచిగుడ్డ చేతిలో వ్రేలాడుతోంది పాచిగుడ్డ వదల కుండానే గౌను చేతితో మొహంతుడుచుకొని, తలకుకట్టిన కర్చీఫు క్రిందనుంచి జారిపడే ముంగురులను పైకి త్రోసు కుంది. కాజిమోవ్‌ను తేరిజూస్తూ అన్నది :

"నే నీ నేలనంతా కడిగి తుడిచేలోపల మీరు ఒక అరగంట అటు బైటకు షికారువెళ్ళి రాగలరా? కాకపోతే మీరుగూడ పైకెక్కి స్లావ్కా పక్కనే కూర్చోవాలి."

స్లావ్కా డ్రాయరుబల్లమీ దెక్కి కూర్చున్నాడు. చేతిలో పుస్తకం ఒకటి పట్టుకొని, బాసీపెట్టువేసి చతికిల బడి వున్నాడు. ఒకసారి తల్లివంక ఏదో పెత్తందారులాగ

చూచి, కాజిమోవ్ వైపుకు తిరిగి, "ఇది చూశారుగా!... మనం చెప్పినట్టు నడుచుకోవలసిందే" నన్నట్టు ఒక చిరునవ్వు విసిరాడు.

ఒక్కసారిగా స్లావ్కా తన తండ్రిపోలికను పుణికి పుచ్చుకున్నట్టు తోచింది కాజిమోవ్‌కు.

పనివల్ల గలిగిన జేవురింపుతో, ఉత్సాహంగా కనబడే యీ క్లావ్దియాకూ, క్రితంరోజున మగవాళ్ళతోడిగే లాగూ తొడిగి, మోటుగా కనిపించిన లారీ డ్రైవరుకూ యెలాంటి పోలికా లేదు. నిజానికి ఆవిడ యింకా చిన్నదే; ఎత్తైన వక్షోజాలతో, భారీగా, భారంగా వుంది. కొంచెం పైకి తిరిగిన ముక్కూ, పండినట్టున్న పెదవులతో ఆమె ఒక గుడ్డ బొమ్మను జ్ఞప్తికి తెస్తోంది. బహుశా జారిపడే తన ఒత్తైన జుట్టును జారనీయకుండా కట్టిందేమో—ఆ గడ్డంక్రింద ముడి వేసిన కర్చీఫుగూడ ఆ చిత్రాన్ని పూర్తిచేస్తున్నది. కాని ఆమె ముఖంలో అనిర్వచనీయమైంది యేదో ఒక పెద్దరికపు భావాన్ని కలుగజేస్తోంది.

క్లావ్దియా యిలా వింతగా కనిపించడం చూచి విస్మయపడుతూ కాజిమోవ్ తనదృష్టిని నేలమీద నీళ్ళ నడుమను నిలబడ్డ ఆమెయొక్క దృఢమైన నిడుపాటి కాళ్ళవైపు, చెప్పులులేని పాదాలవంకా పోనిచ్చాడు. ఎర్రబారిన కనుబొమలను చిట్లించి క్లావ్దియా కోపంగా తన లంగాను క్రిందికి దిగజార్చింది.

"షికారుపోండి" కొంచెం ఆజ్ఞాపూర్వకంగానే పలికింది.

"నేనుగూడ—నేనుగూడ," అని అరచి స్లావ్కా గభీమని క్రిందికి దూకాడు. ఆదూకడం క్రింద మడుగులు గట్టిన నీటి మధ్యలోకి దూకాడు.

"కావాలనే చేశాడు, వెధవ" తన పాచిగుడ్డను విసరుతూ అరిచింది క్లావ్దియా. కాని, స్లావ్కా ఎంతో నేర్పుతో ఆదెబ్బను తప్పించుకొని, తన కోటూ, హేటూ ఊడలాక్కొని గుమ్మంలోకి పరుగుదీశాడు. కాని నిజానికి తల్లీ బిడ్డలిద్దరిమధ్య చాలా మంచిసంబంధ మున్నదని కాజిమోవ్ గ్రహించాడు. అంతలోనే తన మనసులోనుంచి మరోభావం దూసుకుపోయింది. ఆ కాళ్ళమీద నిలబడిన క్లావ్దియా చాల చురుకైనదనీ, ఆ భారీమనిషిని అవి తేలిగ్గా, కొంచెం అందంగానే మోస్తున్నాయనీ తోచింది.

కాజిమోవ్ కూడ తేరుకొన్నాడు—అతన్నేమీ గదిలోనుంచి ఖాళీచేసి వెళ్ళిపొమ్మనలేదు; అతను ఏ సంభాషణను గురించి భయపడుతున్నాడో అది కనీసం మరొకరోజుకైనా వాయిదాపడింది. క్లావ్దియా అయినా తనను ఒక పాతస్నేహితుడిలాగే చూసింది. ఈ పరిస్థితి అతనికెంతో సంతసాన్ని చేకూర్చిపెట్టింది.

కాజిమోవ్, ఆ పిల్లవాడు—ఇద్దరూ బయటపడ్డారు.

"పాంతెలీ మామా! నీవువచ్చింది జర్మనీనుంచిగదూ? నిజంగా? హిట్లరు బ్రతికుండగా నీవింకా అక్కడేవున్నావా? లేవూ? నాకో కొమ్ములున్న జర్మన్ ఉక్కుటోపీ దొరికింది—దాన్ని చావిట్లో దాచా. వాళ్ళంతా కొమ్ములున్న ఉక్కు-

టోపీలే పెట్టుకుంటారా? అక్కడ ఫాసిస్టులేగాక ఇంతా మంచి వాళ్ళుగూడ వున్నారా? చాలామందివున్నారా? ఉఁహుఁ! నిజంగా? మరయితే మనయిల్లూ, యీ పట్టణం, మనమిల్లునీ ఎందుకు తగలబెట్టారు? అయితే ఆమంచి జర్మన్లు యీ ఫాసిస్టులను ఎందుకలా చేయనిచ్చారు? ఈ ఫాసిస్టుల్ని శిక్షిస్తారా, మరి?

పిల్లవాడి కుతూహలానికి అంతూపొంతూ లేకుండా వుంది. ఈ 'ఏమిట్లూ', 'ఎందుకులూ', 'ఎట్లాగూలు' విని, సమాధానం చెప్పడం కాజిమోవ్ ఆనందించాడు. అలా ఒక గంటకుపైగా తిరిగి తిరిగి యింటికి జేరారు. వచ్చీరావడంతోటే వంటింట్లో విషపూరితమైన గుసగుసలు వీరిచెవిని బడ్డాయి.

'ఆ క్లావ్దియా చాలా తెలివైందిలే—తన లారీతో ఎవర్ని పడగొట్టాలో ఆమెకు బాగానే తెలుసు. సైన్యంలోంచి వచ్చేవాళ్ళదగ్గర బోలెడు డబ్బూ వుంటుంది..."

"సరిగ్గా అతని గుండెలమీదనించే పోనిచ్చిందట..."

"ఉఁ! ఆమెమాటలు వింటూంటే అసలు "నీతి" అంటే యీమేనేమో ననిపిస్తుంది......"

పిల్లవాడి గుప్పెట్లు వెంటనే బిగుసుకోవడం, అతని పచ్చని కళ్ళల్లో నిప్పురవ్వలు రేగడం కాజిమోవ్ గమనించాడు. స్లావ్కా వెనక్కుతిరిగి ఆ వంటింట్లోకిపోయి తన తల్లి ప్రతిష్టను కాపాడటానికి ఉద్యుక్తుడవుతున్నట్టు గ్రహించాడు. అతనిమీద గట్టిగా చేయివేసి యిలా అన్నాడు :

"నిదానించు!"

ఇంకా భారంగా ఊపిరి తీస్తూనే, రొప్పుతూనే ఆ మిలిటరీ ఆజ్ఞకు వెంటనే లొంగిపోయాడు స్లావ్కా.

కొంత చల్లబారిన ఉత్సాహంతో యిద్దరూ గదిలోకి వచ్చారు. కొత్తగా కడిగిన గది ఏదో సువాసన వెదజల్లు తోంది. గది అంతా సర్దబడి యింకా విశాలమైనట్టు కన బడింది. టేబిల్ మీద భోజనం కోసం క్రొత్తగా మంచి కాగితం ఒకటి పరచబడి వుంది. మధ్యలో యేదో వస్తువు శాలువాలో చుట్టివుంది.

"ఈపాటికే బంగాళాదుంపలన్నీ ఆరిపోయి వుండాలి; అయితే ఆ తప్పు అంతా మీదే" అని క్లాడియా శాలువా అంచులు విడదీసింది. పాత్రలోంచి ఆకలిగొల్పే పొగలు విర జిమ్ముతున్నాయి.

"నూనె ఏమీ మిగలలేదు; ఉన్నదంతా మీరు ప్రొద్దున్నే వుపయోగించేశారు"; అని నిట్టూర్చి, "ఇప్పుడు ఇంటిని సర్దిపెట్టాలంటే నాకేం తెలియడంలేదు" అన్నది.

కాజిమోవ్ ప్రయాణకాలంలో మిగిలిపోయిన మాంసపు టిన్నును బయటకు తీశాడు; దాన్ని తెరుస్తూంటే పిల్లవాడు లొట్టలువేసుకుంటూ ఆదుర్దాగా చూడసాగాడు. చివరకు భోజనం మొదలెట్టినపుడు స్లావ్కాలాగే కాజిమోవ్ గూడ ఆ బంగాళాదుంపలూ, మాంసాన్నీ గబగబా నోట కుక్కు కున్నాడు. అలాకూర్చుని తింటోంటే తానెప్పుడూ, యుద్ధా నికి పూర్వపు రోజుల్లోగూడ—ఆరోజులు యిప్పుడేవో చరిత్ర

పుట్టకముందు రోజులులాగా గోచరిస్తున్నాయి—ఎన్నడూ యీ ఎండు బంగాళాదుంపలూ, చల్లారిన మాంసపు ముక్క కంటే రుచికరమైన పదార్థం తినలేదన్నట్టు అనిపించింది.

భోజనం అయిన తర్వాత కోటుతీసి, కుర్చీ వీపుకు తొడిగి అడిగాడు:

"నేను పొగత్రాగటం మీకేమీ అభ్యంతరం లేదు గదా!"

"ఉహుఁ! అదేంలేదు." అని తన సుందరమైన కురుల ముడిలో పిన్నుగుచ్చుతూ సమాధానం చెప్పింది క్లావ్దియా. ఆ కురులబరువు ఆమెతలను వెనక్కులాగి, తలను పైకెత్తిపట్టినట్టయింది. దానివల్ల ఆమెలోని అభిమానమూ, స్వతంత్రతా మరింత ప్రస్ఫుటంగా గోచరించాయి.

ఆమెలో ఏది పరస్పర విరుద్ధమైనట్టిదో కాజిమోవ్‌కు ఇప్పుడు అర్థమయింది. అలసటతో లోతుబారిన ఆవిడ లేత ఆకుపచ్చనికళ్ళూ, ఆవిడ గుండ్రని ముఖంమీద కొంచెం పైకితిరిగిన ముక్కూ సరిపడకుండా వున్నాయి.

"మీరు నన్ను చాల సిగ్గుపరచారుసుమా" అని బలహీనంగా నవ్వింది. "నేను ఇంటికి తిరిగివచ్చి చూస్తే అంతా శుభ్రపరచి వుంది. ఈపని ఎవరుచేశార్రా అని స్లావ్కాను అడిగాను. వాడు ఆఫీసరుమామఅని చెప్పాడు... అందుకని నేలంతా కడుగుదామని మొదలెట్టాను."

క్లాడియా ఆలోచనలో మునిగిపోయినపుడు ఆమె నుదుటిమీద పల్చటి గీరలు యేర్పడ్డాయి; కళ్ళ కొసల్లో అవి అన్నీ గుత్తులుగా చేరాయి.

"పూర్వం నా యిల్లు యిలాగే వుండేదీ? మీా రెప్పుడైనా నా భర్తతో కలసి వచ్చారూ? నన్నెంతో మంచి గృహిణి అని మెచ్చుకొనేవా రాయన; కాని యిప్పుడో... నేనుమాత్రం యేం చేయగలను? ప్రతిరోజూ ఒకటిన్నర షిఫ్టులపాటు స్టీరింగ్ముందు కూర్చోవాలాయె! ఇక యింటికి వస్తే యెంతసేపైనా పక్కమీాదబడి ఒకటేనిద్రపోవా లనిపిస్తుంది. ఒక్కోసారి అసలేం తినబుద్ధి పుట్టదు. అక్కడేమో గారేజిలో తగినన్ని చేతులుకూడ లేవింకా."

ఒకసారి నిట్టూర్పు విడచి మళ్ళీ అన్నది :

"ఔను, నేనూ స్లావ్గా మంచి గృహస్తులం కాము..." అన్నది.

ఆమేమీా ఫిర్యాదు చేయడంలేదు; బిగ్గరగా ఆలోచిస్తోంది—అంతే.

"ఒకటిరెండురోజులు నేనిక్కడ వుండవచ్చా?" అని కాజిమోవ్ ఒక్కసారి నోరుజారాడు.

"నేనూ మిమ్మల్ని బజార్లోకి పంపించలేను. ఉండండి. నాకేంలెక్కా!" అన్నదామె.

క్లాడియా స్వరంవింటే అందులో మనఃపూర్వకమైన ఆహ్వానంగాని, అయిష్టతగాని కనబడదు. ఇంకా ఎక్కువ

ఏదో అందులో ఇమిడివుంది. స్టాలిన్‌గ్రాడ్ రక్షణలోగూడ ఇలాగే జరిగింది; వోల్గానదిలో మంచుతెరలు తేలిపోతున్నాయి; పైన ఆకాశంలోంచి విమానాలు మందుగుండు సామాగ్రితోబాటు రాత్రిళ్ళు ఆహారాన్నిగూడ పడవేస్తున్నాయి; ఒకనాడు కాజిమోవ్, మరొక సైనికుడూ ఫిరంగి గుండుదెబ్బలకుపడ్డ ఒక పెద్దగోతిలో తలదాచుకుంటున్నారు. అప్పుడుకూడ ఆ సైనికుడు ఇలాగే తనవద్దనున్న ఒకేఒక బిస్కత్తుముక్కను ఇంత నిబ్బరంగానూ, సహజంగానూ కాజిమోవ్‌తోబాటు పంచుకున్నాడు.

స్టాలిన్‌గ్రాడ్ యుద్ధభూమిలో ఆరితేరిన యీ వీరుడు క్లావ్దియా పలికిన పలుకులను సరిగానే గ్రహించి, మెచ్చుకున్నాడు.

# 6

కాజిమోవ్ ఉక్కు-మిల్లులో చేరాడు; అనేకరోజులు షుమిలోవ్ పని చేయడం శ్రద్ధగా చూశాడు. యుద్ధంనుంచి తిరిగివచ్చిన కాజిమోవ్ కర్మాగారంలో చేరాడనే వార్త నలువేపులా ప్రాకటంతోటే కార్మికులు—ముఖ్యంగా యువ కార్మికులు—ఏదో ఒక కారణం చూపిగాని, చూపకగాని వచ్చి చుట్టూ గుమిగూడేవారు. ఒకప్పుడు యీ ఉక్కు-పోత కార్మికుని పేరు ఎప్పుడూ పత్రికలో పడుతూనే వుండేది. ఇప్పుడు క్రమక్రమంగా అందరూ, అతడు-కార్ఖానాలో పని చేయడానికి అలవాటుపడ్డారు.

గంటలతరబడి అలా ఆ ఇనపపడకకుర్చీలో కూర్చుని తనముందు ఉక్కు కరగబోస్తోంటే చూస్తూ ఆలోచించే వాడు. ఆకార్ఖానామేస్త్రీ వచ్చి ఏదో ఒక బట్టీముందు పని తీసుకొమ్మని అదేపనిగా ఎంతగా కోరినా తనుమాత్రం యింకా అవుననిగాని, కాదనిగాని బదులుచెప్పలేదు. షుమి లోవ్‌గూడ ఆ విషయాన్ని ఎత్తడం మానాడు. అయితే అప్పుడప్పుడూ అతనిపరిస్థితి అర్థంచేసుకొన్నట్లు అతనివైపు ఓరగా చూస్తుండేవాడు.

ఒకనాడు కాజిమోవ్ అలా కూర్చునివుండగా మిలిటరీదుస్తులు వేసుకొని, కుంటుకుంటూ, యేదో వార్నిషుతో మెరుగుపెట్టినట్టు మెరిసిపోయే గుండ్రటి బోడిగుండుమనిషి ఒకడు అతనిదగ్గరకు వచ్చాడు. ఇతన్ని చూస్తే ఆ కార్మికులందరికీ యిష్టమైనట్టు కనపడింది; అతనే బట్టీముందరకు పోయినా అక్కడివాళ్ళంతా చేరి యేదో యిష్టాగోష్టికి ఉపక్రమించేవారు.

ఒక్క నిముషంసేపు మౌనంగా ఆ కుంటివాడు కాజిమోవ్ కుర్చీపక్కనే నిలబడ్డాడు. జేబులోంచి ఒక సిగరెట్ పెట్టె బయటకులాగి, ఒక సిగరెట్ కాజిమోవ్‌కి యిచ్చాడు. మంటలు కురిపించే ఒక నమూనా ఉక్కుముక్కమీద తానొకటి ముట్టించి, కప్పుమీదికి గుండ్రంగా పొగ వొదిలాడు.

"పార్టీలో నీపేరు నమోదు చేయించుకోబోతున్నావా, లేక యింకొంతకాలం ఆగి చూద్దామనా?" అని అడిగాడు.

"అది మీకేమి సంబంధం?" అని కాజిమోవ్ పలికి అతని చేతిలో సిగరెట్ తీసుకొని తనది ముట్టించుకున్నాడు.

"నాకేమి సంబంధమంటే నే నీ కార్ఖానా పార్టీ కమిటీకి కార్యదర్శిని. నా పేరు జోరిన్. చూశావ్", తన సిగరెట్టుతో ఉక్కు కరిగించేవారిని చూపించి, "వాళ్ళేమో యిక్కడ పాయసం వండుతారు; నేనేమో అక్కడ ఆ చట్టువంతో యెత్తిపోస్తాను" అని ఆ ప్రక్కన బలమైన తీగలతో పైన వ్రేలాడే బ్రహ్మాండమైన చట్టువాన్ని చూపించాడు. మిలమిలా మెరసిపోతున్న కరిగిన ఉక్కుప్రవాహం

ఒకటి ఒక గోట్టం గుండా జారివచ్చి ఆ చట్టువంలో పడు తోంది. "నీవు టాంకుమనిషివా ?"

"అవును, అంతే"

"ఒక్క చూపులోనే నీవు సాయుధ శకటదళానికి చెందినవాడవని చెప్పగలను. నేను పదాతిసైన్యంలో— అంటే మైదానప్రభువ్రులలో—వుండేవాడిని. అయితే బెర్లిన్ దాకా నాకాళ్ళు తీసుకుపోలేకపోయినయిలే, విస్టులానది మీద యీ బండిచక్రం పగిలింది. ఇప్పటికి రెండేండ్లనుంచీ ఈ కార్ఖానాలో కుంటుకుంటూ తిరుగుతున్నాను," అని తన కుంటికాలుమీద ఒకసారి చరిచి, మారుపలకకుండా వ్రాసు కున్నాడు. చూడగా అతడు ఏదో ఆలోచనల్లో నిమగ్నమై నట్టుంది. అయినప్పటికీ ఓరకంటితో తనను కనిపెట్టి చూస్తు న్నట్టే కాజిమోవ్ భావించాడు.

"జర్మనీలోపని చేసి వచ్చావని విన్నానే" అన్నాడు.

"అవును; ఒక సంవత్సరం పైగా."

"సరే, కామ్రేడ్ గార్డ్స్ కమాండెంట్! మావాళ్ళంతా ఆసంగతి విన్నారు; జర్మనీలో పరిస్థితు లేమిటో వినాలని కుతూహలపడుతున్నారు. మరి రేపు పగటిపిప్పు అయిం తర్వాత రెడ్ కార్నర్ లో ప్రతిఒక్కరినీ సమావేశపరుస్తాను; అక్కడ జర్మన్ల జీవితం ఎలావుందో నీవుచెప్పాలి, సరేనా?"

"ఉపన్యసించడం నాకు చేతగాదే!" అని కాజిమోవ్ చెబుతూండగానే ఆ వ్యక్తి కుంటుకుంటూ తన చట్టువం దగ్గ

రకు సాగిపోయాడు; దారిలో మరో బట్టీవద్ద పనిచేస్తున్న దళంతో హుషారుగా ఏదో అరుస్తూ వెళ్ళిపోయాడు.

ఈ హుషారైనమనిషిని చూచినకొద్దీ కాజిమోవ్ ఆకర్షింపబడ్డాడు. "నిజమైన సైనికుడంటే అతనే. సమరవీరుడంటే యితనే" అని ఆలోచించసాగాడు. "అతన్నే కావలసి వచ్చినప్పుడు సలహాలడుగుతాను. అతనైతే అర్థం చేసుకోగలడు."

ఆ కార్యదర్శివెంట వెళదామను కుంటూండగానే మూడో బట్టీవద్ద కరగబోతపని పూర్తిఅయింది. మీగడవంటి తెల్లటిఉక్కు చిటపటలాడే రవ్వలను మహోగ్రంగా విరజిమ్ముకుంటూ ఒక గొట్టంగుండా ప్రవహించి బలమైన తీగలతో వ్రేలాడే బ్రహ్మాండమైన ఉక్కు చట్టువంలోకి దిగజారసాగింది. దానితర్వాత ఐదో బట్టీవద్ద కరగబోతపని పూర్తిఅయింది. అందుకని ఆనాటి కిక జోరిన్‌తో పిచ్చాపాటీగా మాట్లాడే అవకాశం లేకుండానే కాజిమోవ్ ఆ కర్మాగారాన్ని వదిలేసి వెళ్ళిపోయాడు.

ఇంటికి—అంటే క్లావ్డియా ఇంటికి—తిరిగివచ్చిన తర్వాత తను మామూలుగా వుపయోగిస్తున్న ట్రంకుమీద పక్కపరచాడు; ఆ ప్రక్కనే ఒక కుర్చీలాగుకొని గొలుసుకట్టుగా సిగరెట్లు తగలేస్తూ ఎంతో ప్రొద్దుబోయేవరకు మేల్కొనేవున్నాడు.

యుద్ధంనుంచి తిరిగివచ్చిన అత్యధిక సంఖ్యాకులవలెనే కాజిమోవ్ గూడ అనేక సంవత్సరాలు తిరుగుబోతు ఆట

వికజీవితాన్ని గడిపివున్నాడు; అందుచేత జీవిత సౌకర్యాల యెడల అత నేమీ పెద్ద కుతూహలం చూపడంలేదు. ఆ నాడు చీపురూ, కుంచీ తీసుకొని శుభ్రపరచిన ప్రొద్దుటినుండీ ఆ యింట్లో యేదో ఒక మార్పు జరుగుతూనే వుంది. ఐనా కాజిమోవ్ దాన్ని గమనించనేలేదు. ఒకనాడు మసక మస కగావున్న కిటికీ అద్దాలు నిజంగా అద్దాల్లాగానే మెరసి పోయేవి. మరునాడు అంతవరకూ ఏదో చీకటికోణంలోపడి మూలుగుతూన్న లోహపుపొయ్యి తన శ్వేతపార్శ్వాలను ప్రదర్శిస్తుండేది; అంతేగాక ఒక పాత టేబిల్ క్లాత్ గూడ తన దర్శనాన్నిచ్చింది.

ఆ గృహిణితోను, ఆ చిన్ని గృహస్తుతోను కాజి మోవ్ స్నేహపూర్వకమైన మంచిసంబంధాలనే కలిగి వున్నాడు; అయినా తన దిక్కుమాలిన ఆలోచనల్లో మునిగి పోయి వారియెడల యేమీ శ్రద్ధవహించలేక పోయాడు. స్లావ్కామాత్రం యీ ఉలకని, పలకని అతిథి ఛాతీమీద ప్రదర్శితమయ్యే రిబ్బన్ల వరుసలవంక తదేకంగా చూస్తూండే వాడు.

కాని ఆనాటి రాత్రికి ఇక పడుకునేందుకు సిద్ధమౌతూ స్లావ్కా తన అలవాటుప్రకారం గుడ్డలను పక్కకుర్చీమీద పరుస్తూ కొద్దిగా దగ్గాడు. ఆ దగ్గువిన్న కాజిమోవ్ తల పై కెత్తి చూసి, ఒక్కసారి కంపించిపోయాడు. ఆ గది అంతా నీలంగా, విషపూరితమైన పొగాకు పొగతో నిండిపోయివుంది.

"అయ్యబాబోయ్! గదిఅంతా పొగమయమే నే! క్షమించండి, నేను యికనుంచీ బయటికిపోయి నడవలో కాలుస్తూంటాను" అన్నాడు.

"అయితే మరేంపర్వాలేదని చెప్పానుగా, మీతో! అలాగే జరుగుతూంటే ఎందుకనో కొంతసుఖంగా వుంటుంది నాకు. మీకు తెలుసుగా, నాభర్త రేయింబవలు అదేపనిగా పొగత్రాగుతూండేవాడు."

ఆమె గొంతుకలో ధ్వనించిన అమిత విచారాన్ని విని జాలిపడి, కాజిమోవ్ ఆపిడస్థితినిగురించి మొట్టమొదటి సారిగా ఆలోచించాడు. తన స్వంతఇబ్బందులలోనే మునిగి పోయి ఆ మరణించిన స్నేహితుని కుటుంబాన్ని పూర్తిగా విస్మరించాడు. ఏమయినా క్లావియాకు ఆర్థికంగా రోజులు గడవడం కష్టమనేది స్పష్టమే. ష్లికావ్ ఎప్పుడూ బాగా డబ్బు సంపాదించేవాడే; అతనిభార్య సౌఖ్యప్రదమైన, సురక్షిత జీవితానికి అలవాటుపడ్డది. ఇప్పుడామె పెద్దగా ఆర్జిస్తూన్నట్లూ లేదు; పైగా దాన్నిగురించి యేఫిర్యాదూ చేయడంగాని, విచారించడంగాని చేయడంలేదు.

తన జీవితాన్ని సైన్యంలో గడిపే దినాల్లో ఖర్చు చేయడానికి వేరే పనేమీలేక కొంత బాగానే కూడబెట్టాడు కాజిమోవ్. ఇంతవరకు తన నెంతో దయతో ఆదరించిన కుటుంబానికి సహాయపడాలనే ఆలోచనే తనకు కలుగనందుకు యిప్పుడెంతో విస్మయం చెందాడు. అనుకోకుండానే జేబు

లోంచి లావాటి మనీపర్సు బైటకు లాగి టేబిల్ మీద పెట్టాడు.

"ఇది మీకే, క్లావ్దియా వాసిల్యేవ్నా. మీకుగాని, స్లావాకుగాని యేమికావలసినా కొనుక్కోండి; లేదా యింకేమైనాసరే చేయండి" అన్నాడు.

ఇక ఆ రాత్రికి తన బిడ్డను పడుకోబెడుతున్న క్లావ్దియా ఆశ్చర్యంతో వెనక్కితిరిగి చూచింది. పర్సువంకా, కాజిమోవ్‌నూ తేరిచూచింది; ఆమె మొహం ఒక్కసారి కోపంతో జేవురించింది.

"తీసుకోండి, పాంతెలీ పెత్రోవిచ్! తీసేసుకోండి!" అని ఈసడింపుతో ఆవిడ అరచింది. దానిని ఆమె తాకలేదు సరిగదా తన చేతులు మలినమౌతాయేమోనన్నట్టు వెనక్కి పెట్టుకుంది.

కాజిమోవ్‌కు నిజంగా ఆశ్చర్యం వేసింది— ఎందుకంటే యుద్ధరంగంలో యిలాంటివి చాలా మామూలు: ఎవరిదగ్గరైనా ఏమైనా డబ్బువుంటే—సరేసరి; లేకపోయినా ఏం పర్వాలేదు! మరెందుకీ ఉద్రేకమంతా?

"తీసుకోండి, తీసుకోండి. దాన్నిగురించి మరేం చర్చించే పనిలేదు. మీ భర్త పోయాడు; నేనాతని స్నేహితుణ్ణి. అంతే, ఏముంది ఇందులో!"

"మేమేమీ అడుక్కుతినేవాళ్ళం గాదు," అని నిర్దుష్టంగా స్ఫుటంగా సమాధానం చెప్పిందామె. నా భర్తకోస

మని నాకు చెప్పనిస్తున్నారు. నేనూ పని చేస్తున్నాను. ఎలాగో ఒకలాగ గడపగలం. వెంటనే మీడబ్బు మీరు తీసుకోవాలి."

క్లావ్దియా కనుబొమలు ఏకమయ్యాయి; ఆమె కళ్ళు కోపంగా ముడుచుకున్నాయి. ఇప్పుడామె మొఖం ఆనాటి ఊహానిర్మితమైన గుడ్డబొమ్మను ఏమాత్రం పోలడంలేదు.

"అయితే దీన్ని నా అద్దెకిందో, మరోవిధంగానో భావించి తీసుకోండి... నాకేం తెలియడంలేదు ఏమిటో... ఏమయినా నేను మీ గదిలోనే నివసిస్తున్నానాయె."

"నాగదిని అవకాశంగా తీసుకొని లాభం పొందలేను నేను", అని క్లావ్దియా కఠినంగా మాట్లాడింది. "మీరు అలాగే ఆలోచిస్తున్నట్టయితే దయచేసి మీ సూట్‌కేసు తీసుకుని బైటకు నడవండి."

"అయితే ఎందు కంత కోపం మీకు? ఇంతకీ నే నన్నదాంట్లో తప్పేమిటి?" అని కాజిమోవ్ మరింత గందరగోళపడి గొణిగాడు.

"మీ రెంత మంచిపార్టీసభ్యులో నేనూ అంతే" అన్నదామె యీసడింపుగా.

ఆమె తన డ్రాయరు బల్లవద్దకు వెళ్ళి, దానిమీద నుంచి అద్దె బాకీ నోటీసును పట్టుకొచ్చి, కోపంగా టేబిల్ మీద కొట్టింది.

"ఇందులో సగం మీరు చెల్లించవచ్చు."

కాజిమోవ్ నిజంగానే తల్లక్రిందు లవుతున్నాడని ఆమె గమనించిందిలాగుంది: అంతలోనే ఒక చిన్న చిఱు

నవ్వు ఆమె నోటిచెలువలను కదిలించింది; మరల సామరస్య పూర్వకంగా అన్నది:

"సరే. అయితే మనం కాస్త టీపుచ్చుకుందాం ఇక."

ఆరాత్రి ప్రొద్దుబోయేవరకు ఆ ట్రంకుమీద, కాజి మోవ్ నిద్రపట్టక అటునిటు కొట్టుకుంటూనే వున్నాడు. అక్కడ డ్రాయరుబల్లమీద అలారం గడియారం తీరిక లేకుండా టిక్కుటిక్కుమంటూనేవుంది. ఎన్ని సంవత్సరాలు గానో పరిచయమున్న యీ ధ్వనిని వింటూ గ్లాడియా కోప కారణమేమిటో ఆలోచించసాగాడు. గత కొద్దిరోజుల్లోను అతను అనుభవించిన ప్రతిదానినీ పరిశీలించి చూచుకోవా లనే కోరికను యీ చిన్నవిషయం రేపెట్టింది. బహుశా తన దుఃఖంలో, తాను మరీ ఎక్కువగా మునిగివున్నాడా? బహుశా తాననుకున్న దానికంటె ప్రతిదీ సామాన్యమయిందీ, సాధా రణమైనదనేమో? తనలో తాను ఆత్మపరిశోధన చేసుకో వడం కొంత కట్టిపెట్టేసి, తనచుట్టూ వుండేవారిని గురించి మరికొంచెం పట్టించుకోడం ఇంకా మంచిదేమో?

ఇలా దీర్ఘంగా ధ్యానంచేసినదాని ఫలితంగా ఉదయం 6 గంటలకు అలారంపెట్టాడు; కర్మాగారానికి పొద్దు పొడ వకమునుపే వెళ్ళి ఒకబట్టీపనిని తీసుకోడానికి సిద్ధమేనని మేస్త్రీతో చెప్పడానికి నిశ్చయించుకొన్నాడు.

మర్నాడు కర్మాగారంలో ఎప్పుడూ వంకరతిరిగిన ఒకపైపును నోటకరుచుకుని కనబడే ఆమేస్త్రీని కలుసు

కున్నాడు. అతనుగూడ కాజిమోవ్ చెప్పినదంతా విని, హుషారుగా యిలా సమాధానం చెప్పాడు:

"పట్టుదల అంటే అలాగేవుండాలి! మొదటిబట్టీ దగ్గరే మీపని ఆరంభించండి. జఖరోవ్ జబ్బుపడ్డాడని నా కిప్పుడే ఫోన్ చేశారు; షమిలోవ్‌ను యివ్వాళ రెండు షిఫ్టులు పనిచేయమని అడుగుదామనుకుంటున్నాను. వాళ్ళిప్పుడు పోతబోయడానికి సిద్ధమవుతున్నారు; మీరుగూడ వెళ్లి ఎలా తయారుచేస్తున్నారో చూడండి. ఇప్పుడు మూత మూసేసి, బయటకుపోయే మార్గం ఆరిపోయే సమయంలోనే గ్యాస్‌ను అందించడం ఆపివేస్తాం—పని జరుగుతూండగానే దీన్ని తయారుచేస్తాం."

"నాకు తెలుసు-అలా పనిజరుగుతూండగా చూశాను. బట్టీ దాదాపు ఎప్పుడూ ఆరిపోనే పోదు," అని నిశ్చలంగా సమాధానం ఇచ్చాడు కాజిమోవ్.

అంత త్వరలోనే బట్టీవద్దకు వెళ్ళవలసివచ్చినందుకు అత నెంతో సంతోషపడ్డాడు. యుద్ధరంగంలోనూ అలాగే వుండేది. పూర్వం విశ్రాంతి కొంచెం దొరికినసమయం మధ్యలో ఒక్కొక్కసారి లైజాన్ ఆఫీసరు (ముందు వెనుకల సైనిక నాయకత్వాలమధ్య అనుసంధానంజేసే అధికారి) ఊడిపడ్డట్టు వచ్చిపడి తమ బెటాలియన్‌కు ఆర్డర్లు జారీచేసే వాడు; అప్పుడు యేమాత్రం ఆలసించకుండా టాంకుల్లో యెక్కి, మోటార్లను ఆడించి, దాడులుచేయడానికి దవుడు పెట్టాలిసివచ్చేది. ఆనాడు పోరుకుముందు నిర్ణయాత్మకమైన

క్షణాల్లో యెలా వుండేవాడో అలాగే యీ ఉక్కు-కరగించే కార్మికుడుగూడ యీ సమయంలోనూ అం ఉద్రేకం పొందాడు. అదివరకే తయారుచేసిపెట్టిన మూసలవద్దకు ఇంజనీయరుతో బాటు వెళుతూంటే అతడి వ్రేళ్ళ కొనలు చల్లబారినట్టయింది. అక్కడున్న అసిస్టెంటుకీ, యితర దళ సభ్యులకు అభివాదం చేసి పనికి ఉపక్రమించాడు కాజిమోవ్.

ప్రతిదీ సిద్ధంగావుంది. కాజిమోవ్ ఆదుర్దాపడవలసిందేమీలేదు. అతని ఉద్రేకమంతా ఆరిపోయింది; కరగబోత ఆరంభమయినపుడు తనకు ఎంతగానో ప్రియమైన ఆ పనికి తానెంతగా దూరమైపోయాడో గ్రహించి బాధపడ్డాడు. నోట్లో పైపును ఎప్పుడూ ఎగపీల్చుతూండే మేస్త్రీ కాజిమోవ్ దగ్గరకువచ్చి కొత్తవీ, మరేమంత క్లిష్టమైనవి కానివీ అయిన ఆ యంత్రాలు ఎలా పనిచేస్తాయో చూపడానికీ, అతనికి సలహాలు, ప్రోత్సాహం ఇవ్వడానికీ వస్తూనేవున్నాడు. కాజిమోవ్ గూడ శాయశక్తులా పనిచేశాడు. ఒంటినిండా చెమటల్లో మునిగి తేలుతున్నాడు; అనేకసార్లు దాహం తీర్చుకోడానికి నీళ్ళకుండీ చుట్టూ తిరిగాడు; అయినా గొంతుక అంతా ఎండి బొంగురుపోయింది; చివరకు పనిదినం సగానపడేసరికి అలసటతో రాలిపోయే స్థితివచ్చింది. ఇంత జరిగినా తనదళంలోని సభ్యులు విడిగా ఒక్కొక్కరు ఎంత బాగా పనిచేసినా దళం మొత్తంలో సమన్విత కృషి లోపించిందనే భావాన్ని పారద్రోలలేకపోయాడు.

"నేను వెనకబడిపోయాను. ఈ వెనుకబాటులో ఆశ లేశమైనా కనబడదు" అని చింతిస్తూ తన అసిస్టెంటువంకా,

యితరదళ సభ్యులవంకా ఓరగాచూచి ఆలోచించసాగాడు. బట్టీని పనిచేయించడంలో అనిశ్చయాన్నీ, తన చేతులు వణక డాన్నీ, వంకర పైపొకటి నోట కరుచుకు తిరిగే ఆ ఇంజ నీయరు వచ్చి సాధారణంగా మాట్లాడినట్లే మాట్లాడి వాస్త వానికి తనకు ప్రోద్బలం యివ్వడాన్నీ వాళ్ళంతా చూశా రేమోనని విస్తుబోయాడు. "ఇంతకూ నా అప్రతిష్టలు చూసి కావాలని గంతులువేయడానికా అన్నట్టు అతనెందుకు పని గట్టుకొని నా చుట్టూ తిరుగుతూండాలి?"

అతన్ని భయభ్రాంతునిజేసిన మాటలే యిప్పుడు మెద డులో కలకవేయసాగాయి. ఏ క్షణంలోనైనా కాటువేయ డానికి సిద్ధంగావున్న దోమలు తన తలచుట్టూ తిరుగుతున్నట్ట యింది—"వెనకబడిపోయాను, పూర్తిగా వెనకబడిపోయాను." ప్రతి చిన్నవిషయం కాజిమోవ్‌ను కలతబెట్టింది. గమ్యం లేకుండా హడావిడిగా అటూనిటూ తిరగసాగాడు; ఏదో చిన్న విషయాన్ని పురస్కరించుకొని తన అసిస్టెంటును గట్టిగా గదుముకున్నాడు; అంతలోనే అలాచేసినందుకుమళ్ళీ సిగ్గుపడ్డాడు. ఒక్కగ్రుక్కలో మానెడునీళ్ళు మ్రింగి, కొంత ఉపశమనం పొంది, హఠాత్తుగా తన్నుతానే ప్రశ్నించు కొన్నాడు: "ఓ పాంతెలీ! నీలోవున్న ప్రతి అంశాన్నీ అక్కడ యుద్ధభూమిలోనే వదిలేసి వచ్చావా. యేం?"

చేతులు వణకసాగాయి; కాళ్ళు నిలబడడంలేదు. కరగ బోత కార్యక్రమం చాలా బాధాకరంగా, ఆలస్యంగా సాగు తూంది. దాదాపు టైం అయిపోవచ్చింది; బట్టీలన్నీ ఒక్క

క్కడే కరగిన ఉక్కును ధారపోస్తూంటే కాజిమోవ్ బట్టీలో నుండి తీసిన నమూనా ఉక్కు మాత్రం ఇంకా ఉక్కు తయారు కాలేదని తెలుపుతోంది.

ఏదో భీతిగొలిపే స్వప్నంలోంచి బయటపడ్డట్టు తన షిప్ట్ అయిపోవడం గమనించాడు; అతని దళం వెళ్ళిపోవడం, మరో షిప్ట్‌లో పనిచేసేవారు రావడం, వచ్చి అతన్ని ఆశ్చర్యంగా చూడడం— అంతా గమనించాడు. "ఇక్కడే కూరుకుపోయారా?" అని వాళ్ళంతా హేళనచేసినట్లనిపించింది అతనికి.

అప్పుడే షుమిలోవ్ కార్ఖానాలోకి వచ్చాడు. కాజిమోవ్ యొక్క ఆరంభ ప్రయత్నంగురించి అభినందించాడు; అతనితో కరచాలనంచేసి, హుషారుపరచ ప్రయత్నించాడు. కాని ఓటమితో నిరుత్సాహపడిపోయిన కాజిమోవ్ అతను చెప్పేదేమీ విననుగూడ వినలేదు. చిట్టచివరకు గొట్టంగుండా కరిగిన ఉక్కుధార పడుతూంటే కార్ఖానా అంతా ఆవరించిన నీలంపొగలో యెగిరిపడే రవ్వలు మెరుస్తుంటే కాజిమోవ్ నిస్సారంగా ప్రక్కనున్న లోహపు పడక కుర్చీలో కూలబడిపోయాడు.

అదే సమయంలో వివిధబట్టీల ముందుజరిగే పని యొక్క పోటీల రికార్డులను గుర్తులుపెట్టే ఒక గుండ్రటి చురుకైన పిల్ల రంగంలోకి ప్రవేశించింది. తన రిపోర్టులు చూసుకొని యే బట్టీదగ్గర పని యెంతసేపుపట్టిందో నోటీసు బోర్డుమీద వ్రాస్తోంది. మొదటగా దూరానవున్న బట్టీతో ఆరంభించి క్రమంగా యిటు కాజిమోవ్ బట్టీవద్దకు వచ్చింది.

అతని బల్లప్రక్కన వ్రేలాడే నోటీసుబోర్డుదగ్గరకు పోయి "పి. కాజిమోవ్" అని మెల్లగా దొబ్బిడాయిపుట్టుకొచ్చే టంత ఆలస్యంగా వ్రాసింది. ఏదో విస్మయాన్ని వెలి బుచ్చుతూ నిర్ధారణకోసం యింకొకసారి తన రిపోర్టులోకి తొంగి చూచుకొన్నది. తను తీర్చిదిద్దిన కనుబొమలను సన్నని గీతలాగా ముడిచి, ఒకసారి భుజాలు యెగరవేసి షుమిలోవ్ పేరుక్రింద "5గం. 25ని." అనీ, కాజిమోవ్ పేరుక్రింద "9గం. 10ని." అనీ వ్రాసింది. ఇదేమీ అనుకోనివిషయం గాదు. షుమిలోవ్‌కంటె తా నెంతో వెనుకబడిపోయినట్లు కాజిమోవ్ యెరిగేవున్నాడు; కాని యీ వ్రాతపూర్వక మైన పోలికనుచూచి యేదో దెబ్బతిన్నవాడిలాగ బాధతో ఒక్కక్షణం కళ్ళుమూసుకున్నాడు.

ఎంతో నిస్తేజంతో, కష్టంతో తన కుర్చీలోంచి లేచి, స్నానాల గదులవైపు అడుగులో అడుగువేసుకుంటూ దుమ్ముతో పాదాలు యీడ్చుకుంటూ మెల్లగా సాగిపో యాడు. అతని అసిస్టెంటు స్నానంచేస్తూ తన సహచరులతో నవ్వుపుట్టించే కథనేదో చెబుతున్నాడు. వేడినీళ్ళ స్నానంతో వారందరి దేహాలు ఎఱ్ఱబడ్డాయి; ఆ కథవిని వారంతా విరగ బడి నవ్వుతున్నారు. కాని కాజిమోవ్ రావడంతోటే ఆ నవ్వంతా ఒక్కసారిగా ఆగిపోయింది. తననుగురించే వాళ్ళు నవ్వుకుంటున్నారని అతనికి స్పష్టమయింది. వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు. ముఖమైనా తడపకుండానే తన పెద్దకోటును

భుజాన తగిలించుకొని వాకిట్లోకి నడిచాడు. తన అసిస్టెంటూ, తదితర స్నేహితులూ రాకమునుపే అక్కడనుంచి వెళ్ళిపోవా లనుకున్నాడు. కార్ఖానానుంచి పరుగుదీసినట్టు వచ్చి బయట బడ్డాడు. ఆ నోటీసుబోర్డుమీద వ్రాయబడిన తన అప్రతిష్ట సూచీని ప్రతివాడూ వెళ్ళి చూచివచ్చినట్టు భావించాడు. అక్కడివారంతా, "నీకేమొచ్చింది? పైగా ఒకపుడు అంద రికీ నీవేదో ఉదాహరణగా వుండేవాడివంటారే!" అన్నట్లు తనవంక నిందిస్తూ చూస్తున్నట్లుగా భావించాడు.

# 7

ఆ ఉద్ధృతిని వాకిట్లోకి వచ్చి ఎదురైన జోరిన్‌ను కుమ్మేసినంత పని చేశాడు.

"ఓ ! ఓ !! నా రెండో కాలిని గూడ పచ్చడిచేసి కార్ఖానాలో రాజకీయకృషిని రెండుకాళ్ళమీదా కుంటు కుంటూ పోయేలా చేద్దామనా యేం! "అని జోరిన్ పరిహ సించాడు. "సరే, మీ ఆరంభప్రయత్నానికి నా అభినంద నాలు. ప్రథమయత్నమే అత్యంత కఠినమైందని అంటారు గదా !"

కాజిమోవ్ ముఖంమీద ఒక చిన్న చిరునవ్వు వెలిసింది.

"నిజంగానే కఠినమైందిసుమా" అన్నాడు.

ఒక నిట్టూర్పు విడిచి తనదోవను తాను వెళ్ళిపోదా మని చూశాడు. కాని, జోరిన్ అతని మోచేతిని గట్టిగా పట్టుకొని:

"ఎక్కడికి ఆ వెళ్ళడం? మీ ఉపన్యాసం సంగతేమిటి?" అని అడిగాడు.

అప్పుడుగాని ఆనాడు తానివ్వవలసిన ఉపన్యాసం సంగతి జ్ఞప్తికి రాలేదు కాజిమోవ్‌కు. జ్ఞాపకానికి రావడం తోటే నిశ్చేష్టుడై అలాగే నిలబడిపోయాడు. ఆ విషయమే పూర్తిగా మరచిపోయాడు; దాన్నిగురించి యే ప్లానూలేదు; అందుకోసం ఏమీ తయారు చేసుకోలేదు; తనేమిచెప్పాలో గూడ అసలు అనుకోనేలేదు.

"నావల్లగాదు; నా ఒంట్లో బాగుండలేదు," అని గొణిగాడు.

ఇతని స్థితిని అర్థంచేసుకున్నట్టుచూసి జోరిన్ కొంచెం కోప్పడుతూన్నట్టు అన్నాడు :

"అలా నాకూ జరిగిందిలే. అక్కడ యుద్ధభూమిలో ఒక సెక్షన్ని కమాండుచేసిన నేను యిక్కడకు వచ్చిన తర్వాత నా జేబులోకి సరిపోయేంతటి బ్రేలెడు కుర్రాడిదగ్గర నుండి ఆర్డర్లు తీసుకోవలసివచ్చింది. ఇంకా అన్నిటికంటె బాధాకరమైన విషయమేమిటంటే—ఆ బ్రేలాడుతోందే—ఆ చట్టువం ఆ కుర్రవాడిచేతుల్లో ఒక ఆటవస్తువులా వుండేది గాని దానితో పనిచేయడం నావల్లఅయింది గాదు. అప్పుడు అనుకొనేవాణ్ణి—'అరి భగవంతుడా! నా ఉపయోగం కాస్తా తీరిపోయిందా యేం! పిల్లలు ఈలలువేసుకోడానికి మాత్రమే పనికివచ్చే ఖాళీగవ్వనేనా నేను?' తీరా ఆలోచించి చూస్తే అదేమంత కష్టమనిపించలేదు — ఇక్కడ నన్నెవరూ ఎరుగరు గాబట్టి. యుద్ధంలోంచి తిరిగివచ్చిన ఒక కామ్రేడ్‌ను మాత్రమే అందరికీ నేను - అంతే."

కాజిమోవ్ కృతజ్ఞతతో జోరిన్‌వంక చూశాడు; అతనికళ్ళల్లో దయా, సానుభూతీ కనిపించాయి.

"ఆబోర్డుమీద నాపైెం చూశారా?"

"ఆ, చూశాను."

"మరి?"

"మొట్టమొదట్లో నేనూ నేలమీద నాకుండను బ్రద్దలుకొట్టుకున్నంతపని అయింది..." జోరిన్ అక్కడ నుండి కదిలిపోడానికి ఉద్యుక్తుడయినట్టు కనబడింది. "రా, రా. వాళ్ళంతా మనకోసం ఎదురుచూస్తున్నారు. ఆ రెడ్ కార్నర్ అంతా క్రిక్కిరిసిపోయింది—అందులో ఆశ్చర్యం ఏమీ లేదు లే. ఇదేం సామాన్యపు సమావేశమా? ప్రఖ్యాతి గన్న కాజిమోవ్‌గదా మాట్లాడబోయేది!"

అదినిజమే—రెడ్‌కార్నరంతా జనంతో నిండిపోయింది. బెంచీలన్నీ నిండాయి; జనం టేబిళ్ళమీదా, కిటికీల్లోనూ గూడ కూర్చున్నారు. కొంతమంది గోడలవెంట బారులుతీరి నుంచున్నారు; కుర్రకారువాళ్ళు మధ్య నడవలో చతికిల బడి నేలమీదే కూర్చున్నారు. ఆ గుంపులో ఎవరివంకో చూచి పార్టీకార్యదర్శి ఎవరూ చూడకుండా కన్నుగొట్టాడు; వెంటనే సమావేశస్థలమంతా చప్పట్లతో గింగురుమంది. ఈ ఆహ్వానాన్ని చూసి కొంత గందరగోళంబడి కాజిమోవ్ ఆ గుంపులమధ్యగా వేదికమీదకు వెళ్ళాడు; అక్కడే తన ఉపన్యాసాన్ని యెలా ఆరంభించాలో హడావిడిగా ఆలోచించసాగాడు.

ముందు బెంచీమీదే నీలందుస్తులు ధరించిన ఒక పొడుగాటి పిల్ల ప్రక్కన వాలోద్యాషుమిలోవ్ కూర్చుని వున్నాడు. కోలమొహం, తీర్చిదిద్దిన అంగసౌష్టవం, చారెడేసి కళ్ళూ గల ఆ పిల్లను కాజిమోవ్ కార్ఖానాలో యిదివరకు చూచేవున్నాడు. ఆ కళ్ళవంక చూస్తూంటే అతనికి ఆవుదూడకళ్ళు గుర్తుకొచ్చాయి. పిల్లిద్దరూ యింకా ఆ చుట్టూచేరిన కుర్రకారుజనం మరీ బిగ్గరగా చప్పట్లుకొట్టారు. చూడగా మొదటిషిఫ్టును పూర్తిచేసుకున్న వాళ్ళంతా వచ్చి చేరినట్టుంది. చివరకు మేస్త్రీగూడ నోట్లో ఆ వంకరతిరిగిన పైపు పెట్టుకొని దూరాన ఒక మూలన తలుపుకు చేరగిలబడి నిల్చున్నాడు.

మొట్టమొదట కాజిమోవ్‌కు తట్టింది తనకేసి చూసే వాళ్ళందరి ముఖాల్లోను కనబడే యౌవనం. 40 యేండ్లవాడే అయినా తానే బహుశా వాళ్ళందరిలోకీ పెద్దవాడేమో గూడ.

యుద్ధంలోగూడ వత్తిడి మరీభారంగా తోచిన సమయాల్లో స్పష్టతను కోల్పోకుండా నిశ్చలంగా నిలబడే యితని సామర్థ్యానికి అతని కమాండింగు ఆఫీసరు ప్రత్యేకంగా కాజిమోవ్‌ను కొనియాడేవాడు. తను చేయవలసిన ఉపన్యాసానికి తానేమీ తయారుగాకుండా వారందరి ఎదుట అలా వేదికమీద నిలబడ్డప్పుడుగూడ సరిగ్గా ఆ సామర్థ్యమే అక్కరకు వచ్చింది. వెనువెంటనే స్వీయస్థిమితాన్ని కూడదీసుకొని, తన ముందున్న యువకుల ముఖాలవంక పారచూశాడు. అదే సమయంలో అతని మెదడుమాత్రం తీవ్రంగా పనిచేయ

సాగింది; ఏవేవో విషయాలు అతని మనస్సులో రూపొంద సాగాయి. ఇప్పుడు దేనినిగురించి మాట్లాడాలో అతనికి

కార్యదర్శి క్లుప్తంగా సభికులకు పరిచయం జేశాడు కాజి మోవ్‌ను. పరిశ్రమలో, యుద్ధరంగంలో అతని సేవలనుగురించి పలికి ఇకకూర్చున్నాడు. కాజిమోవ్ ఆత్మవిశ్వాసంతో ముందు కొచ్చి నిలబడి జర్మనీఆక్రమణ ప్రథమదినాలగురించీ, కమాం డెంటు హోదాలో తను వెళ్ళిచూసిన యంత్రాల నిర్మాణ కర్మాగారం గురించీ చెప్పనారంభించాడు. అక్కడ పనిచేసే వారందరిలోను కాలనియమంలోనూ, ఉత్పత్తికీ పేరుమోసిన కార్మికులను—అంటే ప్రథమశ్రేణికి చెందిన వారిని—తనకు పరిచయం చేయవలసిందిగా ఆ కర్మాగారపు యజమానిని డిమాండుచేశాడు. తన ముందున్న సభికుల వినోదంకోసం ఆ యజమానిలాగే వికృతంగా ముఖంపెట్టి ఆనాడు ఆజర్మన్ యజమాని అడిగిందే చెప్పాడు: "ప్రథమశ్రేణివారంటే ఏమిటి? మీరననేదేమిటి? మిస్టర్ ఆఫీసరు, దయచేసి తమ ఉద్దేశాన్ని విశదంచేస్తారా?" ఆతర్వాత ఒక దుబాసీ సాయంతో ఎంతోసేపు ఏవేవో వివరణలుచేసిన తర్వాత తేలిందేమిటంటే ఆనాటికి జర్మనీలో కార్మికుల వ్యక్తిగత కర్తవ్య నిర్వహణాశక్తిని నిర్ధారించడం యింకా అపురూప విషయమే నని.

చిట్టచివరకు చాలాసేపటికి అతనిని అడిగిందేమిటో ఆ యజమాని బుర్రలోకి దూరిన తర్వాత అతని ముఖమంతా

ఒక పెద్ద ఇకిలింపుగా విచ్చుకుపోయింది; కమాండెంటు ఆఫీసు ప్రతినిధిని సంతృప్తిపరచగలిగినందుకు తానెంతో సంతోషిస్తున్నానని చెబుతూ ఆ వర్ణనకు సరిపడిన మనిషి ఒకడు తన కర్మాగారంలో పనిచేస్తున్నాడని చెప్పి తీసుకుపోయాడు. ఈ మనిషి మిగతా కార్మికులకంటె రెండు-మూడురెట్లు పని చేయగలుగుతున్నాడు. యజమాని స్వయంగా కాజిమోవ్‌ను వెంటబెట్టుకుని కార్ఖానాలోనికి తీసుకువెళ్ళాడు.

అక్కడ దూరాన ప్లైవుడ్‌తో దడి కట్టుకొని ఒక మూలన పనిచేస్తున్న ఒక బక్కచిక్కిన మనిషి, గుర్రంలాగ పొడుగాటి ముఖంగలవాడు పనిచేస్తూ కనిపించాడు. అతని ప్రక్కనే అతనిలాగే బక్కపల్చగా, పొడుగాటి ముఖంగల పిల్లవాడొకడు—తండ్రిపోలికను పుణికి పుచ్చుకున్నవాడొకడు పనిచేస్తున్నాడు. యజమానిని చూడడంతోటే తన లేత్‌ను వెంటనే ఆపివేశాడు; కోతమరను లాగివేసి, దానిని ప్రక్కనవున్న ఒక డబ్బాలో పడేసి, దానికి మూతవేసి, తన పాతదుస్తుల అంచులవెంట చేతులను దిగజార్చి నిటారుగా నిలబడ్డాడు. పిల్లవాడుగూడ అదేపని చేశాడు.

"ఎందుకు ? అలాఎందుకు జరగాలి" సభికులలోనుంచి ఒక గొంతు వినబడింది.

"వాళ్ళ అలవాట్లలో అదిఒకటి. ఒక ఫ్యాక్టరీ యజమానిగాని, కర్మాగారపు యజమానిగాని దగ్గరకు వచ్చినప్పుడు అక్కడ పనిచేసేవాళ్ళు గ్రుడ్లు మిటకరించి తమ యజమానివంకే చూస్తూ, నిటారుగా నిలబడాలి" అని కాజి

మోవ్ చిరునవ్వు నవ్వాడు; తన ముందున్న సభికులను అపుడే తన వైపుకు ఆకర్షిస్తున్నట్టు గూడ గమనించాడు.

వారంతా ఒక్కసారి నవ్వారు.

"ఐతే ఆ పనివాడు తన కోతమరను యెందుకు దాయాలి?"

"ఒక్కక్షణం ఆగండి. ఆ విషయమే చెబుతాను."

తను చెప్పే గాథలో తానే మునిగిపోయాడు. ఈ యువ స్త్రీ-పురుషులకు "యజమాని", "మాన్యుఫాక్చరర్", "పెట్టుబడిదారీవిధానం", "దోపిడి" అనే మాటల యదార్థాన్ని విపులీకరించగలిగినందుకు కాజిమోవ్ సంతసించాడు. ఈ మాటలు వాళ్ళకు పుస్తకాల్లో మాత్రమే కనబడుతున్నాయి. తను చెప్పేది వారంతా శ్రద్ధగా వింటున్నట్టు గోచరించినా ఆ చెప్పేదంతా అర్థంలేని కాకమ్మ కథేనేమోననే అనుమానంకూడా వారిలో లేకపోలేదని తెలుసుకున్నాడు.

తనకు పరిచయం చేయబడ్డ కార్మికుడు మిగతా కార్మికులనుండి దడిగట్టుకుని వేరుగా వుండడం; తన కోతమరలను దాచివేయడం అంతాగూడ అతనినైపుణ్యరహస్యం తనబిడ్డకు తప్ప మరెవరికీ చెందరాదనే ఆదుర్దాకొలది మాత్రమేనని కాజిమోవ్ వివరించినప్పుడు ఆ బారులు తీరిన శ్రోతలలో గుసగుసలు అలలు అలలుగా తేలిపోయాయి. అంతేగాక ఆ కార్ఖానాలో పనిచేసే ఇతర లేత్ పనివాళ్ళు ఆ రహస్యాన్ని గ్రహించడంకోసం అతనికి త్రాగబోయించ

చినా నిష్ప్రయోజనమైందనీ, ఒకసారి ఒక కల్లుదుకాణంలో అతన్ని పట్టుకుని చావమోదారనీ, అక్కడెవరూ అతనితో కరచాలనం చేసేవాళ్ళు కారనీ కాజిమోవ్ చెప్పినప్పుడు సభలో చెలరేగిన గుసగుస లోతైన రణగొణధ్వనిగా మారి పోయింది.

"మిగతా వాళ్ళనుండి అసలెందుకు దాయాలి అతను?"

"అవును, ఎందుకు దాయాలి? వాళ్ళంతా కార్మి నాయె— పెట్టుబడిదారులుగాని, మరేమీగాని కాదాయె!"

"అసలు పిచ్చివాడేమో—ఏం?" అని ఆవుదూడ కళ్ళలాంటి కళ్ళుగల పిల్ల అడిగింది; అడిగి అవునా కాదా అన్నట్టు సందిగ్ధంగా నవ్వింది.

అంతా విరగబడి నవ్వారు. కార్యదర్శికూడ పకపక మని, అంతలోనే సంబాళించుకొని బల్లమీద పెన్సిల్‌తో కొట్టాడు; కాని గదిలోమాత్రం నిశ్శబ్దం నెలకొనలేదు.

"అదేంగాదు. పిచ్చేమీ ఎత్తలేదు. అతనికి కావల సినదంతా నిరుద్యోగాన్నుంచి రక్షణ. అందుకే తన రహ స్యాన్ని అంత పదిలంగా కాపాడుకుంటున్నాడు."

హాలులో ఎవరో అన్నారు:

" భలే పద్ధతే సుమా!"

కాజిమోవ్‌కు హుషారుగా వుంది.

"అయితే, చూడండి!" మీలో ఎవరైనా నిరు ద్యోగిని చూసివున్నారా? ఊఁ. ఎవరైనా వుంటే చేతు లెత్తండి మరి. అంటే నిజంగా నిరుద్యోగి అయినవాడనే నా అభిప్రాయం; అంతేగాని సినిమాలో వేషంగురించి కాదు."

మూడు చేతులు మాత్రం పైకిలేచాయి. ఒకటి బట్టీ కార్ఖానాలో మేస్త్రీగా పనిచేసే ఒక బొద్దంకిమీసాలుగల ముసలివాడిది; రెండోది స్నానాల గదిలో అజమాయిషీ చేసే తాతది; మూడో చెయ్యి అధ్యక్షవేదికపై కూర్చున్న జోరిన్‌ది.

దూరాన ఒకమూల ఏదో వాగ్వివాదం తీవ్రమైంది. ఎవరో బిగ్గరగా అరచారు.

"ఎందుకా గుసగుసలు? చెప్పండి — అందరికీ చెప్పండి!"

కాజిమోవ్ క్రింద అసిస్టెంటుగా పనిచేసిన యువకుణ్ణి నిలబెట్టారు కొంచెం బలవంతంగానే.

"ఏయ్! ఏమిటదిఅంతా! అని బాగా చూడాలని లేస్తూనే అడిగాడు జోరిన్.

"ఇక్కడకూడ మనకు అలాగేవుండేదని నేనెంతచెబుతున్నా వీళ్ళంతాఒకటే ఇకిలించడం!" అని చివరికా యువకుడు చెప్పాడు.

"అదెప్పుడయ్యోయ్?"

"ఎప్పుడా! జార్ చక్రవర్తుల రోజుల్లో."

"అయితే అప్పుడు నీవెక్కడవున్నావో! జ్ఞాపకమేనా!"

"ఆ, వాడికి జ్ఞాపకమేలే! 1946 లో స్కూలు టోపిని ఒకటి తగిలించుకొని తిరుగుతూండేవాడు!" అని ఎవరో అన్నారు.

వెనుకవరసల్లో నవ్వు బ్రద్దలయింది. ఈ ప్రక్కవాటు చమత్కృతులన్నీ చిరునవ్వుతో విన్నాడు కాజిమోవ్.

తనుగూడ ఉక్కుమిల్లులో ప్రవేశించిన ఆరంభదినాల్లో—ఆదినాలు ఏ పురాణకాలమో ననిపిస్తోందిప్పుడు- -వయసు మళ్ళిన కార్మికులు తమతమ బట్టీలవద్దచేసే ఇంద్రజాలంవంటి కృషిని చూశాడు; వారూ యింత పట్టుదలతో అప్పుడే పనిలో ప్రవేశించిన ఆరంభకులకు తమతమ రహస్యాలను తెలియజేయడానికి నిరాకరించేవారు. కాని యీనాటి యువకులకు మాత్రం—గత ఏడేండ్లలోనూ యీ కర్మాగారంలో చేరి, పునర్నిర్మించబడ్డ యీమిల్లులో అత్యంత క్లిష్టమయిన యంత్రాలతో పనిచేసే యీ కుర్రకారుకు మాత్రం తాను చెప్పేదంతా ఎంతో అసంగతమైందిగానే గాక అసలు ఊహాతీతమైందిగా గూడ కనిపించింది.

"కామ్రేడ్ కాజిమోవ్! ఈయజమాని ఎలావుంటాడో కాస్త నాకు చెప్పండి. అంటే స్వరూపంలో సుమా!" అని అతనిఖర్మను నిర్దేశించే ఫలితాలను ఆనాడు బోర్డుమీద సుద్దముక్కతో వ్రాసిన గుండ్రటి అమ్మాయి అడిగింది.

"అయితే పెద్దపెద్ద భూస్వాములుగూడ మీకక్కడ కనిపించారా?"

అనుకోకుండానే కాజిమోవ్ ఉపన్యాసం పెట్టుబడిదారీ విధానపు పాపాలమీద ఒకసాధారణ చర్చగామారింది. యూరప్ అంతటా తిరిగివచ్చిన అనేకమంది మాజీసైనికులు గోష్ఠిలో పాల్గొన్నారు. చివరకు స్నానాలగదివద్ద కాపలా కాసే ముసలితాతగూడ యీ సభికులిచ్చే ఉత్సాహంతో పూర్వపు కర్మాగారపు యజమానుల గురించీ, వారి పోకడలనుగురించీ తనకు జ్ఞాపకమున్నవిషయాలు ఏకరువుపెట్టాడు.

కాజిమోవ్ కర్మాగారాన్ని వదిలేసరికి చాలా ఆలస్య మయింది. ఒక యువతీయువకులగుంపు హుషారుగా వాదించు కుంటూ తనతో రాగా వారివెంట బయలుదేరి వెళ్ళిపోయాడు.

ఆ గుంపులో వున్నంతసేపు అతని మనసు ఎంతో తేలికగావుంది. తను మొదట్లో ఇక్కడకు వచ్చిననాటివలెనే యీనాడుగూడ సుళ్ళు తిరుగుతూ, నృత్యంచేస్తూ బజార్ల గుండా మంచుమబ్బులను తరుముకుంటూ పోయే మంచు తుపాను చెలరేగుతోంది. కాని ఒకసారి ఆ గుంపునుండి వేరుబడి ఒంటరిగాడైనప్పుడు మాత్రం ఆనాడు కార్ఖానాలో తాను పొందిన అపజయం కాజిమోవ్ మీద భారంగా పడ్డట్టయింది. తన టోపీమీదా, భుజాలమీదా కురిసిన మంచు దిండ్లు దిండ్లుగా పేరుకుపోతున్నా గంటలతరబడి ఆ మంచు కురిసిన బజార్లగుండా ఫలానా లక్ష్యమంటూ లేకుండా తిరి గాడు. చివరకు ఇంటి ముంగిటకు వచ్చాడు; కాని మళ్ళీ తిరిగి వెళ్ళిపోయాడు— ఎందుచేతనో లోపల క్లావ్దియా తన ప్రథమదిన ప్రయత్న ఫలితాలనుగురించి అడుగుతుందని హడలిపోయాడు. ఉక్కు కరగపోతవాడుగా తాను పొందిన పాత ప్రఖ్యాతిని ఎరిగివున్న ఆమెకు తానేమి చెప్పగలడు ?

ఇంట్లో దీపాలన్నీ ఆరిపోయేవరకు బజార్ల వెంట తిరు గుతూనే వున్నాడు. మరో అరగంట అటూఇటూ తిరిగి, దొంగలాగ నిశ్శబ్దంగా గదిలోకి వెళ్ళాడు. ఆ చీకట్లోనే తన పక్క వేదికి, గుడ్డలు మార్చుకొని పడుకున్నాడు; వెంటనే కలత నిద్రలో పడిపోయాడు.

# 8

మరునాటి ఉదయం యెంతో భారమైన హృదయంతో కర్మాగారానికి వెళ్ళాడు. బట్టీదగ్గరకు వెళ్ళడంతోటే తనకు యిష్టంలేకపోయినా నోటీసుబోర్డువంక ఒకసారి కన్నెత్తిచూశాడు; చూసి బరువుతీసేసినట్టు ఒక్క నిట్టూర్పు విడిచాడు. బోర్డు పరిశుభ్రంగా తుడిచివేయబడి వుంది! ఎవరో నిన్నటి అంకెలన్నీ తుడిచివేసివుండాలి.

మంచెలవద్ద బట్టీకార్మికుల దళం అప్పుడే తమ పనిలో నిమగ్నమైవుంది. షుమిలోవ్ కూడ వున్నాడు; అతను పనివాళ్ళకు పనిని పంచియిస్తున్నాడు. మూసలు పెట్టడంలో షుమిలోవ్ తన స్వంతపద్ధతినే ఆచరిస్తున్నట్టు కాజిమోవ్ తెలుసుకున్నాడు. కుంటి జోరిన్ కూడ నోట్లో సిగరెట్‌తో నిలబడివున్నాడు.

కాజిమోవ్‌ను చూడటంతోటే జోరిన్, నవ్వి, "సాల్యూట్, గార్డ్స్!" అని మిలిటరీపద్ధతిలో అరచి, అతనితో కరచాలనం చేశాడు. "నిన్న యువలోకాన్నంతా మీరు ఉద్రేకపరచి వదిలారుసుమా. ఆ విషయమే యిప్పటిదాకా వాళ్ళు మాట్లాడుకుంటున్నారు" అని అన్నాడు.

వెంటనే మళ్ళీ గంభీరంగా యిలా అన్నాడు: మీ అసి స్టెంటును తీసుకుపోతున్నందుకు—మీ మైత్రీ ఆశీర్వచ నాలతోనే నడుకోండి—ఇవ్వాళ పార్టీ పనికోసం తీసుకు పోతున్నందుకు క్షమాపణ చెప్పుకుందామని వచ్చాను. రెండో షిఫ్టుకుకూడ మీ అసిస్టెంటుగా పనిచేయమని షుమి లోవ్‌నిఒప్పించి పట్టుకొచ్చాను. మీ కేమీ కోపం రాదుగదా!"

చిరునవ్వుతో ఆ యువకుడైన కరగబోత పనివానిని ముందుకు త్రోశాడు.

"తన ఉపాధ్యాయునితో కలిసి ఒకటి రెండు షిఫ్టులు పనిచెయ్యడం అంటే ఎంతో ఆనందకరమని అత నంటు న్నాడు." కాజిమోవ్ వంకా, షుమిలోవ్ వంకా నవ్వుతూ చూసి "ఇలాంటి అసిస్టెంటు దొరుకుతాడని మీరు ఆశించ లేదేమో; ఏం పర్వాలేదు— మనం చేయగలిగిందీ లేదు. ఏదో ఖర్మ అనుకొని వూరుకోండి! బహుశా మీ రిద్దరూ అమోఘంగా కలిసిపోతారేమో, ఎవరు చూశారు! మీకు శుభం కలుగుగాక!"

హఠాత్తుగా వారిని వదిలి జోరిన్ వెళ్ళిపోయాడు. వెళుతూ వెళుతూ తనకెదురైన ఆ గుండ్రాటిపిల్లను — చూడగా ఆపిల్ల నోటీసుబోర్డుమీదనుంచి మాయమైపోయిన అంకెలను తిరిగి వ్రాయడానికే వస్తున్నట్లుంది— వెనక్కు మళ్ళించి తీసుకుపోయాడు.

షుమిలోవ్ ఒక మానెడు సోడానీళ్ళను గటగటా త్రాగేసి అన్నాడు:

"ఎంత ఉడుకెత్తిపోతోంది! నీకు తెలుసా, పాంతెలీ మామా, నిజంగా నేను కొంచెం భయపడ్డాను. ఒకప్పుడు నీ వంటే విద్యార్థులమైన మాకు ఒక్క దేవుడికంటె మాత్రమే ఒకమెట్టు క్రిందికి వుండేవాడివి. ఓట్టు! మేమిక్కడికి వచ్చి, నిన్ను చూసివెళ్ళి, ఆతర్వాత హాస్టలులో కాజిమోవ్‌నే చూసివచ్చామని బడాయిగా చెప్పుకొనేవాళ్ళం. ఒకసారి కార్ఖానాలో నీవు పెన్సిలు పడేసుకుంటే దాన్నితీసుకొని జ్ఞాపకచిహ్నంగా దాచుకున్నసంగతికూడా నాకు జ్ఞాపక ముంది. అందులో ఆశ్చర్యమేముంది? దానితో కాజిమోవ్ వ్రాసివున్నాడాయె!"

"అదంతా పురాతనచరిత్ర లేవోయ్! ఇప్పుడు మిగతా పిల్లవాళ్లు నీవు పడేసుకుపోయిన పెన్సళ్ళు తీసి దాచు కుంటూండాలి."

"ఆహా! అంత అదృష్టమే! నేనొక్కడినే గాదుగా నేనివ్వాళ కరగబోతపనిని 5 గం. 30 ని. లలో పూర్తి చేశాను; కాని ఝెంకొకురోవ్ 5 గం. 35 ని.లలో పూర్తి చేశాడు; నికోలాయ్ పావ్లోవిచ్ వాసిల్కోవ్ నా టైంను ఇంకా దగ్గర పడ్డాడు. ఈరోజుల్లో మేమంతా కలిసికట్టుగా సాగిపోతున్నాంగాని మీరోజుల్లో నీవొక్కడివే మాఅందరికీ పురోగమనమార్గాన్ని దీప్తివంతం చేశావు."

"అయితే అదంతా గతం...సరేనోయ్! రండి, మొదలెడదాం!!"

ఆనాడు పని కొంత తేలిక అనిపించింది. బహుశా అందరితోబాటుగా కాజిమోవ్ కలిసి పనిలో మునిగినందు వల్లగాని లేదా బహుశా అతనియొక్క అసాధారణమైన అసిస్టెంటు తనపనిలో కొంతభాగాన్ని పైకి కనబడకుండా, అడ్డు తగలకుండా చేసుకుపోవడంవల్లగాని—కారణం ఏమయినా—ఆ క్రితంరోజున అత ననుభవించిన అలసట యీనాడు లేదు. కాజిమోవ్ చేసేపని ఆత్మవిశ్వాసం, ధృడనిశ్చయాలతో సాగిపోతూంది; కొత్త టెక్నిక్‌ను ఆకళింపు జేసుకోవడంలో తన సామర్థ్యాన్ని పెంచుకుంటున్నాడు. గత ఏడేండ్ల కాలంలోను ఉక్కు కరగబోత పద్ధతుల్లో చాల పెద్దమార్పులు వచ్చాయని అతడు గ్రహించాడు. పాతరోజుల్లో ఉక్కు తయ్యారైందీ లేనిదీ తెలియాలంటే కంటితో పరీక్షించే వారు; ఒకనమూనా ముక్కతీసుకొని దానిపై పగుళ్ళలో ఏర్పడే స్ఫటికాలను, సుత్తిదెబ్బలకు పడ్డ చొట్టను చూసి తెలుసుకొనేవారు. ఇలా కంటితో పరీక్షించడం కరగబోత నైపుణ్యంలో ఒక ముఖ్యభాగంగా, ఒక కళగా తయారైంది. జనం యీ కళను అత్యుత్తమస్థాయికి చేర్చడానికి ఏండ్ల తరబడి కృషిచేసి, దానినొక సృజనాత్మకశక్తిగా పెంపొందించారు. అయితే ఇప్పుడీ కళ నిరర్థక మనిపించింది. అందంగా, ఆవుదూడ కళ్ళతో తిరిగే ఆ వాల్యా పరీక్షచేసే లాబొరేటరీ నుంచి వచ్చేది; శాంపిల్ ఉక్కుముక్కను ఒకటి తీసుకొని, చక్కగా యిస్త్రీచేసిన దుస్తుల జేబులోవేసుకొని, వొాలో డ్యాషమిలోవ్‌కు రహస్యంగా ఒకచిరునవ్వు విసిరేసి, టక్కు

టెక్నీషియన్ల బాధ్యతను చేసుకుంటూ వెళ్ళిపోయేది. ఇంకొం చెం సేపటికి తిరిగి కార్ఖానాలోకివచ్చి ఆ ఉక్కును పరీక్షిం చిన రిపోర్టును అందించేది.

మొట్టమొదటిసారి కాజిమోవ్‌కు ఆమె రిపోర్టును ఇచ్చి నప్పుడు ప్రక్కనవున్న ఇనప పడకకుర్చీలోకి అశ్రద్ధగా విసి రేశాడు; దానివంక కన్నెత్తి అయినా చూడలేదు. ఏవగిం పుగా వాల్యా తన నరాలను ఒక్కసారి వూపింది; పెదిమె లను గట్టిగా మూసి మూతి విరుచుకుంది.

"పాంతెలీ పెత్రోవిచ్ కంటితోచూచే సరిగ్గా నిర్ధా రణ చేయగలడు," అని వొలోద్యా షుమిలోవ్ వివరిం చాడు. అనుకోకుండా చేస్తున్నట్టు ఆ రిపోర్టు కాగితాన్ని తానే తీసికొని, ఆ అంకెలకేసి ఒకసారి చూశాడు. ఈ ముసలి కరగబోత పనివాడు ఆ విధంగా ఎబ్బెట్టుగా ప్రవర్తించడాన్ని క్షమించవలసిందిగా అతనికళ్ళూ, చిరునవ్వూ అర్థించాయి.

"మరి మీ ఉక్కులో శాతం ఎంత ?" అని వాల్యా కాజిమోవ్‌ను ధిక్కరించి సవాలుచేస్తున్న చూపులతో ప్రశ్నించింది.

షుమిలోవ్‌కు ఆ లేబరేటరీతోవున్న సంబంధం పరీక్ష వివరణ రిపోర్టులకోసమేగాక ఇంకా ఇతర సంబంధాలున్నా యని కాజిమోవ్ ఇదివరకే గ్రహించాడు.

కాజిమోవ్ నమూనా ముక్కను తీసుకున్నాడు. బూగరగా, పెద్దబుడుపులతో మెరుస్తున్న దాని ఉపరిభాగాన్ని పరిశీలించాడు. పెద్దసుత్తిదెబ్బకు పడ్డ ముద్రను వ్రేళ్ళతో

తాకిచూశాడు; చివరకు కొంతసేపు ఆలోచించి ఏదో ఒక అంకె చెప్పాడు.

ఆశ్చర్యంతో వాల్యా నోరు తెరుచుకుంది. తాను తెచ్చిన పరీక్ష రిపోర్టుతో అతను చెప్పిన అంకె సరిగ్గా సరిపోయింది. అయితే యిది జరిగిన తర్వాత కాజిమోవ్ మళ్లా ఆ రిపోర్టులను త్రోసిపుచ్చలేదు. ఇక వాల్యా అతన్ని ఒక ఇంద్రజాలికుడిగానే భావించసాగింది. ఇద్దరి కృషిలోని సామర్థ్యాలకు మధ్య అలా అత్యుత్తమంగా ఐక్యతా, పరస్పరం గుర్తింపు కలగడం పొలోద్యా షుమిలోవ్‌కు చాలా సంతోషమైంది.

ఆనాడుకూడ కాజిమోవ్ పని ఫలితాలేమీ అంత బాగాలేవు. కాని నిన్నటికంటె యీరోజు అతను ఆ కార్ఖానా యొక్క ప్రమాణానికి దగ్గరపడ్డాడు. ఇది బహు చిన్నవిజయమే. అయినా పాతరోజుల్లో అత్యంత వేగంగా ఉక్కును కరగబోయడంలో అతను స్థాపించిన రికార్డులకంటె ఇది హెచ్చుఆనందాన్నిచ్చింది. తను ముందుకే సాగిపోతూన్నట్టు అతనికి తెలుసు. అందుచేత తన ఆనందాన్ని యితరులనుండి దాచడానికి ప్రయత్నించాడు. మరేమీ తొందరపడకుండానే తనకు మారుగా పనిచేయడానికి వచ్చేవాడికి ఆబట్టీని వప్పగించి, అతనితో కాసేపు పిచ్చాపాటీ మాట్లాడి, అపుడుగాని స్నానాలగదులకేసి సాగిపోలేదు. అప్పటికప్పుడే నిలబడి ఇంకా తడి ఆరని మెరిసే జుట్టులోంచి తిన్నని పాపిట తీసుకుంటూ పొలోద్యా అద్దంముందు నిలబడివున్నాడు; ఇతనివంక చూస్తుంటే అందమైన యీ యువకుడే అప్పటివరకు భయం

కర ఉష్ణోగ్రతముందు నిలబడి రెండు పూర్తి షిఫ్టులకాలం పనిచేసి వచ్చాడని ఎవరూ భావించరు.

"నీవు నిన్న ఆ గమ్మత్తైన జర్మనీవాణ్ణి గురించి—తన కోతమరలను దాచాడే వాణ్ణిగురించి—చెబుతోంటే నే నేమనుకున్నానో తెలుసా? పాంతెలీ మామా" అని కణతల మీది వెంట్రుకలను వెనక్కు దువ్వుకుంటూ అడిగాడు వొలోద్యా. "యుద్ధానికిముందు లెనిన్‌గ్రాడ్ నుంచి ఒక పేరుపొందిన కరగబోత కార్మికుడు నిన్ను కలవడానికివచ్చిన రోజును జ్ఞాపకం చేసుకొన్నాను. మీరిద్దరిలో ఎవరూ ఒకర్ని ఒకరు అందుకోలేకపోయారు: అతనో లేక నీవో ఒక అడుగు ముందుకు వుండేవారు. నీపద్ధతులను ప్రయోగించి చూపేందుకు నీవు అతన్ని బట్టీదగ్గరకు తీసుకుపోయినపుడు మేమంతా ఆశ్చర్యంతో నిశ్చేష్టులమై పోయాము. ఏమిటీ నీవుచేసేపని-మేమనుకునేవాళ్ళం—నీ రహస్యాలను ఇంకొకరితో ఎలా పంచుకుంటున్నావు? ... సరేగాని, ఇక్కడ టెక్నికల్ స్కూల్‌లో బోధించే ఇంజనీయరు వున్నాడే—ఆయనపేరు ఫోకిన్—ఆయన తన మొదటి లెక్చరులోనే ఓంప్రథమంగా సృజనాత్మకమైన పద్ధతులు అవలంబించినవారు మీరిద్దరే నని చెప్పాడు.

"నీవు టెక్నికల్ స్కూలుకు వెళుతున్నావా?"

"ఆఁ, వెళుతున్నామరి. ఈ సంవత్సరమే నా డిగ్రీ తీసుకుంటాను. స్కూలుగూడ యీ కర్మాగారం దగ్గరే పెట్టారు. మా కాంసోమాల్ షిఫ్ట్‌లో పనిచేసే కార్మికులం

దరూ హాజరవుతున్నారు. స్త్యెప్కా కొరెష్కోవ్ ఒక్కడే తప్పించు కుందామని చూశాడు—తనకు పెళ్లి అయిందనీ, చదవడా నికి టైంలేదనీ అన్నాడు. కాని యిప్పుడతనుగూడ చేరాడు. వాడి భార్య ఒకటే పోరుపెట్టిందట: "మగవాళ్ళంతా చదువు కుంటున్నారుగాని నా ఖర్మే కాలింది యీ చదువురాని మొద్దుతో!" అని.

కాజిమోవ్ ఆ సాయంత్రంగూడ మసకమసకగావున్న బజార్ల వెంటబడి తిరిగాడు. శీతాకాలం ఆరంభించిందేమో ఆనాటి రాత్రి మంచుతో అద్దంలావుంది. ఆకాశాన నక్షత్రా లన్నీ ఒక్కసారిగా బయటపడ్డట్టు కనిపించాయి. అనేకంగా వున్న ఆ చుక్కల మెరుపులు చూస్తే కర్మాగారపు చిమ్నీల నుంచి ఎగచిమ్మే నిప్పురవ్వలలాగ కనిపించాయి. ప్రతిఫలించే మంటలతో నింగి అంతా నిండుఎరుపుగా తయారయింది. ఆ ప్రశాంతసమయంలో వీచే పరిశుభ్ర పవనాలు ఊపిరిపీల్చ డాన్నీ, ఆలోచించడాన్నీ గూడ సులువుచేస్తున్నాయి.

"సరే, నేను వెనకబడ్డానే అనుకుందాం. అయితే అంత మాత్రాన ఏమయిందేమిటి? వెనకబడ్డానంటే ఇన్నేండ్ల పాటూ సోమరిజీవితం గడిపినందువల్ల కాదుగదా; లేక ఏదో వాగుబడ్డున చేపలుపడుతూ కాలం వెళ్ళబుచ్చి నందువల్ల కూడ కాదు. వొలోద్యా వంటివాళ్ళు యీ మిల్లులో అలా ఉన్నతి నందుకొన్నందుకు; పరిశ్రమనే యీ ఉన్నతస్థాయికి పెంచినందుకు నేను సంతోషించాలి. ఏది ఏమయినా నేనిప్పుడు పనిచేస్తున్నట్టు చేసుకుపోవడం మాత్రం సిగ్గు

చేటు—కాళ్ళు నిలబడడంలేదు; చేతులు వణుకుతున్నాయి. కాని ఆదేసమయంలో సంతోషించాలిగూడ—నిజంగానే సంతోషపడాలి—ఎందుకంటే నేను పనిచేసిన పాతమిల్లు ఊరల్ స్పర్వ్యాతాల్లో నిజంగానే వ్రేళ్ళూనుకుంది: దాని బదులు యిక్కడ ఒక కొత్త కర్మాగారం అన్ని చిమ్నీలనుంచి పొగలు చిమ్ముకుంటూ పూర్తిగా పని చేస్తోంది.

"ఓహో! ఇదేదో కొత్త బజారులాగుంది. దీన్ని నే నెప్పుడూ చూడలేదే! పెద్దపెద్ద భవంతులూ—కొన్నింటిలో దీపాలుగూడ వెలుగుతున్నాయి; కొన్ని యింకా చీకటిలోనే మునిగివున్నాయి. ఆఁ! ఒక్కక్షణం. ఏమిటిది? ఏమిటీ!! పూర్వం ష్లికావ్ కుటుంబంవుండే పేటలావుందే! బాపురే! ఎంత మారిపోయింది? గ్లాదియాకూడ పూర్వం తన చిన్న ఇల్లు ఎక్కడవుండేదో గుర్తుపట్టలేదుగదా! పాపం, ఆవిడ ఎంత కష్టపడాల్సి వస్తోందో! ఒకసారి సుఖమయ జీవితాన్ని, సంపదను అనుభవించిన తర్వాత ఆ చిన్నగదిలో నివసిస్తూ, ఆ పిల్లవాడిని సాకుతూ, రోజంతా లారీ నడుపుతూ జీవించడం ఎంత కష్టం? అదేం తేలిక విషయం కాదు.

"చాలా కష్టం, అయితేనేం? పన్నెత్తి పలకదు. ఆవిడ లారీ రేడియేటరుమీద కట్టుకోనేందుకు వీలుగా ఆమెకు ఒక ఎర్రజండాకూడా బహూకరించారు. బాగుంది. అయితే పూర్వమో? ఎవరికో మరొకరికి ఇంటావిడ, అందగత్తె— అంతే. ఆవిడ చాలామంచిదీ, తెలివితేటలు గలదీను. అదిగో, అక్కడే పాఠం నేర్చుకోవాలి నీవు, కామ్రేడ్ సీనియర్

లెఫ్టినెంట్ ! అవును నేర్చుకోవలసిందే. నీవు మొదలెట్టిన మొదటిదాడి విఫలమయినపుడు కాలికి బుద్ధిచెప్పడం తప్ప అని నేర్చుకోవాలి; నీ టాంకుకు స్పీడు ఎక్కించి పెద్దపెద్ద అంగలతో పరుగులుపెట్టే ఆ వొలోద్యాను కలుసుకోవడం తప్పకుండా నేర్చుకోవాలి. వొలోద్యా ? ఓరి వీడి తాడు తెగ!'' ఇలాంటి ఎడతెగని ఆలోచనలతో బజార్ల వెంట తిరగసాగాడు కాజిమోవ్.

తిరిగి తిరిగి చివరకు ఒకషాపులో ప్రవేశించాడు. రక రకాల తిండివస్తువులు, పచారీవస్తువులు కొనుక్కొని ఇంటికి చేరాడు. లోపల క్లావ్దియా బాగ ఇస్త్రీచేసిన ఫ్రాక్ ఒకటి తొడిగి, టేబిలుముందు ఏదో కుట్టుకుంటూ కూర్చుంది. కాజి మోవ్ లోపల అడుగిడడం తలెత్తి చూసింది. అతనిచేతుల్లో బంగీలు ఆమెకళ్ళను మెరపించాయి. అయినా చేతిలోనున్న గుడ్డముక్క అంచును బొటనవ్రేలిగోటితో సరిచేస్తూ ఏమీ గమనించనట్లు నటించింది.

“మీరు లేనపుడు ఎవరో మీకోసం వచ్చివెళ్ళారు. మీకు ఇమ్మనమని ఒక పార్సిలు వదలిపోయాను. అతనెవరో గాని ఎర్రటిముఖం—బండిఅంత మనిషి.''

“పేరుపొందిన కరగబోతపనివాడు వొలోద్యా షుమిలోవ్ నీకు తప్పకుండా తెలిసివుండాలి. అతనిఫొటో ఒకటి ఊరేగింపులో ఊరేగించారుకూడ.'' అని స్లావ్కా తన చదువులో మునిగివున్నవాడల్లా భయపడి అందుకున్నాడు. మళ్ళీ అంతలోనే; “ఏమూ, తొమ్మిదీ కలిపితే పదహారేనా?'' అని అడిగాడు.

షుమిలోవ్ ఇచ్చివెళ్ళిన పార్సెలులో టెక్నికల్ స్కూలులో ఇంజనీయరు పోకిన్ ఉక్కును కరగబోయడం గురించి, యిచ్చిన ఉపన్యాసం ప్రతి ఒకటి వుంది. అందులో పీఠికలో ఒకభాగం జాగ్రత్తగా ఎర్రపెన్సలుతో గుర్తు పెట్ట బడి వుంది: "మన కర్మాగారంలో అత్యంతవేగంగా ఉక్కును కరగబొయ్యడంలో పాంతెలీకాజిమోవ్ తదితర ఆరంభ కులు సాధించింది నేటి విజయాలతో పోల్చడానికి వీలులేదు. కాని వారికాలంలో మాత్రం పరిశ్రమలో ఉన్నత విజయాలు సాధించడానికి అనేకవందలమంది కార్మికులను ప్రోత్సహించి, వారిలో చొరవను ఉత్తేజపరచి, ఉత్పత్తిలో బహుళంగా అభివృద్ధి సాధించడానికీ మార్గాన్ని సుగమం చేశారు. ఇక యిప్పుడు ఆచరణాత్మకంగా ఉక్కును కరిగించడాన్ని అధ్య యనంచేసే సమయంలో యీ ఆరంభకులను—మనందరి మార్గాన్ని దీప్తివంతం చేసినవారిని—మన మందరం ఉచిత రీతిని గౌరవించాలి" అని వుంది.

వోలోద్యా అంత సానుభూతితో గుర్తుపెట్టిన భాగా లను కాజిమోవ్ మళ్ళీమళ్ళీ చదువుకున్నాడు; అతని కళ్ళు కృతజ్ఞతతో చెమ్మగిల్లాయి. ఆగదీ, గదిలోని ప్రతివస్తువు: గొట్టంలో చుట్టబెట్టబడిన ఆ రిపోర్టు కాగితాలు, తనవైపుకు పెట్టి స్లావ్కా గుండ్రని ముఖం, దీపపుబల్బు, ఆ గదికి గది అంతా వివరం కోల్పోయి అన్ని వస్తువులూ ఏదో బూాగ రలో కలిసిపోయినట్టు కనబడ్డాయి.

ఈ వెచ్చని మబ్బును చీల్చుకొని భయంగా స్లావ్కా గొంతువినబడింది: "పాంతెలీ పెత్రోవిచ్, ఏమిటి సంగతి?"

"సంగతా? నా సంగతా? ఏంలేదు. ఏమీలేదులే" అని కాజిమోవ్ గజిబిజిపడుతూ సమాధానం చెప్పాడు.

చదువుతూన్న ఉపన్యాసపత్రాలను చిందరవందరగా చిమ్ముకుంటూలేచి గోడమీద తనూ, స్లావ్కా తండ్రీ, మరొక ఇద్దరు ఆరంభకులు ఆ ఆనందమయ దినాన తీయించుకొన్న ఫొటోముందు నిలబడ్డాడు.

"వీరే మార్గాన్ని దీప్తివంతం జేసింది" అని ఆ ఇంజనీరు వ్రాశాడు. అవును నిజమే. వారు యీమార్గాన్ని దీప్తివంతమూ చేశారు; సుగమమూ చేశారు. కాని యీనాడు కాజిమోవ్‌గాని అతని స్నేహితులుగాని కలలోనైనా ఊహించలేనంత దూరం ఆమార్గాన్నే వీరంతా ఎంతో దూరం సాగిపోయారు. ఎంతకాలం గడచిపోయిందో, ఇప్పుడు వాళ్ళను అందుకతీరాలి.

"పాంతెలీ పెత్రోవిచ్, పదిహేనులో ఎనిమిదిపోతే ఏడేనా మిగిలేది?" అని లెక్కల్లో మునిగివున్న స్లావ్కా మళ్ళీ అడిగాడు.

"స్లావ్కా, నన్నిపు డేమీ అడుగవద్దు. నా కిప్పుడేమీ తెలియడంలేదు. త్వరలోనే నీ క్రిందవిద్యార్థిగా, చేరతానేమో బహుశా" అని కాజిమోవ్ సమాధానం చెప్పాడు. పిల్లవాడు గందరగోళ పడ్డాడు—కాజిమోవ్ నిజంగా అంటున్నాడా లేక ఉత్తిత్తినేనా అని.

కాజిమోవ్ ముఖంమీద ఒక చిరునవ్వు వెలిసింది. ఈ పల్చటి, మచ్చలున్న తన అతిథి ముఖంలో చిరునవ్వు

చూడడం క్లావ్దియాకు అదే ప్రథమం. అతని కళ్ళల్లో ఆందోళన పూర్తిగా అంతర్థానం కానిమాట నిజమేగాని, అయినా అది కనుగొనల్లోకి మాత్రం జీరగిపోయింది; ఏది ఏమయినా అది చిరునవ్వే.

కారణం లేకుండానే క్లావ్దియాకు ఒక వింత సంఘటన జ్ఞాపకానికి వచ్చింది. తమ గారేజి ముందున్న చచ్చిపోయే ముసలి చెట్టుమీద పచ్చటి రెమ్మ ఒకటి హఠాత్తుగా ఒక వసంతోదయాన కనిపించింది. అందరూ ఎంతో ఆప్యాయంగా దాని పెరుగుదలను కనిపెట్టసాగారు. ఆ చెట్టుకు పునర్జన్మ జరుగుతున్నందుకు సంతోషించారు.

కాని కాజిమోవ్ మొహంమీదనుంచి ఆ చిరునవ్వు అంతలోనే అంతమయింది. అతని పెదిమలు కరుచుకున్నాయి; గోటితో గీచినట్టున్న అర్ధచంద్రాకారపు గీతలు రెండు అతని చెంపలమీద వెలిశాయి.

# 9

ఆ రాత్రి నడిరేయిని క్లావ్దియా మేల్కొన్నది. దీపం యింకా వెలుగుతూనే వుందిగాని బల్బుమీద కప్పిన పేపరు కాగితంవల్ల ఒక గుడ్డివెలుగు మాత్రమే టేబిల్ మీద పడు తోంది; మిగతా గది అంతా చీకటిమయంగానే వుంది. ఉపన్యాస పత్రాలు చదవడంలో నిమగ్నమైన కాజిమోవ్ ఇంకా కూర్చునేవున్నాడు. మధ్యమధ్యలో తన గుండ్రటి దృఢమైన నుదుటిని రుద్దుకుంటున్నాడు. సంతృప్తిగా సకిలిం చాడు. కుర్చీలో వెనక్కు సాగిలపడి కూర్చుని టేబిలుమీద వ్రేళ్ళతో సాలోచనాపూర్వకంగా దరువు వేస్తున్నాడు. లేక ఏదో మనన చేస్తున్నట్లుగా గొణుక్కుంటున్నాడు. అంతలోనే హఠాత్తుగా తనముందున్న ప్రతి వస్తువునూ ప్రక్కకుతోసేసి స్లావ్యా నోటుబుక్ ఒకటి తీసుకొని అందులో వ్రాసుకోసాగాడు.

అరకన్ను చూపుతోనే క్లావ్దియా అతన్ని పరికించింది అంత గాఢంగా పనిలో మునిగి వుండిపోయి గొలుసుకట్టుగా సిగరెట్లు కాల్చి గది అంతా పొగమయం చేయనందుకు ఆమె సంతోషించింది.

ఆనాటినుండి కాజిమోవ్ తన షిఫ్టు పూర్తికావడం తోటే పెందలకడ ఇంటికి వస్తున్నాడు. త్వరగా భోజనం ముగించేసి, టేబిల్ మీద అంతా శుభ్రంచేసి, కలం-సిరాబుడ్డి ముందు పెట్టుకొని హుషారుగా అనేవాడు:

"ఏమోయ్, స్వ్యాటోస్లావ్! ఇక మనం హోంవర్కు చేసుకుందాం."

టేబిలుముందు ఇద్దరు ఒకరికెదురుగా మరొకరునూ కూర్చునేవారు. స్లావ్కా తన వాచకం, లెక్కలు తీసుకుంటే కాజిమోవ్ ఉక్కును కరిగించే విషయంమీద ఉపన్యాస పత్రాలను బయటకు లాగేవాడు. ఇలా కలిసి చదువుకోడాన్ని స్లావ్కా నిజంగానే పట్టించుకున్నాడు. ఏరోజునైనా తనకు క్లాసులో మంచిమార్కులువస్తే ఆ విషయం కాజిమోవ్‌కు నివేదించేవాడు; అలాగే కాజిమోవ్‌కు వచ్చిన మార్కులు కూడ తెలిసికొనగోరేవాడు. కాజిమోవ్ కూడ ఆ పిల్లవాడి గుండ్రటిగుండును నిమిరి అనేవాడు:

"నాకింకా ఏమీమార్కులు ఇవ్వడం లేదోయ్, స్లావ్కా! అప్పుడేనా? ఇంకామార్కులు సంపాదించేస్థితికి రాలేదునేను. సరే, మనం మొదలెడదామా?"

ఇప్పుడు కాజిమోవ్ ప్రతినిత్యం చదువుకుంటున్నాడు. ఛీఫ్ ఇంజనీయరు వ్రాసిన పీఠిక అతని కుతూహలాన్ని, ఊహను గట్టిగా పట్టుకుంది; సరిగ్గా యీ ఉపన్యాసాలే తన కవసరమైనట్టివని హఠాత్తుగా గ్రహించగలిగాడు. ఒకసారి "బట్టీని నింపి తయారుచేయడం" అనే అధ్యాయం దగ్గరకు వచ్చేసరికి

అతనికి అనేక రసాయనసూత్రాలు అడ్డుతగిలాయి. దానితో ఆగిపోయి ఆలోచనలో పడ్డాడు. ఇలాంటి ఉపన్యాసమే ఒక ఇంజనీయరువంటి వాడి దృష్టికి ఆనుతుంది. హఠాత్తుగా పెల్లుబికి వచ్చే సత్తువతో ఒక నిశ్చయానికి వచ్చాడు: ఈ మొత్తం కోర్సునంతా పూర్తిచేయాలి—అందుకు ఎంత శ్రమపడవలసివచ్చినాసరే; అదీ మరొకరి సహాయంలేకుండా ఒంటరిగానే నెరవేర్చుకోవాలి.

ఆ ఉపన్యాసంలోవున్న ప్రతి అంశాన్నీ అతను గ్రహించలేకపోయాడు. చిట్టచివరకు కొన్నివిషయాలను గురించి షుమిలోవ్‌ను అడగవలసి వచ్చింది; మరికొన్నిటి కోసం క్లబ్బులోవున్న టెక్నికల్ సహోద్యోగులను సంప్రదించాడు; ఇంకొన్నింటికోసం ప్రత్యేక పత్రికలను తిరగవేశాడు.

కార్ఖానాలో మొదట తనక్రింద పని చేయడానికి నియమించబడ్డ అసిస్టెంటు యింకా డ్యూటీలో చేరలేదు. అతని స్థానంలో షుమిలోవ్ రోజూ రెండు షిఫ్టులూ పనిచేస్తూనే వున్నాడు. ఫోకిన్ యిచ్చిన ఉపన్యాసాలలో వర్ణించిన "అనుభవంపొందిన విజ్ఞానితో కలిసి పనిచేయడంతో కాజిమోవ్ తాను కొత్తగా సంపాదించిన విజ్ఞానాన్ని ఆచరణలో సాధించగలుగుతున్నాడు.

షుమిలోవ్ బట్టీవద్ద పనిచేస్తుండగా తను కార్ఖానాలోకి రావడం కాజిమోవ్‌కు యిపుడేమీ సిగ్గనిపించడంలేదు. ఆ యువకుడు తెలివిగా, ఖచ్చితంగా పనిచేయడం, బట్టీని

నింపడానికి తయారుచేయడం, నింపేపనిని యితరపనివాళ్ళకు పంచియివ్వడం, కరగబోతపనిని కొనసాగించడం ప్రాథమికంగా జరిగే తుప్పు దులపడానికి, కరగిన ఉక్కు బైటకు రావడానికి మధ్య పట్టేకాలాన్ని సరిచూడటం—ఈ పని అంతా కాజిమోవ్ చాల శ్రద్ధగా గమనించాడు. ఇదంతా పరిశీలనగా చూచినమీదట రెండోషిఫ్టులో షుమిలోవ్‌ను తన అసిస్టెంటుగా పెట్టుకొని అతని పరిశీలనప్రకారం పనిచేసేవాడు. ఇపుడిక బట్టీని నింపేసమయంలో ధైర్యంగా వేడిమిని అత్యున్నతస్థాయికి పెంచగలుగుతున్నాడు. కాని కరగబోసే సమయంలో మాత్రం షుమిలోవ్ యెంతో ఆత్మవిశ్వాసంతోను, గుండెనిబ్బరంతోను చేసినట్టుగా చేస్తే బట్టీలోపలి ఉపరిభాగపు ఆర్చీలు మాడిపోతాయేమోనని భయపడుతున్నాడు. మొట్టమొదటిసారి బట్టీదగ్గర తను పొందిన అపజయంవల్ల కలిగిన యీ పిరికితనం కాజిమోవ్‌ను బాధించసాగింది; అప్పుడప్పుడూ చిర్రుబుర్రులాడసాగాడు.

ఖాళీసమయాల్లో ఒక్కొక్కప్పుడు జోరిన్ యీ బట్టీ దగ్గరకు వచ్చేవాడు. మామూలుగానే కాజిమోవ్‌కు ఒక సిగరెట్టు ఇచ్చి, తానొకటి ముట్టించేవాడు. వారి సంభాషణ యిలా సాగేది :

"ఏం! పాయసం ఎలా ఉడుకుతోంది?"

"కామ్రేడ్ జోరిన్–కొన్నాళ్ళు ఆగండి. త్వరలోనే పాంతెలీమామ మనందరినీ వెనకనే వదిలేస్తాడు. ఇకమనం ఆ లోకదీపంచూసి నోళ్ళు తెరుచుకోవాలి," అని షుమిలోవ్ మధ్యమధ్య సోడానీళ్ళతో దాహం తీర్చుకుంటూ అనేవాడు.

"మళ్ళా పాం తెలీ మామ! ఎందుకలా నీవు ఆయన్ని ముసలివాళ్ళకింద జమకడతావు? మామయ్యా అని పిలవడం దేనికి? అతనికి పెళ్ళికూడా చేద్దామనుకుంటున్నాను. నే నేమో పెళ్ళికూతురును చూసిపెడితే నీవేమోను మామయ్యా అని పిలుస్తున్నావు," అని పొంగివచ్చే ఉక్కు వెలుగులో కళ్ళు చిట్లించి ఎగతాళిచేసేవాడు జోరిక్. "ఈ ఎలక్షన్ పని పూర్తికానియ్. అప్పుడు చేతినిండా కావలసినంత తీరిక. ఒకేసారి మామా, అల్లుళ్ళ కిద్దరికీ పెళ్ళిచేస్తాను. ఎవరో ఒకరు ఉక్కును కరగించే యీ కొత్తతరంవాళ్ళను గురించి పట్టించుకోవాలి గదా మరి!"

కొంటెగాచూస్తున్న జోరిన్ వంక చూడలేక షుమిలోవ్ గందరగోళపడేవాడు.

"ఆఁ! ఇంకా ఏమనుకుంటున్నారు?"

"ఇదుగో, మొహమంతా ఎర్రనయింది—సిగ్గుపడకు వోయ్. రాతిగోడలోంచి చూడడంకూడా పార్టీ కార్యదర్శి పనేమరి. కాజిమోవ్ అసిస్టెంటును పంపించేశాననీ, నీచేత ఎక్కువకాలం పనిచేయిస్తున్నాననీ చెప్పి తనతో స్కేటింగుకు వెళ్ళేవారెవరు దొరకడంలేదని యిక్కడ లాబొరేటరీ అసిస్టెంటు ఒకతె సతపోరు పెడుతోంది నన్ను."

నిజంగానే అడిగిందా?" షుమిలోవ్ ముఖం విప్పారింది.

'మరి? నన్నడిగింది. నేనన్నానుగూడ: 'వాల్యా అది నాతప్పే. ఆ తప్పుకు నాదే బాధ్యత. దానికి బదులుగా

స్కేటింగు స్థలానికి నాతో రారాదు? నేను గార్డ్సుమన్ను, మూడు పతకాలను పొందిన వీరుడిని!' అయితే యేం? నేనెందుకూ పనికిరాకపోయాను. ఆమెకు కావలసింది ఒక వోలోద్యాయే."

తమ పనిలో వారిద్దరికీ విజయం చేకూరాలని ఆశీర్వదించి, మరో కొంటెపలుకు పలికి అక్కడినుంచి వెళ్ళాడు జోరిన్. తన చట్టువంవద్దకు కుంటుకుంటూపోయాడు. దారిలో కనబడినవారితో ఎకసక్కాలాడాడు; స్నేహపూర్వకంగా చేయి వూపేవాడు. జోరిన్ అమోఘమైనవ్యక్తి. అతిసాధారణంగానే ఆ కార్ఖానాలో పనిచేసేవా రందరితోను ఏమీ భేదం లేనివాడుగానే కనబడతాడు. అయినా ప్రతివారికీ అతను తమ మధ్యవుండడంవల్ల అవసర సమయాల్లో సుదృఢ స్నేహపూర్వక సహాయ సహకారాలు లభ్యమవుతాయనే జాగృతి ఏర్పడింది. జోరిన్‌తో జరిపిన అతిసంభాషణ అనంతరమూ అతనిలో అమితమై, ఉప్పొంగే ఉత్సాహాన్ని కొంత వదిలేసి వెళ్ళినట్టు కాజిమోవ్ భావించేవాడు.

వాల్యా కార్ఖానాలో అడుగుపెట్టటంతోటే తన పరిశీలనా రిపోర్టును కాజిమోవ్ చేతికిచ్చి, మరో మచ్చుతునక కోసం నిరీక్షిస్తున్నట్టువెళ్ళి అతని ఇనపకుర్చీలో కుదిరికగా, అందంగా కూర్చునేది. కాని అంతలోనే తిరిగి అర్థవంతంగా షుమిలోవ్ వంక చూచేది. అతనుగూడ ఏదో పరాకును చిత్తగిస్తున్నట్టుగా, అతిక్లిష్టమయిన కార్యసాధనలో నిమగ్నమైనట్టుగా నటించుతూ చివరకు ఆ పిల్లదగ్గరకు చేరే

వాడు. కాజిమోవ్ చూడడం లేదని నిర్ధారణ చేసుకున్నప్పుడు వాల్యాకు దగ్గరగా వంగి ఏదో గొణిగేవాడు; ఇద్దరూ కలిసి హాస్యాలాడేవారు. అలాంటి సమయాల్లో తన పనిలో మునిగి తేలుతున్నట్టే కాజిమోవ్ నటించేవాడు. ఉడికి, పొంగులువారే ఉక్కును తదేకంగా పరీక్షించుతుండడమో, లేక ప్రక్కన మంచెలవైపుకువెళ్ళి బట్టీని నింపే పని ఎలాసాగుతూందో పరీక్షించడమో చేసేవాడు. ఈ ఇద్దరు యువతీ యువకుల మెరిసేకళ్ళు, ఎర్రబారిన చెక్కిళ్ళు చూసి మెచ్చుకోకుండా వుండలేకపోయేవాడు. వారిని చూస్తుంటేనే ఆ కార్ఖానాలోకి అప్పుడే మొగ్గలు విచ్చిన పూలమొక్క నొకదానిని తెచ్చినట్టు వుండేది. అందుకని మచ్చుతునకలో సర్గ్గా ఎంత పాటుబొగ్గువుందో కంటితో పరిశీలించగలిగే తన నైపుణ్యం ఈ షణ్మాత్రమైనా తగ్గక పోయినా, పైగా ప్రతిసారీ పరీక్షించిన రిపోర్టులు తన యీ నైపుణ్యాన్నే ధృవపరుస్తున్నా తన నమూనా ఉక్కుతునకలను లాబొరేటరీకే పంపడాన్ని ఒక నియమంగా పెట్టుకున్నాడు కాజిమోవ్. ఆ విధంగా ఆ లాబొరేటరీ అసిస్టెంట్ చాలతరచుగా తమ బట్టీవద్దకు వచ్చేఏర్పాటు కలిగించాడు.

# 10

కాజిమోవ్‌కు ఇదివరలో అసిస్టెంటుగా పనిచేసినవా డిప్పుడు తిరిగివచ్చాడు. ఈలోపల కాజిమోవ్‌కూడా కొంత దిటవుతనాన్ని సంపాదించుకొన్నాడు; అంతేగాక అప్పు డప్పుడూ యుద్ధానికి పూర్వం అతను సాధించిన ప్రమా ణాన్నికూడ అందుకోగలుగుతున్నాడు. అతను పనిచేస్తున్న దళంలో షుమిలోవ్ లేనప్పుడు ఉత్పత్తిప్రమాణం పడిపోయే మాట నిజమే; అయినా కాజిమోవ్ ఏమీ భయపడడం లేదు. కొద్దిరోజుల్లోనే తన అసిస్టెంటుతో కలిసి పనిచేయ డంలో సంపూర్ణ సహకారాన్ని పొందగలిగి, ఆ మిగిలి పోయిన తారతమ్యాన్ని త్వరలోనే పూర్తిచేయగలిగాడు.

ఉక్కును కరగబోసే వారి పోటీల కాలపరిమితులను సుద్దముక్కతో లెక్కలు వ్రాసే ఆ గుండ్రాటి పిల్లగూడ ఇప్పుడు కాజిమోవ్ పనిచేసే బట్టీ ప్రక్కన నల్లబల్లమీద అతని ఉత్పత్తిలో క్రమక్రమంగా కనబడే పెరుగుదలను మార్కుచేస్తోంది. ఒకొ్కక్కసారి అతని ఉత్పత్తిస్థాయి ఇతర బట్టీల స్థాయిని అందుకున్న రోజులుకూడ వున్నాయి. అయినా అతనింకా షుమిలోవ్ స్థాయికి చాల వెనకబడే వున్నాడు. ఈ పరిస్థితి అతన్ని చాల ఆందోళనపెట్టసాగింది.

పూర్వం తను సాధించిన నైపుణ్యాన్ని తిరిగి సంపాదించుకోడానికి అత నింకా యెంతో దూరం పోవలసివుంది. ఆనాటి తన కౌశలం యుద్ధానికి ముందు చాల మెప్పు వడసింది; అసలు ప్రతిరోజూ పనిలోకి ప్రవేశించడమే తన కొక నూతనోత్తేజాన్ని కలుగజేసేది; ఆ సమయంలో కార్ఖానాకు వెళ్ళడం ప్రేమికుల సమావేశానికి వెళ్తున్నంత ఉత్సాహంగా వుండేది. ఇదంతా కాజిమోవ్ గుర్తించాడు—సోవియట్ వైజ్ఞానిక శాస్త్రమూ, వోలోద్యా షుమిలోవ్ వంటి వారిపనీ కలసి యీ ఉక్కును కరిగించే కళలో సాధించిన అభివృద్ధిని అందుకోవడానికి తనకున్న విజ్ఞానం చాలదని గమనించాడు. అందుచేత మరింత పట్టుదలతో దీనిని పరిపక్వం చేయాలని తలపోశాడు. అంతేగాక మరొక తేలిక పద్ధతి యేదైనా అవలంబించడం తప్పు అని కూడ తోచింది. బట్టీముందు పనిచేసే సమయంలో యీ క్రొత్తదృక్పథంతో మొత్తం టెక్నలాజికల్ పద్ధతి నంతటినీ చూడసాగాడు. రాత్రిళ్ళు యింటివద్ద ఉక్కుతయారీకి సంబంధించిన రసాయన, భౌతికశాస్త్రాలు అధ్యయనం చేసేవాడు. ఎంతో చైతన్యంతో కూడుకున్న పట్టుదలతో యీ విషయాలను పఠించ బూనుకున్నాడు; అంతేగాని గతంలో లాగ తనకు యాదృచ్ఛికంగా తోచిన విధంగా చేయదలచలేదు.

రాత్రిళ్ళు స్లావ్కాతో బాటు తన హోంవర్కును చేసికొనేవాడు. దేశంలో ప్రథమశ్రేణికి చెందిన ఉక్కుకరగబోత కార్మికుల అనుభవాలను క్రోడీకరించిన ఒక లెక్చరు

కోర్సునో, లేక అభివృద్ధిగాంచిన స్టక్‌నోవైట్ పద్ధతులను విశదీకరించే పత్రికలనో పఠించేవాడు. కాని తనముందు కూర్చున్న పిల్లవాడు గనక ఆ రోజున తనకెన్ని మార్కులు వచ్చాయో తెలుపమన్నప్పుడు మాత్రం కాజిమోవ్ బొమ ముడివైచి అనేవాడు :

"బాగుండలేదు, స్లావ్కా, ఏంబాగుండలేదు. 'ఫెయిర్' కంటె మించి మార్కులు పడడంలేదు."

"మాక్లాసులో జెనుష్కిన్‌లాగ అన్నమాట" అని స్లావ్కా తన కర్థమైనట్టు తల వూపేవాడు. "వాడికికూడ 'ఫెయిర్' మాత్రమే వస్తూంటుంది. పైగా తనకది చాలు నంటాడుగూడ—ఎందుకంటే పైతరగతిలోకి వెళ్ళడానికి ఆమాత్రం చాలుగా!"

"మీ జెనుష్కా వట్టి అబద్ధాలకోరు. స్వ్యటోస్లావ్, నీవుమాత్రం వాణ్ణి నమ్మవద్దు. ఈరోజుల్లో చూశావ్, ఒక్క 'ఫెయిర్' మార్కుతోనే బండీలాగలేం. రోజులుమారాయి, మరి," అని కాజిమోవ్ నవ్వుతూ చెప్పేవాడు. "చివరికి 'గుడ్'అన్నదికూడ సరిపోదు. వెళ్ళితే ఏక్‌దమ్మున చివరంటా వెళ్ళాలిసిందే—మనకు కావలసింది 'ఎక్సలెంట్' అంత కంటె తక్కువ పనికిరాదు."

అని తన బట్టతలను ఒకసారి రుద్దుకొని, తిరిగి తన ముందున్న కాగితాలలో మునిగిపోయేవాడు.

క్లావ్దియా వీరిద్దరినీ చిరునవ్వుతో గమనిస్తూవుండేది; కాని మళ్ళీ అంతలోనే పైకి వంపుతిరిగినముక్కు గల ఆ అంద మైన ముఖంలో విషాదచ్ఛాయలు గోచరించేవి.

# 11

డ్రాయరు టేబిలుమీద అలారం గడియారం అలసట లేకుండా టిక్కు టిక్కు మంటోంది. ఫిబ్రవరి మాసపు మంచు తుపానుల హోరు సద్దుమణిగింది. పచ్చపచ్చగా, అద్దంలాగ మెరిసే ఆ ఉషఃకాలాల్లో కరిగిపోయే మంచు సన్నగా సుగంధాన్ని వెదజల్లుతోంది.

ఊరల్స్‌లో యెక్కడో పని చేస్తున్న తన పాత స్నేహితులకు మారుగా కాజిమోవ్ ఇక్కడ కొత్తస్నేహితులను సంపాదించుకొన్నాడు. వారిలో మొదటివాడు జోరిన్. అత నెప్పుడూ కళకళలాడే ముఖంతో, అత్యవసరమైన సమయాల్లో మంచి సలహాల నిస్తూ కనిపించేవాడు. కాజిమోవ్ తను తాత్కాలికంగా యెంచుకొన్న నివాసానికి అలవాటు పడ్డాడు. ఇప్పుడు కొత్తగా కడుతున్న ఒక పెద్ద భవనంలో అతని కొక భాగం కేటాయించడానికి నిశ్చయమైంది గాని అతనే తన అవసరాన్ని నొక్కిచెప్పడం లేదు. బహుశా తనకు తెలియకుండానే ఆ కొత్తచోటికి వెళ్ళడానికి యే మాత్రమైనా భయపడుతూండవచ్చునుగూడ.

కాజిమోవ్ ఆత్మపరిశోధనా కార్యక్రమానికి, అల వాటైనవాడు కాదుగాని ఇక్కడ తనతో కష్టకాలంలో స్నేహంచేసిన ష్లికావ్ కుటుంబంతో నివసించడంలోగల సుఖాన్ని మాత్రం ఎరిగేవున్నాడు. ఇప్పుడు అందులో మార్పు తీసుకురావడానికి అతనేమీ ఆదుర్దాపడడంలేదు.

ఆనాటి మబ్బులు గ్రమ్మిన ప్రొద్దుట తన సైనిక అల వాటుప్రకారం చీపురు తీసుకొని గది అంతా కసువుచిమ్మిన సమయం ఇపుడు అసలు అలా జరగనట్లేతోచింది. క్లావ్దియా గూడ చాల సామర్థ్యంగల కుటుంబీకురాలిగా రుజువుచేసు కొన్నది. కాజిమోవ్ స్లావ్కాలు తమ పనిలోనుంచి ఒకరు, బడినుండి మరొకరు ఇంటికి చేరినప్పుడు ముందుగా వసారాలో పీచుపట్టామీద కాళ్ళు తుడుచుకొని, తర్వాత అక్కడ తమకోసం సిద్ధంగాపెట్టిన చెప్పులు తొడుక్కొని మాత్రమే లోపలికి రావాలి. క్లావ్దియాగూడ తన గారేజి నుంచి రావడంతోటే ఆదరాబాదరాగ డ్రాయరులోనుంచి ఒక గౌను తీసికొని, స్నానాల గదిలోకి వెళ్ళిగాని తిరిగి వచ్చేదిగాదు; అలాంటప్పుడు తన ఉంగరాల జుత్తు తడితో మెరుస్తోంటే జారిపడకుండా ఒకపెద్దముడివేసుకొని అందంగా కనబడేది.

గదిలో బహుశా ఇప్పుడు పరిశుభ్రత కొంచెం మరీ ఎక్కువైనట్లుంది—తెల్లగా, నీడలువారుతూండే ఆ నేల మీద పొరపాటున సిగరెట్ పొడిరాలితే కాజిమోవ్ ఎంతో విధేయతతో దాన్నితుడిచి పెట్టేవాడు; అలాగే బయట

వసారాలో క్లావ్దియా కాలిచప్పుడు వినడంతోటే దాదాపు అనుకోకుండానే కాల్చిపారేసిన సిగరెట్టుపీకలనుఏరి జేబులో కుక్కేసేవాడు.

ఆ చిన్నగదిలో ఇప్పుడు అతనికి 'తనది' అనుకునే ఒకమూల దొరికింది. ఒక మంచం, మంచంప్రక్కన నిలబెట్టే టేబిలు, తన విశ్రాంతికోసం ఒక అడ్డుతెరా కొన్నాడు. టేబిలుమీద ఒక దీపం ఏర్పాటుచేసుకొన్నాడు. క్లావ్దియా అతని మంచం ముందు అందంగా రంగులువేసిన తివాచీ ఒకటి పరిచింది. కాజిమోవ్ సామాన్లలోనుంచి అతని భార్యాబిడ్డలుగల ఫొటో ఒకటి వెదకితీసి, సముద్రపు గవ్వలతో దానికి ఫ్రేముకట్టి, దానిని గోడమీద అలంకరించింది. ఈ విధంగా యుద్ధానంతరం ఇరుకైన యీ నివాసస్థలంలో కాజిమోవ్ స్వాతంత్ర్యం స్థాపించబడింది.

క్లావ్దియాకు, ఆమె అతిథికి మధ్య కరుణామయమైన చక్కటి సంబంధాలు ఏర్పడ్డాయి. వేరువేరు షిఫ్టులలో పని చేస్తూండడంవల్ల ఒకరినొకరు చాల అరుదుగా మాత్రమే కలిసేవారు; అంతకంటె అరుదుగానే సంభాషణసాగేది. కాని ప్రతిదినం ఉదయాన కాజిమోవ్ తన పనిలోకి వెళ్ళబోయే సమయాన అతని మధ్యాహ్నభోజనం చాల జాగ్రత్తగా ఒక పేపరుకాగితంలో బంగీకట్టి, అతని పెద్ద కోటుజేబులో పెట్టబడివుండడం చూచేవాడు. తిరిగి సాయంత్రం అతను ఇంటికి వచ్చేటప్పటికి టేబిల్ మీద ఒక ఉత్తరంముక్క కనిపించేది— ఆరాత్రికి భోజనం ఒకమూల గ్రౌరెతోలుకోటుతో కప్పబడి

సిద్ధంగావున్నదనీ, కాబేజీపులుసులోకి మీాగడ అవసరమైతే అది కిటికీలోవుందనో లేక పాయసంలోకి కావలసిన వెన్న ఆ బ్రొరజాడీలోగాక గుండ్రటిదాంట్లోవున్నదనో వ్రాసివుండేది. ఇక క్లావిదియా చాల చీకటితోనే వంట విషయం చూడడానికి లేచినప్పుడు తీగతో కట్లువేసిన ఒక వాటెడు పేళ్ళమోపులు పొయ్యిప్రక్కనే కనిపించేవి. గోడమీాదవ్రేలాడే ఆల్మెయిరా ఎప్పుడూ కాబేజీ, బంగళాదుంపలు, మాంసం, ఉల్లిపాయలతో నిండివుండేది. తన కార్ఖానానుంచి వస్తూనే కాజిమోవ్ చుట్టు తిరిగివెళ్ళి సమిష్టి వ్యవసాయక్షేత్రం నడుపుతున్న అక్కడి మార్కెట్టులో యీా సరుకులన్నీ కొని తెచ్చేవాడు.

శనివారపు రాత్రిళ్ళు వారిరువురూ చాల ప్రొద్దు పోయేవరకు మధ్యను ఒక "సామోవర్" పెట్టుకు కూర్చునే వారు. గదిలో వెచ్చదనంకోసమని కాజిమోవ్ యీా సామోవర్‌ను కొన్నాడు. మత్తుగా అది జుఁయ్‌మంటూంటే అతను బిగ్గరగా వార్తాపత్రిక నొక దానిని చదివేవాడు లేదా క్లావిదియా యేపత్రికలోదైనా ఒక కథ తీసికొని నిండైన గొంతుతో చదివి వినిపించేది.

వారిద్దరికీ కుతూహలమైన విషయం మరొకటుంది. ఇద్దరూ పార్టీచరిత్రను అధ్యయనం చేయ మొదలెట్టారు. ఆమెకంటె రెండు అధ్యాయాలు యెక్కువ చదివిన కాజిమోవ్ ఆవిడకు ఓర్పుతో తోడ్పడ్డాడు. ఇందులో వారిద్దరికీ మక్కువ యెక్కువే. ఆ చరిత్ర అధ్యాయాలు జరిగిపోతూంటే మరచిన గతం తిరిగి మనసకు వచ్చేది కాజి

మోవ్ కు. సాధారణంగా మౌనంగావుండే అతను మాటకారి అయేవాడు; తన జీవితంలో జరిగిన అనేక సంఘటనలను అనుభవాలను విశదం చేసేవాడు. అతను చాల చిన్నపిల్లవాడుగా నున్నపుడు లెనిన్ అంత్యక్రియలకు ఎలా వెళ్ళాడో, కర్మాగారాన్ని చూడడానికి వెళ్ళి ఓర్జొనికిడ్జెతో తానెలా మాట్లాడాడో, క్రెమ్లిన్ భవనంలో జరిగిన స్టఖనోవైట్ సమావేశంలో స్టాలిన్‌ను చూసినవిషయం—అన్నీ తెలియపరచేవాడు. ఈ విధంగా ఆ పుస్తకపఠనంతో ఉత్తేజితమైన వారి సంభాషణ ఒక్కొక్కసారి అర్ధరాత్రివరకు సాగేది. అలాంటి సమయంలో ఎవరో ఒకరు గడియారంవంక చూడడం తటస్థించి, మరునాడు పెందలకడ మేల్కొనవలసిన అవసరాన్ని జ్ఞాపకం చేసుకొనేవారు. ఆనాటి కిక సమావేశం ముగిసేది.

ఇంకా ఒక్కొక్కసారి సంభాషణ మధ్యలో కాజిమోవ్ చింతామనస్కుడయ్యేవాడు. మచ్చలుపడిన అతని కోలమొహంమీది గీతలు లోతుగా తయారయ్యేవి. ఎత్తుగా దృఢంగావున్న అతడి నుదుటిమీది చాళ్ళు కర్రలు తేలేవి. అలాంటి సమయంలో క్లావియా మాటలుగాని, హెచ్చవేతలు—భాగహారాల మాయాజాలాన్ని అర్థంచేసుకో ప్రయత్నించే స్లావ్కా వేసే ప్రశ్నపరంపరగాని వినబడేవి కావు. గది అంతటా నిశ్శబ్దం తాండవించేది. క్లావియా యేమో తెలియని ఆందోళన చెందేది. విచారంతో దుఃఖమైనా పొర్లివచ్చేది, లేదా దయార్ద్రహృదయానుభూతిత్తో

అతని బట్టతలను తన గుండెల కదుముకొని, అతని ముఖం మీాది గీతలను తుడిచివేద్దామని కోర్కె గలిగేది.

కాజిమోావ్‌కు ఆమె ఆలోచనలేవీ తెలియవు. ఆవిడను యింకా పిరికిపిరికిగానే గౌరవిస్తున్నాడు; కొంతభయం కూడ లేకపోలేదు.

సమిష్టిపాకశాలలో స్త్రీలు ఎత్తిపొడుపుగా తమను గురించి మాట్లాడినప్పుడుగాని, లేక పెండ్లి భోజనం లేకుండా పోయిందని ఇరుగుపొరుగువారు హాస్యాలాడినప్పుడుగాని కంద గడ్డలాగ అతని ముఖం ఎర్రనయ్యేది. ఈ విచిత్ర సంభాషణ క్లావ్దియా చెవిని పడుతుందేమోనని భయంతో ఆవిడ గది గుమ్మంకేసి చూచేవాడు. ఎంతో హృదయపూర్వకంగా ఆవిడస్థితికి విచారిస్తున్నాడు. ఆ విషయం అతను మరువ లేదు. క్లావ్దియా సమక్షంలో చాల ఖులాసా పొందేవాడు. వారి శనివారపు రాత్రుల తేనీటి పానీయాలనుగాని, ఆదివారాలనాటి పండుగలాగ గడచే భోజనాలనుగాని చెదర గొట్టే సంఘటన ఏదీ జరుగలేదు. కాని స్లావ్కాతోటి అతని సంబంధమే కాజిమోావ్‌ను నిజంగా పీడించసాగింది.

యుద్ధం ఆరంభమైన సంవత్సరమే ఆ పిల్లవాడు పుట్టాడు. తన తండ్రిని ఎన్నడూ ఎరుగని కారణాన అతడు కాజిమోావ్‌కు నిత్యం మరింత సన్నిహితం కాసాగాడు. మొదట్లో వారిరువురూ మంచిస్నేహితులు మాత్రమే— ఇద్దరిమధ్యను వున్నసంబంధం వ్యావహారిక సంబంధమే. కావలసినప్పుడు స్లావ్కా సంతోషంతో చెంగుచెంగున సిగ

రెట్లకోసం పరుగెత్తేవాడు—అందుకు బహుమానంగా ఇం టికి తిరిగివచ్చే సమయంలో తింటూ రావడానికి మాగడతో చేసిన రొట్టె ఒకటి సంపాదించేవాడు. ఇందుకు ప్రత్యామ్నా యంగా స్లావ్కాకు వ్రాయడం నేర్పాడు కాజిమోవ్. బాలల కెంతో సంతసాన్నిచ్చే ప్రథమ విద్యలను పాఠశాలలో నేర్చి ఇంటివద్ద వప్పజెప్పుతుంటే ఎంతో శ్రద్ధగా ఓర్పుతో వినే వాడు. చిన్నచిన్న లెక్కలను సమస్యాపూర్వకంగా ఇచ్చే నేర్పుకూడ కాజిమోవ్‌కు వుంది.

"అమ్మ బయటకు వెళుతూ వెళుతూ గిన్నెలో మనకు 8 బంగాళదుంపలు వదిలిపోయింది. అందులో 5 స్లావ్కా మింగేశాడు. ఇంకా నాకెన్ని మిగిలివున్నాయ్?"

"ఇవ్వాళ బడిలో స్లావ్కాకు ఒక 'గుడ్', రెండు 'ఫెయిర్'లు వచ్చాయి. అయితే ప్రశ్న ఏమిటంటే వాడు గనక సమయానికి మేల్కొని, యింకా బాగా చదవకపోతే వాడికి వారానికెన్ని 'గుడ్'లు, 'ఫెయిర్'లు వస్తాయి?"

ఇలాంటి సమస్యలంటే స్లావ్కాకు ఎంతో సంతోషం. గంటల తరబడి అలాంటి సమస్యలు పూరించడంలో మునిగి పోయేవాడు.

కాని ఒకనాడు స్లావ్కాకు అతని తండ్రైన ష్లికావ్‌ను గురించీ, అతనెంత పేరుగాంచిన ఉక్కుపనివాడో తెలియ జెప్పినప్పుడు యీ సంబంధం మరొకరకంగా మారింది. మరు నాడు కొంచెం సిగ్గుపడుతూనే ఆ పిల్లవాడు తనతండ్రి యుద్ధంలో ఎలా పోరాడాడో చెప్పమని కాజిమోవ్‌ను అడి

గాడు. ష్లికావ్‌తో బాటే యుద్ధంలో చేరి, స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం ఆరంభమయ్యేవరకు అదే టాంకుదళంలో పనిజేసిన కాజిమోవ్ తనకు అతని తండ్రినిగురించి జ్ఞాపకమున్నదంతా కథలాగ గుచ్చిచెప్పాడు. స్లావ్కా-గూడ అతని ముఖం మీదనే దృష్టిని కేంద్రీకరించి తదేకధ్యానంగా విన్నాడు. ఆనాటినుండి కాజిమోవ్ గదిలో ప్రవేశించినదాది ఆ పిల్ల వాడి గుండ్రటి కళ్ళల్లో కానవచ్చే అభ్యర్థన దృక్కు-లే ఎదురయ్యేవి. వారివారి పాఠాలు పూర్తిచేసుకొన్న తర్వాత యీ పిల్లవాడు, వయసుపెరిగిన పెద్దవాడు కలిసి కార్పొరల్ ష్లికోవ్ యొక్క- అపూర్వ సాహసకృత్యాలమీద సుదీర్ఘ సంభాషణను సాగించేవారు. ష్లికావ్ జీవిత విశేషాలన్నీ కూర్చి చెప్పడానికి ఒకవారం సరిపోయింది. చివరకు ఆ కథల నిలవలన్నీ కరిగిపోయాయి. అయినా పచ్చగామెరిసే ఆబాల నేత్రాల్లో అతని తండ్రి జీవిత సంఘటనల గాథల కోసం ప్రగాఢమైన అభ్యర్థనద్యోతకమైంది. స్లావ్కా- కళ్ళ ల్లోకి చూచినప్పుడు కాజిమోవ్‌కు తన పుత్రుడు స్ఫురణకు వచ్చేవాడు. అందువల్ల యీ పిల్లవాడి అభ్యర్థనను నిరాక రించలేక పోయాడు. కాని కథలు అల్లిచెప్పడం ఎలాగో కాజిమోవ్‌కు తెలియదు. అందుకని యుద్ధకాలంలో సంభ వించిన తనజీవిత సంఘటనలనే ఏకరువుపెట్టాడు. చిట్టచివరకు అవికూడ హరించిపోయినప్పుడు తేలికైన మార్గం ఒకటి చేపట్టాడు—తనకు జ్ఞాపకమున్న తనతోటి సైనికస్నేహి తుల సాహస కృత్యాలన్నీ గుచ్చి ష్లికావ్ పేర జమకట్టాడు. అయినా స్లావ్కా- దాహంతీరేదికాదు. గడియారం తొమ్మిది

గంటలు చూపినప్పుడు ఇక క్లాదియా అతన్ని బలవంతాన విడదీసి, పడుకోబెట్టేది.

ఇప్పుడు కాజిమోవ్ లేకుండా స్లావ్కాకు ఒక్క-క్షణం గడవదు. ఎప్పుడైనా తన కర్మాగారంలో పని తొందరవల్ల కాజిమోవ్‌కు ఆలస్యమైననాడు ఆ ఊక్కుమిల్లు సింహద్వారం ముందు ఉన్నిటోపీపెట్టుకొని, మంచులో కప్పబడిన ఒక చిన్న ఆకారం అతని కంటబడేది. స్లావ్కా అంటే కాజిమోవ్‌లో ప్రేమాదరాలు దినదినప్రవర్థమాన మయ్యాయి. ఇది తలచుకొని అతడు ఆందోళన చెందాడు. కాజిమోవ్ హృదయంలో యుద్ధఫలితంగా ఏర్పడిన శూన్యప్రదేశంలో స్లావ్కా సంపూర్ణంగా తిష్టవేశాడు. మరి ఇపుడు అతనితో సంబంధాలు తెగ్రతెంపులు చేసుకొనేదెలాగ?

# 12

ప్రతి ఆదివారం ఉదయాన ఇద్దరు కలిసి స్నానాలకు వెళ్ళి, అక్కడనుంచి సినిమాకో లేక సర్కసుకో వెళ్ళేవారు. మధ్య విశ్రాంతి సమయంలో కేక్ లుతిని, నిమ్మపానీయం త్రాగి తీరికగా ప్రతిసారీ వేరొకమార్గాన ఇంటికి బయలుదేరి వెళ్ళేవారు. యుద్ధక్షతినుంచి తమనగరం ఎలా తేరుకుంటు న్నదో గమనిస్తూపోయేవారు. మధ్యమార్గంలో ఆగి అక్కడ జరిగే భవన నిర్మాణకృషినిగాని, క్రొత్తగా ట్రాములైన్లు వేయడాన్నిగాని చూసేవారు. పెద్దపెద్దభవంతులకోసం నిర్మిత మయ్యే ఎత్తాటిగోడలమీద నిలబడి పనిచేసేకార్మికుల కాళ్ల దగ్గరకు ఆటవస్తువులంత సుళువుగా పెద్దపెద్ద తొట్టెలలో రాళ్ళు నింపుకొని తీసుకువచ్చే క్రేన్ల రాక్షసి హస్తాలను తిలకించడం ఆ వయసుముదిరిన వాడికీ, యీ చిన్నకుర్ర వాడికీకూడ ఆహ్లాదాన్నిచ్చేది. ఇళ్ళు కడుతున్న స్థలాలకు ఇటుకలు, కొండరాళ్లు తదితర సామాగ్రి మోసుకువెళ్ళే బరువైన లారీల వరుసలను చూసేవారు; విరామంలేకుండా తమ పళ్ళతో మంచులో బిగిసిన నేలను త్రవ్విపోసే యాంత్రిక తవగోళ్ళను చూసేవారు. తామెన్నడూ ఎరుగని ఏదో ఒక

బజారులో నిలబడిచూస్తూ అక్కడ కడుతున్న ఇళ్లు తమ కోసమే నన్నంత సంతోషం పొందేవారు.

అరుదుగానే అయినా కావాలనే కాజిమోవ్ "ఉదార్నికి" పేటకు దారితీసేవాడు. ఇక్కడే యుద్ధానికిపూర్వం తన కుటుంబంతో ఒక చక్కటి చిన్న కొయ్యయింట్లో ఒక భాగంలో వుంటూండేవాడు. ఉదార్నికి పేట అని యిప్పుడనడం వట్టి పేరుకుమాత్రమే. ఎందుకంటే యిప్పుడక్కడ "పేట" అని పిలవడానికి యేమీ మిగలలేదు. వెనక్కుమళ్ళి పరుగులుతీసే ఫాసిస్టులు దానిని అంతా తగలబెట్టేశారు. మొట్టమొదట్లో రైలుగేటుకు పైగా చూపు సారించి చూసినపుడు పూర్వంలాగ దడులుగట్టి శుభ్రమైన పెరటితోటల మధ్య అందంగా కనబడే చిన్నిచిన్ని యిళ్ళకుబదులు ఇప్పుడు నిర్మాణం జరుగుతున్న రెండు పెద్దరాతి భవంతుల వరుసలు కనబడడం అతని మనస్సును చివుక్కుమనిపించింది.

ఇంత బ్రహ్మాండమైన భవనాలలో యెక్కడో ఒక చిన్న చోటున—ఎక్కడో మాత్రం తెలియరావడంలేదు; అతనెరిగివున్న గుర్తులన్నీ మాసిపోయాయి—పూర్వం కాజిమోవ్ నివసించిన యిల్లువుండేది. దాని ముందున్న చిన్న తోటలో తన చేతుల్తో నాటి, నీరుపోసి పెంచిన లేత చెట్లు వుండేవి; అక్కడవుండే పూలమొక్కలమధ్య సాయం సమయాన తన భార్య వాటికి పాదులుపెట్టడం, కలుపు తీయడంలో నిమగ్నమై వుండేది. ఇలాంటి పూర్వస్మృతులు యెన్నో చీకటిమాటున దాగిన దృశ్యాలు కాజిమోవ్ స్ఫుర

ణకు రానాగాయి. అతని భార్యాపుత్రులు తనకు తెలియని పరాయిపట్టణంలో, యెక్కడో ఊరల్స్ పర్వతప్రాంతంలో భూస్థాపితమైవున్నా అతనికి యీ భవంతులలో యేదోఒకటి తన ఆత్మీయుల సమాధిపై నిర్మింపబడినట్టు తోచింది. ఇలాంటి దుఃఖకరమైన ఆలోచనలు అతనిని ఎంతో విచార గ్రస్తుణ్ణి చేశాయి.

స్లావ్కాకు యిదేమీ అర్థంగాకపోయినా యేదో చెడు జరిగివుంటుందని ఊహించి తెల్లబోయిన కాజిమోవ్ ముఖంలోకి చూచి అనేవాడు:

"ఏం? ఏం జరిగింది, పాంతెలీ పెత్రోవిచ్? మీ గాయం తిరిగి రేగిందా? కొంచెం నా మీద చేరగిల బడండి—నేను బలంగలవాడినేలే—అప్పుడు మీకు కొంత సుఖువుగా వుంటుంది", అని తన చిన్న భుజాన్ని ఆనుడుగా యిచ్చేవాడు. "అది మీ గాయం వల్లనే, ఏం! బహుశా మనం కాస్సేపు కూర్చుని కొంచెం అలసట తీర్చుకుంటే?"

"అవునోయ్, స్లావ్కా. అది గాయమే," అని కాజిమోవ్ స్థిమితంగా సమాధానం చెప్పి, 'ఒకప్పుడు తానెంతో ఆనందంతో ఆతురతగా చేరుకూండే ఆ స్థలాన్ని వదలి త్వరత్వరగా నడచిపోయేవాడు.

కాని అంతరించిపోయిన తన గృహం వున్న ఆ ప్రదేశం అంటే అత ననుభవించే నిర్జీవ విరాగాన్ని క్రమ క్రమంగా వదిలించుకున్నాడు. ఒకనాడు స్థంభాలులేచిన ఒక ఇంటిముందర కాజిమోవ్, స్లావ్కాలు నిలబడ్డారు.

ఆరోజు ఏప్రిల్ మాసంలో మొదటి ఆదివారం; చాల ప్రకాశ వంతంగా వుంది. కరగిపొయ్యే నేలమీద బరువైన మంచు చుక్కలు టపటప పడుతున్నాయి. వసంతఋతువుతో వచ్చే సమస్యలను చర్చించుకుంటున్నట్టుగా పిచ్చికలు గొంతెత్తి రణగొణధ్వని చేస్తున్నాయ్. అక్కడ నిర్మింపబడే భవన ప్రాంగణపు సౌందర్యాన్ని పరికిస్తూ వీరిరువురు నిలబడి వున్నారు.

"ఇది ఎవరి ఇల్లు? ఎవరికోసం కడుతున్నారు?" అని రెండు కొయ్యబల్లలు మూపుమీద మోసుకువచ్చే ఒక యువకుణ్ణి ఉద్దేశించి కాజిమోవ్ అడిగాడు.

"అక్కడవున్న ఆ కర్మాగారానికి," అని సిగరెట్లతో పొగచూరిన తన చూపుడు వ్రేలితో అద్దంలా మెరిసే ఆ వసంతాకాశాన్ని నల్లటి నీడలుగా రంగులు బూసినట్టుచేసే పొగలు గ్రక్కుతున్న కర్మాగారపు బట్టీలవంక చూపాడు. "ఆ కార్మికులకు వసతి ఇక్కడే ఏర్పాటు చేస్తారనుకుంటాను. సిగరెట్టు ఏమయినా దొరుకుతుందా?"

కాజిమోవ్ వద్ద తీసుకున్న ఒక సిగరెట్టు ముట్టించి, భవిష్యత్తులో ఉపయోగానికని మరొకటి చెవిలో దూర్చి కొంటెగా కళ్ళు చికిలించి అన్నాడు:

"ఆహా! ఏమి యిళ్ళండీ! బాపురే! హీటర్లు, స్నానాలగదులు, మురికి పొయ్యేగొట్టాలు. ఇళ్ళంటేయిళ్ళా! ఇక్కడ ఒక యింట్లో వుండమంటే నాకుమాత్రం యేమీ అభ్యంతరం ఉండదు."

అతను మోసుకుపోతున్న ఆ పూగే బల్లలు యెండ వెలుగులో బంగారంలా మెరుస్తున్నాయి. ఒకదాని కొకటి కొట్టుకొని వింతైన దరువు వాయిస్తున్నాయి. అతను ఆ ప్రక్క మలుపు తిరిగి వెళ్ళేవరకు కాజిమోవ్, స్లావ్కాలు ఆగారు. అప్పుడు పాంతెలీ పెత్రోవిచ్ ఒకసారి నిట్టూర్చి, చిరునవ్వుతో, స్లావ్కా వంక రహస్యంగా కన్నుగొట్టి ఒక మూలన వున్న చిన్న రెస్టోరాంట్‌లో ఫలహారానికి వెళదామని సూచించాడు. ఇపుడు కాజిమోవ్‌కు హుషారు వచ్చిందని స్లావ్కా గుర్తించాడు. స్లావ్కాకు అత్యంత ప్రియమైన జున్నును లొట్టలు వేసుకుంటూ తింటూంటే కాజిమోవ్ ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఈ క్రొత్తభవనాల్లో యేదో ఒక దాంట్లో ఒకభాగాన్ని త్వరలోనే తనకు కేటాయించి యిస్తారు. అప్పుడు తన హృదయాన్ని ఇంతగా ఆక్రమించుకొన్న యీ తెలివైన చలాకీపిల్లవాడిని వదలి పోవలసి వస్తుంది!

అసలు క్లావ్దియా గనక పెంపకానికి అంగీకరిస్తే యీ పిల్లవాడిని తనతో గూడ తీసుకువెళ్ళడం చాలాబాగుంటుంది. ఇద్దరూకలిసి అత్యద్భుతంగా జీవించగలరుకూడ. 'అయితే మరి తనబిడ్డను ఎవరో పరాయివాడి పెంపకానికి ఎందుకివ్వాలి ఆవిడ? తన తల్లికి ఒకేఒకబిడ్డ అయినప్పుడు అతడిని తీసుకు వెళ్ళాలని కలగనడం—అందులోను క్లావ్దియావంటి తల్లికి కొడుకైన ఆ పిల్లవాడు ముమ్మూర్తులా తనతండ్రిని పోలి వున్నప్పుడు కలలోకూడ అలా ఊహించడం నిరర్థకం, తెలివి లేనిపని,

"ఆవిడే గనక నన్ను పెండ్లాడితే అసలు సమస్యే వుండదు... ..." ఈ ఆలోచన కాజిమోవ్‌కు పూర్వం ఎప్పుడూ కలుగలేదు. ఇప్పుడు అలా తలపోయడమే అతన్ని కొరడాతో కొట్టినట్టయింది; కోపంగా ఒకసారి సకిలించుకొని, ఎర్రబారి, గందరగోళంగా ఆ పిల్లవాడివంక చూశాడు.

"ఏమిటి, ఏమయింది—పాంతెలీ పెత్రోవిచ్!" అని తను తింటూన్న జున్నుముక్కను క్రిందబెట్టి, ప్రేమతో నిండిన కళ్ళతో తనస్నేహితుడిని తేరిచూస్తూ స్లావ్కా అడిగాడు: "మళ్ళీ మీ గాయమేనా?"

"అంతకంటె చెడ్డది" అనిపలికి, కాజిమోవ్ ముఖం త్రిప్పుకున్నాడు.

ఒక గ్రుక్కెడు వోడ్కా గభాలున మ్రింగేసి, ముఖమంతా చిట్లించుకొని, ఒకసారి రొట్టెముక్కను వాసనచూసి అన్నాడు కాజిమోవ్ :

"స్లావ్కా, మానవుడున్నాడే—వాడెప్పుడూ పగటి కలలు కనేజీవుడు. అదే అతనిలోవుండే మంచిఅంతా—తృప్తిఅనేది ఎన్నడూ ఎరుగడు. ఒక్కోసారి అలా పగటి కలలు గంటూ ఎంతో ఎత్తున ఎగిరిపోతాడు; అయినా తిరిగి క్రిందికి చూడడానికి మాత్రం బెదిరిపోతాడు.

తన మనసులోంచి దూసుకుపోయిన ఆ ఆలోచనను తలుచుకొని కాజిమోవ్ చాల సిగ్గుపడ్డాడు. దానిని త్రోసి పుచ్చాలని ప్రయత్నించాడు. కర్మాగారంలో పనిచేసేవారందరికీ ష్లికావ్‌కుటుంబం ఎంత హాయిగా జీవించిందో తెలిసే

వున్నది. ఇప్పుడుగూడ కార్పొరల్ ష్లికావ్ సాహసచర్య లను గురించి స్లావ్కాకు చెప్పినప్పుడు అతని తల్లిముఖంలో ఒక వెలుగు గోచరించేది. ఆ సమయంలో ఆమె ఒక వింత అందంతో కనిపించేది. కాజిమోవ్ నిశ్శబ్దంగా గదిలో ప్రవే శించినపుడు గోడమీద వ్రేలాడే ఫొటోముందు నిలబడి విచారకరమైన, గతించిన స్మృతులను జ్ఞప్తికి తెచ్చే దృక్కు లతో చూస్తూ ఆమె యెన్నిసార్లు కనబడలేదు ? గారేజిలో మెకానిక్‌గా పనిచేసే గుస్సేవ్—సాహసీ, మహిళా వశీకరణ మాంత్రికుడు అని పేరుమోసిన గుస్సేవ్—హఠాత్తుగా అక్కడవున్నవా రందరికీ ఆశ్చర్యం కలుగజేసేలాగ తనను పెండ్లాడమని కోరిన విషయం తనతో ఒకసారి ఆమె ఎంత కోపంతో చెప్పింది! వంటెంట్లో వుండగా ఆ విషయం చెప్పింది క్లావ్దియా; అసలు అలా అడగడాన్నే తన కేదో ఘోరమైన అపచారం జరిగినట్టు భావించింది. ఆమె చెబుతున్నప్పుడు కోపంతో ముఖమంతా జేవురించింది. కళ్ళల్లో నిప్పులు కురిశాయి. ఇదంతా వింటున్న యిరుగుపొరుగువారు యీ "జిత్తులమారి నక్కను" చూసి వా రేమీ అంగీకరించనట్టు "చ్-చ్"అని చప్పరించారు.

ఆమెతో పెండ్లిమాటయెత్తే ఆలోచననే త్రోసి పుచ్చడం మంచిది. లేకపోతే యింటినుండి ఆమె గెంటి వేసినా వేయవచ్చును.

ఆనాటిరాత్రి స్లావ్కాతోబాటు అతను ఇంటికివచ్చి నప్పుడు ఎదురుగా తమకోసమే ఎదురుచూస్తున్నట్టు,నోరూరించేటంత కమ్మనివాసనలు వెదజల్లుతూ టేబిలుమీద

కుతకుతలాడుతూ పొగలు విరజిమ్మే వంటకం కనబడింది. అల్లికఅల్లిన పూలగౌను తొడిగి, పొయ్యివేడికి ఎరుపెక్కిన ముఖంతో అందంగా కనబడే స్లావియా వారిని లోనికి ఆహ్వానించింది. కాజిమోవ్ ఎందుచేతనో తన యిష్టానికి వ్యతిరేకంగానే వేరువిధమైన కళ్ళతో ఆమెను చూశాడు. ఆమె ముందు తానెన్నడూ అనుభవించని వింతైన సిగ్గువొంతర ఒకటి అతనిని ఆవరించింది.

"ఆమేమో అందగత్తె; మరినీవో? ఆ మిగిలిన కాసిని వెంట్రుకలుకూడ రాలిపోతున్నాయి! నిన్ను చూసి నీవే సిగ్గుపడాలి!" కాజిమోవ్ సంబాళించుకొని టేబిలుముందు కూర్చున్నాడు. ప్రతి ఆదివారంనాటి భోజనసమయంలోలాగే ఇప్పుడుకూడ అతనికెదురుగా ఆమె నిశ్శబ్దంగా, కొంత గంభీరంగా కూర్చుంది. కాని కాజిమోవ్ ఆమెవంక చూడలేక గందరగోళపడ్డాడు. ఏమీ హడావిడిలేకుండానే వడ్డన చేసింది; పాకాలు అందరికీ అందించింది; కాజిమోవ్ ముందున్న మధుకలశంకూడ ఎప్పుడూ నింపుతూనేవుంది. కాని తానానాడు ఆకస్మికంగా కనుగొన్నదానివల్ల కాజిమోవ్ గజిబిజి చెందియుండకపోయినట్లయితే ఆమె ఎంత ప్రయత్నించినా అణచుకోలేకపోతున్న బాధను ఆమె ముఖంలో బహుశా అతడు చూసివుండేవాడే. అయితే స్లావా మాత్రం మరికొంచెం జాగ్రత్తగా గమనించాడు :

"అమ్మా, ఏమిటీ ఇవ్వాళ నీవు...... అదోవిధంగా వున్నావు? అని ఆరంభించాడు.

"సరేలే—ముందు తిను" అని ఆమె కఠినస్వరంతో ఆ పిల్లవాడిని వారించింది. "రోజంతా కేకులు తిని పొట్ట నింపుకుంటావు- -ఇప్పుడేమో చారూ—అన్నం సహించదు. తిను తిను."

ఉడకబెట్టిన పండ్లతో చేసినపాకం తిన్నతర్వాత ఆశ్చ ర్యాన్ని నటిస్తూ తడబాటుగానే అన్నది :

"ఆఁ మరచిపోయాను. మీకొక టెలిగ్రాం వచ్చింది, పాం తెలీపెత్రోవిచ్. ఆఫీసువాళ్ళు పంపించారు."

ఆ టెలిగ్రాం కవరు మూత తెరిచివున్నట్టు గమనించ కుండానే ఆమె చేతినుండి దానిని అందుకున్నాడు కాజి మోవ్. ఆకస్మికంగా, కారణం లేకుండానే ఉత్తేజితు డయాడు.

ఊరల్స్ పర్వతప్రాంతంలో వెలిసిన ఆ కవల కర్మా గారంనుండి వచ్చింది ఆ టెలిగ్రాం. కాజిమోవ్ పూర్వం పనిచేసిన కార్ఖానాలో ఇంజనీయరుగా వుండే అతను ఇప్పు డక్కడ పార్టీ ఆర్గనైజరుగా పనిచేస్తున్నాడు. అతడూ తది తర పాతస్నేహితులూ కలిసి ఆ క్రొత్తచోట వెలిసిన ఉక్కు మిల్లులో పనిచేయడానికి రమ్మనమని వ్రాశారా ఉత్తరం.

ఈ జాబు చదువుతూంటే సౌఖ్యంతో యీ ఉక్కు కార్మికుని నాడి స్పందనం ఉద్వేగం పొందింది; కాని వింటూన్న స్లావ్కామాత్రం భయంతో కళ్ళు పత్తికాయ లంతచేసి చూడసాగాడు. అతని ప్రక్కనే క్లావ్దియా పైకి

నిశ్చలంగా క్రిందికిచూస్తూకూర్చుంది. కాని, ఆమె ఒడిలో పెట్టుకున్న చేతుల్లో ఒక రొట్టెముక్క పిండిపిండై పోయింది.

"అరె, వాళ్ళకు గుర్తుకొచ్చాను చూడు! ఇన్నేండ్లు గడచాయి, అయినా వాళ్ళ కింకా కాజిమోవ్ జ్ఞాపకమున్నాడు! నేను తిరిగి వచ్చినట్లు విన్నారు; నన్ను ఆహ్వానించాలని వెంటనే ఆలోచించారు!" అతని హృదయం తృప్తితో నిండింది; ఎంతో ఆప్యాయతతో టేబిలుమీద ఆ టెలిగ్రాం కాగితపు ముడుతలు సవరించసాగాడు.

"పాంతెలీ పెత్రోవిచ్! మీరు వెళ్ళవద్దు. వాళ్ళనేమీ లెక్కజేయకండి! ఇక్కడే బాగుంది—అక్కడికంటే చాల బాగుంటుంది!" అని స్లావ్కా గణగణమనే గొంతుతో అరిచాడు.

"ఇక చాల్లే. నీకేమీ సంబంధంలేదు." కఠినంగా స్లావియా ఆపింది. ఆమె ముఖం మరింత నిశ్చలమూ, గంభీరమూ అయింది.

ఆందోళనపడుతూ కాజిమోవ్ ఆవిడవంక చూశాడు. ఆమె యెపుడూ యిలా కనిపించలేదు. స్లావ్కా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"మీరేమీ వెళ్ళిపోరుగదూ? చూడు, వాళ్లెంత తెలివైనవాళ్ళో—మీరేమో వస్తారనుకుంటున్నారు, పాపం!"

ఆలోచనాపూర్వకంగా చిరునవ్వుతో ఆ పిల్లవాడివంకచూశాడు కాజిమోవ్. నిజంగానే తనంటే ఆ పిల్లవాడికి

ఎంతో ప్రేమ ఏర్పడింది. కాని తల్లి అలా కాదు. ఇదేమీ లెక్కగా లేదామెకు. బహుశా తను వెళ్ళడమే ఆమెకు సంతోషమేమో—నివాసం కొంత విశాలమవుతుందిగూడ. ఈవిధంగా భావించిన కాజిమోవ్ అదిరిపడ్డాడు.

"చాల ఆలస్యంచేశారు వాళ్ళు. అదేం కాదోయ్, స్వ్యాతోస్లావ్. నాహృదయం యిక్కడి నూతన స్నేహితులకు, యీ బట్టీకి తాపటం అయిపోయింది. ఇక మనమఠం ఇక్కడే, తెలిసిందా?"

స్లావ్కాముఖం సంతోషంతో విప్పారింది. అప్పుడప్పుడు పెద్దపెద్ద చినుకులతోపడే వసంతకాలపు వానజల్లులోంచి మెరిసే సూర్యకాంతిలాగ అతనికళ్ళు కన్నీటితో జిగేల్‌మని మెరిసాయి.

"అదేమరి. వాళ్ళేమో చాల తెలివిగలవాళ్ళ మనుకుంటున్నారు—అంతగా కావాలంటే వాళ్ళనే యిక్కడకు రమ్మనమను ... ... ..."

తనయెడల యీ పిల్లవాడు కనబరచే ప్రేమాతిశయం యింత విస్పష్టంగా ఋజువుకావడం చూచి ఆశ్చర్యమూ, ఆనందమూ పొందిన కాజిమోవ్ క్లావియాకూడ యేదో బరువు తీసేసినట్లు నిట్టూర్పు విడవడం గమనించలేదు. టేబిల్‌మీద పరచిన గుడ్డకింద రొట్టెముక్కను పొడిపొడి చేసే ఆమెచేతులు ఆగిపోయాయి. తిరిగి ఆ రొట్టెముక్కలను ఆమె ముందున్న ప్లేటులో పోసింది.

నిద్రాసమయాన ఆఖరుసారిగా వారికి అభివాదంచేసిన కాజిమోవ్ ఆనాడు తన మామూలుపద్ధతిప్రకారం తెర దించిన తన మూలకుపోయి పడుకోలేదు. బయట పాకశాలలోకి వెళ్లాడు. ఈ సెలవుదినాన ప్రక్కగదులలోంచి వినవచ్చే పాటలు, నవ్వులు గ్రామఫోను రికార్డుల సంగీతం, నాటకాల కీచురులు వింటూ, గొలుసుకట్టుగా సిగరెట్లు త్రాగుతూ ప్రొద్దుపోయేవరకు మేల్కొని వున్నాడు. చివరకు క్లావ్దియా, ఆమెబిడ్డ నిద్రపోయారని తలచినపుడు మాత్రం బూట్లు విప్పేసి, పిల్లి అడుగులు వేసుకుంటూ తన మూలకు చేరాడు.

అతనికి నిద్రరాలేదు. తల్లీబిడ్డలు వదిలే సమమైన ఉచ్ఛ్వాస నిశ్వాసాలను వింటూ పడుకున్నాడు. ఇటీవలనే భవననిర్మాణ కార్మికులు పార్టీ జిల్లాకమిటీచేత తమపనిలో ఆలస్యం జరుగుతున్నందుకు తిన్న చీవాట్లగురించి ఆలోచించాడు. ఆ భవనాల్లోనే ఒకభాగం తనకు యివ్వడానికి నిశ్చయమైంది. ఆ ఇంటిని కట్టే కార్మికులు తమపనిలో ఏమీ చురుకుదనం చూపకూడదని మనసారా కోరుకున్నాడు.

# 13

ఒకనాటి సాయంత్రం కర్మాగారంనుంచి తిరిగివచ్చిన కాజిమోవ్ తన పెద్దకోటును తొలగించుకుని, తృప్తితో చేతులు నలుముకుంటూ స్లావ్కాతో అన్నాడు :

"ఏమోయ్ స్లావ్కా—చివరకు ఎలాగయితేనేం నాకు మంచి మార్కులె వస్తున్నాయి."

"నాకు ఇవ్వాళ లెక్కలు, చూచివ్రాతకు — రెంటికీ—'ఎక్సలెంటు' ఇచ్చారు" అని ఆ పిల్లవాడు నిర్దాక్షిణ్యంగా జవాబు చెప్పాడు.

"నేనైతే ఆ 'ఎక్సలెంట్' సంపాదించడానికి యింకా చాలదూరం వెళ్ళాలి. అయితే ఏం? చివరకు ఎలాగయినా సంపాదించి తీరతాను—ఆ ప్రయత్నంలో నేను మరణించినా సరే"

ఈ సంభాషణ జరిగిన తర్వాత చాలరోజులు గడిచాయి. ఈ లోపల తమ కర్మాగారంలో అత్యంత వేగంగా ఉక్కును ఉత్పత్తిచేసే దళనాయకులతో సరిసమానమయ్యాడు; ఒక్క షుమిలోవ్ మాత్రమే కాజిమోవ్ కంటె అధికోత్పత్తిని చూపగలుగుతున్నాడు. అయినా తన అధ్యయనంలోను,

పరిశోధనలోను, ప్రయోగాత్మక కృషిలోను మొండిపట్టు దలతో పనిచేయసాగాడు. తానూ విశ్రాంతి అనేది ఎరుగ కుండా పనిచేశాడు; తన అసిస్టెంటును, బట్టీని నింపేవానిని ఒక్కక్షణమైన వదలకుండా పనిచేయించాడు. చివరకు ఆ బట్టీ నింపేవాడు కాజిమోవ్‌కు మతిభ్రమించిందన్నాడు, అతడంటే కొంతభయమూ పడ్డాడు.

తన దళంలోనివా రందరినీ—చివరకు మరీ చిన్న వాడైన ఒక సోమరిపిల్లవాడితోసహా (వీడి జీవితంలో ప్రధాన లక్ష్యం నృత్యం చేయడమే) అందరినీ పనిలోంచి ఉద్వాసన జరుగుతుందనే బెదరింపుతో తమ కర్మాగారంలో ప్రవేశ పెట్టబడిన నూతన విషయాలను పఠించేలాగ చేశాడు. ఆ కుర్రవాడుమాత్రం తనను నిర్బంధించే అధికారం ఎవరికీ లేదని గొణగసాగేటప్పటికి కాజిమోవ్ యేదో అన్నాడు—ఆ మాట మొత్తం కార్ఖానా అంతటా అతి త్వరగా వ్యాపించింది.

"అలా అయితే నీకోసం ఒక గ్లాస్ పంజరాన్ని తయారుచేయిస్తాం. దానిని ముఖద్వారందగ్గర పెట్టి దాని మీద "బుద్ధిహీనుడు" అనే అట్ట ఒకటి కడతాం. అప్పుడు జనం అంతా వచ్చి, నిన్ను తేరిపారజూచి, ఇదేదో పురాతన అవశేషమనో లేక మరొకటో అని అనుకుంటారు." పాపమా దౌర్భాగ్యుడికి యీ పేరు అతుక్కుపోయింది; అప్పటినుండి తమ నిత్యపఠనాన్ని తప్పించుకోవాలని జూచే ప్రతివాడికీ ఆ "పురాతన అవశేషం" అనే పదం అంటుకొంది. ఆ ఉక్కుమిల్లులో ఉపయోగించే పదజాలంలో అది

చేరిపోయింది. అలాగే వ్యాపించి చివరకు జోరిన్ ఒకనాడు అధ్యయనతరగతుల గురించి రిపోర్టునిస్తూ "మనలో యింకా చాల పురాతనమైన అవశేషాలు వున్నాయి—కావలసినన్ని" అనే వరకు వెళ్ళింది.

అధ్యయనంలో కాజిమోవ్ దళం ఆదర్శప్రాయమైంది. అతని నాయకత్వాన అందరూకలిసికట్టుగా ఒకేసారి లెక్చర్లు వినేందుకు హాజరయ్యేవారు; ఒకేసారి ప్రయోగాలుచేయడం పరికించేవారు. ఒకనాడు క్లబ్బులో షుమిలోవ్ అత్యంత వేగంగా ఉక్కును కరగబోయడం అనే విషయంమీద మాట్లాడాడు. ఆ ఉపన్యాసానికి కాజిమోవ్ అసిస్టెంటు గైరుహాజరయాడు. అలా మరోసారి జరిగితే తననుంచి వేరువడిపోవలసి వుంటుందని కాజిమోవ్ హెచ్చరించాడు. ఈ విధంగా సినిమా, నృత్యం, స్కేటింగులు—అన్నీ మానుకోవలసి వచ్చిన ఆ యువకార్మికులు తమ ఏదో పూనినట్లున్న నాయకుణ్ణి చూసి లోలోపల గొణిగేవారు; కాని వారివారి ఫిర్యాదు లెలాంటివైనా కాజిమోవ్ చెప్పిన ప్రతిదానినీ విధేయతతో అంగీకరించేవారు. అతనియెడల వారి గౌరవ భావంకూడ పెరగసాగింది. అలా తన పనిని గురించి తానే ఎన్నడూ సంతృప్తిని వెల్లడించక, తన పనిలో అత్యుత్తమ ప్రమాణాలనుమాత్రమే లక్ష్యంగా పెట్టుకొని పనిచేస్తూ, తామందరికి క్రొత్తబాధ్యతలను తెచ్చిపెట్టే యీ మనిషిని చూసి బహుశా ఆ యువకార్మికులకు ప్రేమాభిమానాలు కలిగాయేమోగూడ.

ఎంతో ఓర్పుతోను, దీర్ఘంగాను సాగించిన పరిశోధన కృషి ఫలితంగా బట్టీని నింపడంలో కాజిమోవ్ క్రమ క్రమంగా తన స్వంతపద్ధతినే ఒకదానిని ఏర్పరచుకొన్నాడు. ఇతని ప్లానుప్రకారం యీ పద్ధతులను అనుసరిస్తే కాలం కలిసి రావడమేగాక అమూల్యమైన ఉష్ణం కూడ ఎంతో లాభం అవుతుంది. కాజిమోవ్ మండే మంటలదీప్తిని నిపుణంగా ప్రయోగించేవాడు; బట్టీని నింపే యంత్రంతోగాని లేదా ఇనుము—మిశ్రమలోహాలను అత్యంతశ్రద్ధతో లెక్కగట్టిన మోతాదులతోగాని బట్టీలోపలి లోహాన్ని కదిపేవాడు; ఉక్కు కరగబోతలో యీ విధంగా జోక్యం కలిపించుకొని మొత్తం కాలాన్ని ఎంతో తగ్గించగలిగాడు.

ఇక ఇప్పుడు ఆ లాబొరేటరీలో పనిచేసే వాళ్ళాతో కాజిమోవ్ స్నేహం దృఢమైంది. దానితో ప్రతి పది, పది హేను నిమిషాలకు ఒకసారి మచ్చుతునకలను పరీక్షకోసం ఆమె కిచ్చేవాడు. దీనివల్ల తన పనిలోపట్టే టైంను చివరి క్షణంవరకు లెక్కగట్టగలుగుతున్నాడు. ఇంకోమాటల్లో చెప్పాలంటే అతని నైపుణ్యం యుద్ధానికి పూర్వంలాగ అనేకసంవత్సరాలపాటు శ్రమించి సంపాదించిన అనుభవం మీద మాత్రమే ఆధారపడిలేదు; అతని అనుభవంచేత పరిణితిపొంది, అతిసూక్ష్మమైన వివరంవరకు విపులీకరించబడ్డ ఒక సంపూర్ణవైజ్ఞానిక సాంకేతికపద్ధతినే ఆనైపుణ్యం తెలుపుతోంది.

ఉపన్యాస సంపుటాల్లో, రసాయనశాస్త్రం, లోహ శాస్త్ర పాఠ్యగ్రంథాలలో మునిగితేలుతూ గడపినరాత్రులు

వృథాగాలేదు. విశాలమైన ప్రత్యక్షానుభవంతో పదునెక్కిన భూమిలో ఆ విజ్ఞానబీజాలు పడ్డాయి. ఒకనాడు తమ కార్ఖానాలోని సమర్థుడూ, అనుభవజ్ఞుడూ అయిన ఒక సాంకేతిక నిపుణినితో చర్చజరిగింది. చర్చావిషయం ఒక ప్రత్యేక కార్యార్థం తయారుచేయబడుతున్న అత్యుత్తమ గుణంగల మిశ్రమఉక్కును కరగబోసే పద్ధతినిగురించి జరిగింది. కాజిమోవ్ ఒక విషయమై చర్చసాగించాడు. ఆ సమయంలో మధ్యవర్తిగా ఆహ్వానింపబడిన ప్రధాన లోహశాస్త్రనిపుణుడు ఇతని వాదనే సరిఅయినదని రుజువుచేశాడు.

మరల ఇప్పుడు కాజిమోవ్ పేరు వార్తాపత్రికల వ్యాసాల్లోను, రేడియోప్రకటనల్లోను కనిపించసాగింది. తిరిగి అతని ఫొటోకూడ షమిలోవ్ ఫొటోకుప్రక్కగా గౌరవ ఫలకంమీద వ్రేలాడుతోంది. వారిద్దరుకలసి మాస్కోలోని ఒక ప్రచురణాలయంవారికి అత్యంత వేగంగా ఉక్కును కరగబోయడంలో వారి అనుభవాలమీద ఒక గ్రంథాన్ని వ్రాయమొదలెట్టారు కూడ.

అయినా కాజిమోవ్‌కు సంతృప్తికలగలేదు. అద్భుతమైన తనబట్టీని పూర్తిగా వినియోగించుకోనలేక పోతున్నట్టు గమనించాడు. సాంకేతికశాస్త్రంలో పరిశోధనలు యింకా పరిశీలించని రంగాలున్నాయనీ, అవి విశాలమైన ఉత్పత్తి నిధులను కలిగియున్నాయనీ భావించాడు. ఇదంతా అతనిని వేధించసాగింది.

ఒక్కొక్కసారి రాత్రివేళల ప్రక్కమీదినుంచి గభాలున లేచి, తన ఉన్నిబూట్లలో కాళ్ళుదూర్చి, కోటును

భుజంమీాద వేసుకొని బయట వసారాలోకి వెళ్ళేవాడు. అక్కడే నిలబడి వానచినుకుల టపటపలు, ఆకులురాలిన చెట్ల చివళ్ళగుండా యీలలువేస్తూ దూసుకువచ్చే గాలినీ, కురిసే మంచు పెట్టే నిట్టూర్పులూ వింటూండేవాడు. కర్మాగారంమీాద వెలుగు ఆకాశాన్ని ఉజ్వలం చేసేది; పైన తేలిపోయే మబ్బుదొంతరలు ఎర్రనెర్రగా ప్రతిబింబించేవి. అతని ఆలోచనలు తమ కార్ఖానామీాద, తన బట్టీమీాద, ఉక్కు కరగబోసే విధానం ఆద్యంతం గురించీ అతని మనస్సులో పయనించేవి; క్రొత్తక్రొత్త ప్రయోగాలను జరపడానికి ప్లాన్లు వేసుకొనేవాడు.

ఒక్కోసారి అలాగే నిలబడి చలితో బిగిసిపోయి తిరిగి గదిలోకి చేరేవాడు. త్వరగా తన తెరవెనుకకు వెళ్ళి దుస్తులు వేసుకొని ఆ నడిరేయివేళనే తన మనస్సులో మెదలిన ఒక క్రొత్తభావాన్ని పరీక్షించడానికో లేదా ఘుమిలోవ్‌తో చర్చించడానికో కర్మాగారానికి వెళ్ళేవాడు. ఒకసారి మేదినోత్సవ పోటీ జరిగింది; కాజిమోవ్ ఉత్తమ కృషి ఫలితంలో విజయసాధనకోసం ఘుమిలోవ్‌ను సవాలుచేశాడు. అయినా వారిద్దరు ఒకరి సహాయసహకార సలహాలను మరొకరు అందిపుచ్చుకొనేవారు; ఒకరి నిర్ణయాలు మరొకరికి మార్చుకునేవారు. ఇది వారి స్నేహాన్ని మరింత దృఢపరచింది.

ఈ ఆవేదనలు, బాధ్యతలు పనీ అంతాకలిసి కాజిమోవ్ కనుగొనల్లో కానవచ్చే విచారాన్నీ అలసటను తొల

గించివేశాయి. ఆ కళ్ళల్లో పూర్వపు సంతోషం తిరిగి మెరి సింది.

"గార్డ్సు! మన మిప్పుడు దాడి సాగిస్తున్నామా?" అని జోరిన్ నవ్వుతూ ఒకనాడు కాజిమోవ్‌తో అన్నాడు. ఆ సమయంలో కాజిమోవ్ తన షిఫ్టు అనంతరం మరో దళంవచ్చి బట్టీని నింపుతూ పనిచేయడాన్ని పరికిస్తూ నిలబడి వున్నాడు.

"అవును దాడిలో దెబ్బతీయడానికి మన సర్వశక్తులను సమీకరిస్తున్నాం" అని కాజిమోవ్ సమాధానం చెప్పాడు. అయినా అత్యంత వేగంగా ఉక్కును కరగబోయడంలో తన మహాప్రయత్నాన్ని ఎలా ఎప్పుడు ఆరంభించబోతున్నాడో మాత్రం చెప్పలేకపోయాడు.

కాజిమోవ్ మేల్కొనివున్న సమయమంతా ఇప్పుడు కార్ఖానాలోనే గడిచిపోతోంది. అక్కడే మధ్యాహ్న భోజనం చేయడం, క్లబ్బులో రాత్రిభోజనం ముగించుకోనడం జరిగేది. ఇంటికి చేరేటప్పటికి చాలసార్లు క్లావియా, ఆమె పుత్రుడు నిద్రకు సిద్ధమవుతూండేవారు. తెరవెనుక తన మూలకు నిశ్శబ్దంగా జేరేవాడు; పక్కదగ్గర లైటు వెలిగించి వార్తాపత్రికనో, మరొక పుస్తకాన్నో చదువుతూనో లేదా కళ్ళుమూసి వూరికే పడుకొనిగాని గడిపేవాడు.

అయితే కేవలం అతడు అంత మొండిగా తన పరిశోధనాకృషిని సాగించడంవల్లగాని, క్లబ్బులోనున్న సాంకేతికవిషయాల గ్రంథాలయంలో దీర్ఘకాలం గడిపినందువల్ల

గాని, యింటికి రావడం ఆలస్యం జరగడం లేదు. దానికి మరో కారణంకూడవుంది. ఆనాటి సాయంకాలాన స్లావ్తో కలిసి తను విహారంగా బయటకు వెళ్ళిన సమయంలో ఆక స్మికంగా తను క్లావ్దియాను వివాహమాడుదామన్న అభి ప్రాయం కలిగింది మొదలు ఆమె సమక్షంలో పూర్వంవలె మామూలుగా వ్యవహరించడం అసాధ్యమైంది అతనికి.

కొలదికాలంక్రిందట అయితే క్లావ్దియా యింటివద్ద వున్నదీ లేనిదీ కాజిమోవ్ యేమంత పట్టించుకోకపోవడం లేదనిగానీ, ఆమెకు యే గౌను అందాన్నిస్తుందో అత నెరిగే వున్నాడనిగానీ, ఆ ఒక్కగౌనే ఆవిడ ధరించగా చూసినపుడు అతనికి ఆనందం కలిగేదనిగానీ, అలసటతో విషాదాన్ని వ్యక్తంచేసే ఆవిడ కళ్ళతో అద్భుతంగా సరిపోలుతున్న ఆ నిండైన పెదిమెలు, పైకివంగిన ముక్కు గల ఆవిడముఖంలోకి దొంగవాటుగా చూడడం అతనికి యిష్టమేననిగానీ తన తెర వెనుకనుండి ఆ క్రిక్కిరిసిన చిన్నగదిలో యేవస్తువును జార విడువకుండా తేలికపదముల నడకతో ఆవిడ గదిలో మెదు లుతూవుంటే అతను వింటూంటాడనిగాని యెవరైనా సూచించినట్లయితే అత డెంతో విభ్రాంతి జెందేవాడు. బహుశా కోపగించివుండేవాడేమోగూడ.

రాత్రివేళల గ్యారేజివద్ద మామూలుకంటె హెచ్చు కాలం ఆవిడగడిపినట్లయితే అతడెంతో అశాంతినీ, బాధను పొందేవాడు; చివరకు అలసటగొల్పె ఆ నిరీక్షణ తర్వాత ఆవిడపాదాల తేలికసవ్వడి బయట నడవలో వినబడ్డప్పుడు

ఎంతో తేలికపడి, హాయిని పొందేవాడు. అయితే ఒక విధంగా కాజిమోవ్ తనకుతాను సమాధానం చెప్పు కున్నాడు: రాత్రివేళల సుదూరాన సరిగా దీపాలులేని బజార్ల వెంట ఒంటరిగా నడిచిరావడం ఏమంత క్షేమకర మయిన విషయం కాదు గనుక ఒక యువతిక్షేమాన్ని గురించి తానంతగా ఆతురపడడం సహజమేనని భావించాడు.

అయితే ఇదిఅంతా తప్పేననీ, ఒకానొక కష్టకాలంలో తనకు సహాయపడిన మంచిస్నేహితురాలుకంటె గూడ ఆమె ఎక్కువ సన్నిహితమైనట్టిదనీ ఇప్పు డతనికి అర్థమయింది. పోనుపోను క్లావ్దియా అతన్ని హెచ్చుగా ఆకర్షించ సాగింది. చివరకు ఉక్కును కరగబోసే సమయానకూడ — ఏ సమ యంలో తన ముందు పొంగులువారుతూ, తెల్లగా మెరసి పోతూన్న పదార్థం మీదనే అతని ఆలోచనలన్నీ కేంద్రీక రించబడుతున్నాయో, యీ ప్రపంచాన్నే మరచేటంతగా తన పనిలో మునిగిపోయి తన మనస్సునుండి విజాతీయమైన, అనవసరమైన ప్రతిదానినీ కటువుగా త్రోసిపుచ్చేవాడో — అలాంటి సమయంలో కూడ క్లావ్దియారూపు స్ఫురణకు వచ్చేది. కాజిమోవ్‌ను చికాకుపరచి, అన్యమనస్కునిజేసే ఆమెయొక్క అన్వేషిత నయనాలు, నిండైన పెదిములమీద తేలియాడే చిరునవ్వుగల ఆవిడ అందమైనముఖం అతను కరగించుతున్న ఉక్కులో ప్రతిబింబించుతున్నట్టయ్యేది. అతని చెవిలో లోతైన నిండు కంఠస్వరం ధ్వనించు తున్నట్లుండేది.

ఇది యెంత విచిత్రమైనా అతని కేంద్రీకృత కృషిని యేమాత్రం ఆటంకపరచలేదు. కుతకుతలాడే ఆ ఉక్కులో నుంచి ఆకస్మికంగా ప్రతిబింబించే ఆ స్త్రీయొక్క తియ్యని మోము అతని ఆలోచనలను యేమాత్రం చిందరవందర జేయలేదు సరిగదా పైగా మెదడును ఉత్తేజపరచి, దానికి సాహసాన్నిచ్చి, చేతులకు సత్తువను, నైపుణ్యాన్ని కలుగ జేసే ఒక విధమైన ఉజ్వలత్వాన్ని పొందేందుకు తోడ్ప డింది. ఎక్కడో తనకు సమీపంలోనే ఆవిడ నివసిస్తున్న దనీ, సాయంత్రం తా నామెను చూడగలననీ, తను సాధిం చిన నూతనవిజయాలను గురించి ఆ నా డామెకు నివేదించ గలననీ తెలుసుకొని కాజిమోవ్ ఉత్తేజితు డయాడు.

అయితే ఉక్కును కరగబోయడం ఒకసారి పూర్తి అయినతర్వాత, అతని షిఫ్టు అంతానికి యింటికిపోయే సమ యము ఆసన్నమయినపుడు అంతవరకూ కాజిమోవ్ అనుభ వించిన సుఖమయోత్సాహంలో ఒక మార్పు కలిగేది. మరి కొంతకాలం తనను ఆ కార్ఖానాలోనే యేదో ఒక వ్యాప కంతో నిలిపివేసే మరో పనికొరకు వెదకులాడేవాడు. జోరిన్ యేదైనా పని వప్పజెప్పినప్పుడు వెనువెంటనే అందుకు సమ్మ తించేవాడు. అక్కడినుండి సరాసరి సాంకేతిక విషయాల పఠ నాలయానికి దారితీసేవాడు. అంతేగాని యింటికి వెళ్ళేం దుకుమాత్రం యేమీ తొందరపడడు. ఏకారణంవల్ల తా నిలా వ్యవహరిస్తున్నానోనని ఆశ్చర్యపడుతున్నాడే గాని కాజిమోవ్‌కు నిశ్చితమైన సమాధానం యేమీ గోచరించ

లేదు. అతని మనస్సుమాత్రం గ్లాఫియాను చూడ నువ్విళ్ళూరేది. అయితే ఒకవేళ తన మనోభావాలను అభిమానం, విజ్ఞతగల ఆ స్త్రీ కనుగొనగలుగుతుందేమో ఊహించనైనా ఊహించగలుగుతుందేమో నని భయపడేవాడు. మాటతోనో, చేతతోనో తనెక్కడ బయటపడిపోతానో నని లోలోపలనే అతడు కుంచించుకుపోయాడు. గ్లాఫియా త్వర త్వరగా, తేలికగా నడవడం విన్నప్పుడల్లా తను పొందే సుఖాన్ని దాచే ప్రయత్నంలో అతను మరింత అసహజమై మూగవోయేవాడు.

అందరూ సమిష్టిగా గుడ్డలుఉతుక్కునే గదిలో ఒక వయసుమళ్ళిన ఇరుగుపొరుగు ఆవిడతో జరిగిన ఒకనాటి సంభాషణతో కాజిమోవ్ మరీ ప్రత్యేకంగా బాధపడ్డాడు. ఆవిడేమో మధ్యవయస్కురాలు; నిజాయితీపరురాలు. ఉక్కు కర్మాగారంలో పనిజేసే ఒక రోలింగుమిల్లు కార్మికునిభార్య. ఇత్తడికుళ్ళాయిలు అమర్చబడిన పెద్ద తుత్తునాగపు తొట్టె ముందర వారిద్దరు ఒకసారి నిలబడివుండగా వేరే ఉపోద్ఘాతం ఏమీలేకుండానే ఆవిడ ఆరంభించింది :

"పాంతెలీ పెత్రోవిచ్, మీరింకా తటపటాయిస్తూండడం తప్పు. ఆమె ఇంత ఎత్తుపిల్లనాటినుండి నేను ఎరిగివున్నాను. చాల తెలివైనది, మంచిదిగూడ. ఆవిడ హృదయం బంగారమే."

కాజిమోవ్ కొయ్యబారిపోయాడు; తన ముఖం, చెవులు, మెడ జేవురించుతుండగా అలాగే నిలబడిపోయాడు.

మళ్ళీ సంబాళించుకొని దోసిళ్ళతో చన్నీళ్ళను మొహం మీద చల్లుకోసాగాడు. తమ ఇరుగు పొరుగువారు తనూ, క్లాదియాలగురించి ఇంకా హాస్యాలాడు తున్నారనీ, తానేమీ లెక్క చేయడంలేదనీ అతనికి తెలుసు. అయితే యీ స్త్రీ అలాంటి వదరుబోతు కాదు. పైగా ఆవిడను అందరూ గౌర విస్తారు. అంతేగాక ఆ బారకాసుల్లో నివసించే వారిలో ఎంతటి గయ్యాళి అయినా యీవిడనుచూచి భయపడడం గద్దు.

"నీవూ మంచివాడివే. నిజాయితీపరుడవు గూడ. నీకు వ్యతిరేకంగా పలకడానికి నాకేమీ లేదు. అయితే యింకా మంచివాళ్ళే క్లాదియాను పెండ్లాడుదామని కోరు కున్నారన్నసంగతి తెలుసుకో. వాడున్నాడే—ఆ గ్యారేజిలో పనిచేసే గుస్నేవ్—ఒక్క పనికిమాలినవాడు; వాడొక లెక్క లోకిరాడు. ఆ నాటక సమాజంలో వేషాలువేసే పోలీసు వాడుగూడ బహుచవకబారు మనిషి. ఆవిడ విధవదనీ, పురుషులు తక్కువగా వున్నారనీ, ఆవిడకు వేరే దారేమీ లేదనుకున్నారు గాబోలు! వాళ్ళను బయటకుగెంటి మంచి పనే చేసింది; ఎంతబాగా చేసిందంటే ఇకవాళ్లు ఈ అడ్రసే మరచిపోయారుసుమా! వాళ్ళవిషయంగాదు నే ననేది. ఇంకా మంచిమంచి వాళ్ళే అలా కోరుకుంటున్నారు. ఉదా హరణకు నీ పనిలోనే నీకు బదులుగా పనిచేస్తూంటాడే అప్పు డప్పుడు—ఆ మీసాల ఆసామి—అతనొకడు. నమ్మవలసిన మనిషే మరి. ఇంకా అక్కడ రోలింగుమిల్లులో మా ఇంటా యనతో కలిసి పనిచేస్తూంటాడే—అతనొకడు. యువకుడు;

సరిగ్గాఆవిడవయస్సే; మంచివాడు; పార్టీసభ్యుడు, పైగా అంద గాడుగూడ. అయినా వాళ్ళిద్దరినీ కాదన్నది. 'మా ఆయన్ను మరచిపోలేను. నే నిక వివాహమాడ దలచలేను'అని చెప్పే సింది. మరి, విషయం ఏమిటో బోధపడిందా? అయితే అదంతా ఆవిడ స్వంత వ్యవహారమేననుకో. బహుశా ఇదంతా నేనెందుకు చెబుతున్నానాఅని నీవు ఆశ్చర్యపోతున్నావేమో. సరే, మరి ఆ పిల్లవాడు—నీతో ఎంతో అతుక్కుపోయాడు, పాపం తండ్రిలేని బిడ్డాయె! వాణ్ణిచూస్తేనే విచారమేస్తుంది."

అతని సమాధానంకోసం ఎదురుచూడకుండానే ఆమె వెళ్ళిపోయింది. అందుకు కాజిమోవ్ కూడ కృతజ్ఞతజూపాడు. తానేమీ ఎరుగని ఒక పరాయివ్యక్తితో యిలాంటి విషయం మీద ఏమిచెప్పగలడు? మసకమసకగావున్న ఆ స్నానాల గదిలో చాలసేపు అలాగే నిలబడిపోయాడు; ముఖం తుడుచు కోవడంగూడ మరచిపోయినందువల్ల బాధాపూరితమైన దిగ్భ్రమ అతని ముఖంమీద గడ్డకట్టినట్లయింది.

అనుకున్నదానికి పూర్తి వ్యతిరేకమయిన ఫలితాన్నే ఇచ్చింది యీ సంభాషణ. ఉచితమైనవారినే క్లావ్దియా నిరాకరించియున్నప్పుడు యుద్ధమూ, జీవితమూ రెండూ కలసి తమవంతు తాము పూర్తిగా వసూలుచేసుకొన్న యీ అలసిన, మధ్యవయస్కుడికి మాత్రం ఆశ ఏముంటుందని భావించాడు. గుండెలు వ్రక్కలవడంలోను, కన్నకలలన్నీ వమ్ముగావడంలోను అతనికి నిండైన అనుభవమేవుంది. క్లావ్దియాతోటి వివాహం అనే ఆలోచననే తన మనస్సు

లోకి రానివ్వగూడదని శపథంచేశాడు. పైగా అతను మాటఅంటే పట్టువిడువని మనిషికూడ.

అయితే తన అతిథిని ఇంతగా బాధిస్తున్న భావాలను గురించి క్లాద్దియాకు ఏమీ తెలియదు; కనీసం ఊహించనైనా లేదు. కాని అతనిలో ఏదో వింతైనమార్పు వచ్చినట్లు మాత్రం గమనించింది. అభిమానవతి కావడంవల్ల ఆమె కూడ ఒక స్వంతనిశ్చయానికి వచ్చింది. దాని ఫలితంగా పట్టీపట్టనట్టు మెలగసాగింది; కొంత బిరుసు తరహాను కూడ చూపింది. క్రమక్రమంగా వారిరువురూ కలిసి జరిపే పఠనాలు, శనివారపు రాత్రిళ్ళు నడిపే సంభాషణలు అంతమయాయి.

ఒకనాడు ఆమె అడిగింది: "ఊరల్ పర్వతప్రాంతాలకు వెళ్ళక నిరాకరించి మీరు మంచిపనే చేశామనుకుంటున్నారా?"

ఆమె అలా ఆకస్మికంగా ప్రశ్నించడం, ఆవిడ చూపుల్లో విచిత్రమైన విసుద్ధభావం కనబడడం అతణ్ణి ఆశ్చర్యచకితుణ్ణి చేసింది

"అక్కడవా రందరినీ మీ రెరిగేవున్నారు—వారంతా మీ స్నేహితులే. ఇక్కడో—అంతాకొత్త. పైగా మీబాధ లేవైనా చెప్పుకుందామన్నా ఇక్కడెవరూ లేరుకూడ" అని క్లాద్దియా పలికింది. అతనికి సమీపంలోనే ఆమె నిలబడి వున్నా, అతని కళ్ళల్లోకి సరాసరిచూస్తూ మాట్లాడినా వారిద్దరిమధ్య అనంతమై గడ్డబారిన విశాల శీతలప్రదేశం ఆక్ర

మించినట్లు, అంతదూరంనుండి ఆమె కంఠస్వరం వినిపించడం కష్టమవుతున్నట్టు కాజిమోవ్ భావించాడు—ఆవిడ కండ్లలో అలాంటిభావం వ్యక్తమయింది.

ఇలాంటి సంభాషణ జరిగేందుకు కారణమేమీ లేదు. హఠాత్తుగా కాజిమోవ్‌కు ఒక అభిప్రాయం కలిగింది: ఏ క్షణాన్నైనా వారిద్దరిలో ఎవరోఒకరు అనరానిమాట ఏదో ఒకటి అంటారనీ, దానితో సర్వం వికలమైపోయి వెంటనే తనపెట్టే, బేడాచుట్టి బయటకు నడవవలసివస్తుందనీ తోచింది. ఈ ఆలోచనకలిగి భయభ్రాంతుడయ్యాడు. తన భయాందోళనను కప్పిపుచ్చలేక అనేశాడు నట్టునట్టుగా :

"నేనంటే మీకు విసుగెత్తినట్లుంది... ...మీకుఅడ్డం వస్తున్నాను... ... వెళ్ళిపోనా!"

అతని పలుకులు చాల విషాదాన్ని వెల్లడించాయి. అది గమనించిన ఆమెకళ్ళల్లో మరోసారి ఆప్యాయత వ్యక్తమయింది; వాటిల్లో మెరిసిన విరుద్ధభావం తొలగిపోయింది; తిరిగి మామూలుగావుండే అలసిన విచారనయనాలుగా మారాయి. అయినా తనకేమీ పట్టనట్టే ఒకసారి భుజాలు ఎగరవేసి అన్నది :

"ఉంటే ఉండండి—ఎందుకు ఉండకూడదు? మీ మూల మీకున్నది. దానికి మీరుకూడ అద్దె చెల్లిస్తున్నారామె."

ఈ సంభాషణవల్ల యేదీ స్పష్టం కాలేదు. ఒకరి సమక్షంలో ఒకరు ద్వైదీభావంతోనే మెలగసాగారు. ఐనా కాలక్రమేణా దీనికికూడ అలవాటు పడిపోయారు.

కాని స్లావ్కా కుమాత్రం యిదంతా నరకకూపంలా వుంది. ఒకప్పుడు యిదే గదిలో సంతృప్తి, ఆప్యాయత సాధారణజీవితాలతో అంతా ఆనందమయంగా వుండేది; కాని దానిబదులు గదినంతా నింపివేసిన శీతల గౌరవభావపు వాతావరణంలో ఆ పసివాడు ఉక్కిరిబిక్కిరయ్యాడు. పెద్దవారికి యిదంతా ఒక విషాదకరమైన దుస్సంఘటనగా కనిపించవచ్చునుగాని ఆ పిల్లవాడికిమాత్రం ఒక ప్రళయంగానే వుంది. తన పాంతెలీ మామను—అద్భుతం, ఆశ్చర్యంగొల్పేవాడు, వీరుడు, తన తండ్రికి స్నేహితుడు, బడిలో పిల్లలందరూ ఎరిగివున్న పేరుమోసిన ఉక్కుకరగబోత కార్మికుడు అయిన తన పాంతెలీ మామను—ఉన్నట్లుండి రోజులతరబడి కంటబడకుండాపోయి, కనబడినప్పుడు దిగులుగా మాటామంతీ లేకుండా తిరిగేలాగ చేసింది ఏదో దుష్టమైందీ, భయంకరమైందీ జరిగిందని అతని పసిహృదయం తెలిపింది ఇక తన తల్లి మాటో! అంత మంచిఅమ్మ, అంత ప్రేమించే, దయగల అమ్మ ప్రపంచంలో అత్యుత్తమమైన అమ్మ ఒక్కసారిగా హఠాత్తుగా విచారగ్రస్తురాలై, మాటిమాటికీ చీకాకుపడుతుండడం, తమ అతిథితో మాట్లాడవద్దనీ, తన లెక్కలు, తదితర విషయాలతో అతన్ని విసిగించవద్దనీ వాదించడంచూచి ఆ పిల్లవాని గుండెలు తల్లడిల్లాయి. పాంతెలీ మామతో చెప్పవలసిన విషయాలు ఎన్ని ఉన్నాయో! ఒక్కోసారి వాటన్నిటినీ లోపల ఇముడ్చుకోలేక బ్రద్దలైపోతున్నట్లు భావించేవాడు.

ఒకనాడు స్లావా యీ క్లిష్ట వ్యవహారాన్ని తన బాల హృదయ ప్రేరణ ప్రకారం సరిచేయడానికి పూనుకున్నాడు. ఒకసారి బడిలో పిల్లల తగాదానుగూడ అతడు పరిష్కరించి నట్లే యీ పెద్దవారిద్దరిమధ్య ఏర్పడిన ద్వైదీభావాన్ని చక్క దిద్ది, వారిరువురికీ తగవుదీర్చి, సఖ్యత నెలకొల్పబూను కొన్నాడు. దాని ఫలితంగా కాజిమోవ్ ముఖం సిగ్గుతో జేవురించగా బయటకు నడచాడు. ఇక అమ్మ? తన జీవి తంలో ఎన్నడూ కొట్టిఎరుగని అమ్మ వీపు పగలగొట్టింది!

పరిష్కృతం కానిదేదో సంభవిస్తున్నదని స్లావా గుర్తించాడు. అతడి ప్రపంచమే కూలిపోతోంది. ఒక సారి తోటి పిల్లలు కొంతమందివచ్చి, తనెంతో కష్టబడి నిర్మించుకొన్న మంచుమనిషిని బొగ్గుకళ్ళు, ముల్లంగి ముక్కుతో అందంగా తయారుచేసుకొన్న మంచుమనిషిని- ధ్వంసం చేసిపోయినా అతడేమీ ఆందోళన జెందలేదు. ఈ మంచుమనిషి నిర్మాణంలో ఎంతో శ్రమ, ప్రయత్నం యిమిడివున్నాయి. దీనివల్ల ఎన్నో చెడ్డమార్కులు అతని అభివృద్ధి సూచికలోకి ఎక్కాయి. కాని యీ మధ్యవచ్చిన కష్టమయ సంఘటనలలోబడి అవి ఎవరిదృష్టినీ బడలేదు.

# 14

విచిత్రమేమిటంటే క్లావియా సమక్షంలో కాజిమోవ్ మామూలుగా మెసలలేక, పిరికిపందలా తప్పించుకుపోజూచే వాడు; కాని ఒకసారి బజార్లో పడడంతోటే తిరిగి చల్లబడే వాడు. తన బాధలన్నీ మరచిన ఒక అభిమానవతి, అందరాని స్త్రీ అతని ఎదుటనున్నట్లు, నిత్యకృత్యాలలో ఆమె తనను ఉత్తేజింపజేస్తున్నట్లు, ఆ విషాదనయనాల్లో సుఖమయ ప్రకాశం రంజిల్లుతున్నట్లు భావించేవాడు.

ఒక వసంతదినాన ఇలాంటి మనోభావంతోనే తన కర్మాగారానికి వెళ్ళాడు. ఆ సమయాన అరుదుగాకురిసే వానజల్లు పెద్దపెద్ద చినుకులతో నల్లబడిన మంచుమీద పడుతోంది; అది ఎంత హఠాత్తుగా కురవసాగిందో అంత త్వరగానే ఆగిపోతోంది. కర్మాగారపు ఆవరణలో అడుగుపెట్టాడు. తమతమ కార్ఖానాలోకి వెళుతూండే కార్మికశ్రేణులు విడివడిపోతూంటే వారిలో కలిసిపోయాడు. ఆకస్మికంగా ఒక కోకిలస్వరం ఆ ఉక్కు-ప్రపంచపు ఆకసాన వినబడిం దతనికి. ఉక్కు-రోలింగ్ మిల్లుకు వెనుకభాగంనుండి వీచిన గాలితెర ఒకటి అతని ముఖంమీద ఒక దోసెడు వర్షబిందువులను విసరింది.

వర్ణనాతీతమైన ఆనందంతో, వసంతఋతు మహాత్మ్యంతో ఉదయించిన అనిర్వచనీయ స్వప్నాలతో అతడు కార్ఖానాలో ప్రవేశించాడు. తన అసిస్టెంటును చూచి హుషారుగా కన్నుగీటాడు. ఆనాడు అత్యంత వేగంతో బట్టీనింపడం గురించి ఒక ప్రయోగం చేయవలసిన విషయాన్ని తన దళానికి గుర్తుచేశాడు. తన ఉల్లాసంతో అందరినీ ఉల్లాసపరచాడు.

అతని అసిస్టెంటుగూడ నవ్వుతూ మిలిటరీపద్ధతిలో నిట్టనిలువుగా నిలబడి అన్నాడు : "కామ్రేడ్ స్మెల్టర్ ఆఫ్ ది గార్డ్స్ ! మా దళం అంతా సంసిద్ధతం. బలహీనులుగాని, రోగిష్టులుగాని యెవరూ లేరు. మీ ఆజ్ఞానుసారమే మూసలలో బట్టీని నింపే పదార్థం మంచెలపైన పెట్టివుంది."

"ఎట్ ఈజ్ ! సరే, ఒక సంగతి—మీ పై అధికారికి నివేదించుకొనే సమయంలో పొట్టను అక్కళించుకోవాలి" అని కాజిమోవ్ హాస్యమాడి, మంచెలమీదికెక్కాడు.

ఆ క్రితంరాత్రి కాజిమోవ్ ఇచ్చిన ఉత్తరువుల ప్రకారమే నిండుగా నింపబడిన మూసలన్నీ వరుసగా పేర్చబడ్డాయి. వరుసలో మొదటగా ఒక మూస ఇనుపపొట్టు, చిన్నముక్కలతో నిండివుంది. దూరాన ఒక మూసనిండా సున్నపురాయి వుంది; ఇంకా దూరాన మరొకదానిలో పెద్దపెద్ద లోహపుముక్కలు మొదలైనవి నింపారు. సరిగ్గా కాజిమోవ్ భావించినట్టే యీ పనిఅంతా ఎంతో సమర్థ

వంతంగా, త్వరగా పూర్తిచేయ గలిగారు. తిరిగి ఆ పదార్థం వెచ్చనవుతూండగా ముడిఇనుమును తయారుచేసి, ఆలస్యమేమీ లేకుండా బట్టీని సిద్ధపరచారు. ఈ సంక్లిష్టమైన పద్ధతి నంతా ఏ మాత్రం పొరపాటు జరగకుండానే చేయగలిగారు. అందులో ఇమిడియున్న సూక్ష్మమైన వివరాలతోసహా కాజిమోవ్ అదివరకే తయారుచేశాడు; అతనిదళం అత్యంత శ్రద్ధతో సహాయపడింది. అందరూ కలిసి సమర్థవంతంగా కృషిచేశారు. వారిసామర్థ్యం, కలిసికట్టుగా పనిచేయడం ఒక అగ్రశ్రేణికిచెందిన ఫుట్ బాల్ దళం జయాపజయాలను నిర్ణయించే పోటీలో పాటుబడినంత ఉత్తమంగా వుంది. ప్రతివాడూ తన నిర్ణీతకార్యాన్ని సాధించుతూనే తోటివారి పనిలోకూడా తోడ్పడ్డాడు. ప్రతివాడూ తన జయాన్నేగాక తన దళంయొక్క మొత్తం విజయాన్నే కాంక్షించాడు.

వసంతఋతు వాతావరణంతోనిండిన బజార్లలో ఆరంభమైన కాజిమోవ్‌లోని సుఖమయోత్సాహం క్రమేపీ ప్రవర్థమానమయింది. చివరకు బట్టీలో బయటకుపోయే మార్గాలన్నీ మూసివేయాలని ఆజ్ఞలిచ్చి, దాహం తీర్చుకోడానికి వెళ్ళినప్పుడు అక్కడవున్న పెద్ద ఎలక్ట్రిక్ గడియారం వంక చూడడం తటస్థించింది. ఈ రోజున షుమారు 70 ని. కాలం పొదుపుచేయబడినట్టు ఆ గడియారం తెలిపింది. కాజిమోవ్ నిర్ఘాంతపోయాడు. తిరిగి అంతలోనే తన్మయానందంతో ఒక చిరునవ్వు అతనిముఖంమీద వెలిసింది; చేతిలో నీళ్ళతోనిండిన గ్లాసుతో అలాగే నిలబడిపోయాడు. కనుగొనని వనరులు—మరీ ఇక్కడేగాదా ఉన్నది!

"ఇవ్వాళ బట్టీని నింపే పదార్థాన్ని పూలపాన్పు మీద పవ్వళింపజేశాంకదూ?" అని కాజిమోవ్ చెవిలో అతని అసిస్టెంటు బిగ్గరగా అరచాడు. "ప్రఖ్యాతిగాంచిన ఆ షుమిలోవ్‌ని యీ రోజు దెబ్బతీయకపోతే ఒట్టు!"

ఆరంభదినాల్లో కాజిమోవ్ తడబడుతున్ననాడు, నిలద్రొక్కుకోడానికి సహాయం అవసరమైనరోజున తనకు బదులుగా షుమిలోవ్ వచ్చి తన పనిలో చేరడాన్ని యీ అసిస్టెంటు ఇంకా మన్నించడంలేదు.

అతనికళ్ళు జూదరికళ్ళలాగ ఉద్వేగంతో మెరిశాయి. కొంటెతనంతో వెలుగుతున్న అతని ముఖంలోకి కాజిమోవ్ చూశాడు; వెంటనే తానే మేల్కొన్నట్లయింది. ఇంకా త్రాగకుండావున్న నీళ్ళగ్లాసును ప్రక్కనున్నవాడి చేతుల్లోకి త్రోసి, బట్టీవద్దకు పరుగెట్టాడు.

ఈ ప్రథమ విజయంతో మత్తెక్కినట్లయింది కాజిమోవ్‌కు. సాహసంతో తన మామూలు హద్దులను దాటిపోయి బట్టీలో వేడిమిని వృద్ధిచేయసాగాడు. చివరకు కరిగించే సమయానికి ఆ వేడిమిని గరిష్టపరిమాణానికి పెంచేశాడు. ఇప్పుడు బట్టీముందు నిలబడి స్వచ్ఛంద ధవళకాంతితో బట్టీలో ఉజ్వలంగా నృత్యమాడుతున్న అగ్నిశిఖలను తిలకించుతూ, తైలాన్ని విరజిమ్మే చిమ్మిరిగొట్టాలను కనిపెట్టుతూ, పనిచేయసాగాడు. అతని ముఖంమీద మచ్చ నీలిరంగు పోసుకుంది. ఒక సన్నని గీతలాగ నోరు కరుచుకుపోయింది. మంటలముందు కాంతివంతమైన అతని ముఖ

మంతా ఒక రాయిలా తయారయి నట్టుంది. శరీరంలో కండ రాలన్నీ బిగించి ముందుకు లంఘించ సిద్ధమయినట్టు తయా రయాడు.

"మనమేమీ కప్పుకింద ఆర్చీలను తగలబెట్టంగదూ?" అని అతని అసిస్టెంటు చాలనెమ్మదిగా ప్రశ్నించాడు.

ఇంత వేడిమితో వారిదివరకెన్నడూ పనిచేసి ఉండ లేదు. సాధారణంగా సాహసవంతుడైన యీ అసిస్టెంటు కూడ ఇప్పుడు నిజంగానే భయభ్రాంతుడయాడు.''

కాజిమోవ్ మంటలమీదనుండి తన దృష్టిని మళ్లించ కుండానే బిగబట్టిన పండ్లతో గొణిగాడు: "మాట్లాడించకు నోరుముయ్".

ఏ వృత్తిలోనైనా, ఏ కార్యరంగంలోనైనా ఇలాగే సంభవించవచ్చు. మానవుడు అనుభవాన్ని సంపాదించు కుంటాడు. అనంతరం క్రొత్తపద్ధతులను ప్రవేశపెడతాడు. తన పనిని తానే విమర్శించుకు చూచుకుంటాడు. పరిశోధ నలు సాగిస్తాడు. ప్రయోగాలుచేసి చూస్తాడు. అందులో అనేకసార్లు నిరాశజెందుతాడు. చివరకు ఒకానొక సమ యాన అగోచరమైన హద్దులన్నీదాటివెళ్ళి అతని సర్వ శక్తులు, సకల ప్రయత్నాలు ఒకే ఒక పూర్ణత్వంలో ఐక్య మవుతాయి. అదే అద్భుతం, రాగరంజితం, తాళయుక్తమైన జీవనఘోష. అదే శ్రమను ఒక కళగా మార్చుతుంది. ఆ కళలో ప్రతి వివరమూ ఒక పరిపూర్ణత్వాన్ని సాధిస్తుంది. అప్పుడు మానవుని ఆత్మ ఉద్వేగంతో నిండుతుంది, అతని

ఆలోచనలు రెక్కలు కట్టుకొని పైకెగసిపోతాయి తనలో అంతవరకు కానరాని కొంగ్రొత్తబలాన్ని కనుగొంటాడు. అతడుచేసే అద్భుతకృత్యాలు తనకూ, ఇతరులకూ గూడ విభ్రాంతి గొలుపుతాయి. అయితే ఆరంభకృషిమాత్రం విచ్ఛేదం కాకుండడం అత్యంత ప్రాముఖ్యమైన విషయం.

కాజిమోవ్ మోము, శరీరం అంతా చెమటలతో తడిసి ముద్దయింది. అతను ధరించిన దుస్తు శరీరాన్నంటుకొని పనికి ఆటంకంకాసాగింది. దానిని తీసివేసి వట్టిచొక్కాతోనే పనిచేయసాగాడు.

ప్రక్కకుతిరిగి తన అసిస్టెంటువంక సంతోషంతో చూశాడు. ఇప్పు డతనికి యుద్ధంలో తన టాంకుదళం చేసిన దాడులసమయం గుర్తుకొచ్చింది. ఎరుగని ప్రమాదాలను ఎదుర్కొంటూ క్రూరంగా దాడిసాగేసమయాన అతిత్వరగా తనటాంకును మళ్ళించుకుంటూ వెళ్ళి, తెలివిగా ఆ ప్రాంతపు నైసర్గికస్థితులను అవకాశంగా చేసుకుంటూ ముందుకు దూసుకుపోయి, అదే సమయంలో ఒక కంటితో శత్రువును కనిపెట్టి ఫిరంగిగుండ్ల వర్షం కురిపిస్తూ, తన బాధ్యతక్రింద పని చేసే యితర టాంకులనుకూడ దృష్టినందుంచుకొని సాగించిన యుద్ధస్థితి అతని మనస్సులో మెలిగింది.

ఈనాడుకూడ మీగడవంటి ఉక్కు తెల్లగా కాగి కుత కుతలాడుతున్న మండే బట్టీప్రక్కన కాజిమోవ్ తిరిగి ఆనాటి యుద్ధధృతినీ, తన నైపుణ్యంతో అతనికున్న ఆత్మవిశ్వాసంతో లంకెవేయబడ్డ సమీప ప్రమాదపరిస్థితినీ, విజయ

సాధనతో తన సామర్థ్యాన్ని తిరిగి అనుభవించాడు. ఆ మంటలముందు ఎర్రబారిన అతనిముఖం చెమటలతో మెరిసింది. మత్తెక్కిన సంతసంతో జ్వాలామానమయింది. ఈ సమయంలో క్లావిడియా గనక చూశడం తటస్థించితే అతను పదిహేనువేండ్లనాడు క్రెమ్లిన్ భవన ప్రాకారాలముందు నిలబడి ఆమె భర్తతోబాటు తీయించుకున్న ఫొటోలోని ఆ యువకునితో యీనాడీతడు ఎంత సన్నిహితంగా పోలివున్నాడో తెలుసుకుని బహుశా ఆశ్చర్యపడివుండేదే.

అతనివద్దకు జోరిన్ వచ్చిచేరాడు; ఒకసిగరెట్టు అందించాడుగాని కాజిమోవ్ దానినేమీ గమనించనేలేదు.

బిగబట్టిన పండ్లసందునుండే "వెళ్ళిపొండి—నన్ను ఒంటరిగా వదలండి" అని కసురుకున్నాడు. జోరిన్ ఒకసారి కండ్లు చిలికించి ఘీంకరించే ఆ మంటలవంక చూశాడు. వేడిమి ఎంతవున్నదో అడిగి తెలుసుకొన్నాడు. ఒకసారి తల పంకించి కప్పుక్రింద ఆర్చీలగురించి హెచ్చరించాడు. ఇప్పుడు వేడిమి గరిష్టప్రమాణాన్ని అందుకున్నది. అంతకు ఏమాత్రం మించినా శృంగభంగమే—బహుశా సర్వవినాశనమే. సాంకేతిక విషయాల్లో సాహసం చూపడంపట్ల సానుభూతి చూపేవాడే అయినప్పటికీ కాజిమోవ్ కోసమే జోరిన్ ఆందోళన పడ్డాడు.

"జాగ్రత్తసుమా! అతిగా పోవద్దు. అందులో పాయసం గురించేగాక పాత్రవిషయంగూడ ఆలోచించు..." అన్నాడు. కాని కరగబోతపనిలో ఒకప్పుడు ప్రావీణ్యం సంపాదించిన

కాజిమోవ్ ఇప్పుడుకూడ బట్టీవిషయం మరువలేదు. ప్రతిదీ అతనికి జ్ఞాపకమే. ప్రతివిషయమూ ఆలోచించే చేస్తున్నాడు.

"పైన ఆర్చీలు చూచావ్! కప్పుక్రింద ఆర్చీల సంగతి జాగ్రత్త!" అని జోరిన్ అతని భుజాలువూపి పలికాడు.

"పర్వాలేదు- -ఏంపర్వాలేదోయ్, సైనికుడా. పాయసమూ ఉడికిస్తాను; పాత్రనూ కాపాడుతానుగదా"? అని తలత్రిప్పకుండానే కాజిమోవ్ నవ్వాడు.

కరగబోతపనిని చివరంటా గరిష్టప్రమాణపు వేడిమిలోనే సాగించాడు కాజిమోవ్. కళ్ళేలన్నీ తన గుప్పిట్లోనే బిగబట్టివుండగా శృంగభంగం ఏమీ జరుగదని అతనికి తెలుసు. ఈ ఆత్మవిశ్వాసమూ, యీ శక్తీ అతనికెంతో తృప్తిని—అపూర్వమైన సంతృప్తిని—కలుగజేశాయి. అది అతనిని అజేయుడినిగా జేసింది.

"అలావుండాలి, పాంతెలీ పెత్రోవిచ్! దెబ్బఅంటే అదే! ఊపిరి ఆడదుసుమా! నా జీవితంలో ఎప్పుడూ ఇలా పనిచేయలేదు." అని అతని అసిస్టెంటు యౌవనోత్సాహంతో పలికాడు.

"నీపని నీవు చూసుకో" అని కాజిమోవ్ కఠినంగా అన్నాడు.

ప్రపంచంలో అన్నీ మరచాడు—అట్టడుగున ఉక్కును కరగబోసే యీ బట్టీని మినహాయించి బయటి ప్రపంచం నుంచిగాని, మరేదయినా అతని దృష్టిని మళ్ళించే ఏ చిన్న

విషయమైనా అతనిని కోపంతో పిచ్చివానిగా చేసింది. ఇన్ని గంటల కాలంలోను ఒక్కసారిఅయినా క్లాద్దియాను గురించి ఆలోచించడంగాని, జ్ఞాపకం చేసుకోవడంగాని జరగలేదు. వేరే మరొకవస్తువు ఇప్పుడీతనికి తన ముందున్న బట్టీగా కాక విస్తృతి జెందిన తన శరీరాంతర్భాగంగానే తోచింది. దాని కోరికలన్నీ ఊహించడంగాక సరిగ్గా ముందుగానే అవగతం జేసుకోగలుగుతున్నాడు. అతడు తర్ఫీదునిచ్చిన దళంకూడ తనవలెనే సమర్థవంతంగా పనిజేసింది. అతని అంతరాత్మలో ఏదో అనిర్వచనీయమైంది మార్మ్రోగి, ఆలాపించినట్లయింది. అతని శరీరంలోని ప్రతికండరమూ ఒకవిజేతలాగ ఉత్సాహ పడింది.

ఆహా, ఏమి దినం!

జోరెన్ తన బ్రహ్మాండమైన చట్టువంతో ఉపరిభాగాన క్రేన్ మీద తనబట్టీవద్దకు చేరేవరకూ యీ కరగబోతపని జరిగినంతసేపూ కాజిమోవ్ తలెత్తి ఒక్కసారి అయినా గడియారంకేసి చూడలేదు అతని అసిస్టెంటుతో కరగినఉక్కును విడుదలచేయడానికి కుళాయిని తెరువమనిచెప్పాడు. ముఖం మీద ప్రవాహంకట్టి కారుతున్న చెమటను తుడుచుకున్నాడు. అప్పుడుగాని వెలవెలబోయే ఆ గడియారం ముఖంవంకచూడ లేదు. చూస్తే అది ఆగిపోయిందేమో ననిపించిం దతనికి. అంత తక్కువకాలంలో కరగబోతపనిని పూర్తిజేయగలడని అతడు కలలోగూడ భావించియుండలేదు. తరువాత తనచేతి గడియారం చూచుకున్నాడు: సెకండ్లముల్లు వేగంగా చక్ర

భ్రమణం చేసుకుపోతోంది; కాని షైంమాత్రం గోడగడియా రంతో సరిపోయింది.

ఇప్పుడిక తెల్లగా, కండ్లుపొడిచివేసే ప్రవాహం విడుదలయి మందగమనంతో గొట్టంగుండా ప్రవహించి స్థిమితంగా ఆబ్రహ్మాండమైన చట్టువంలోకి జారుతున్నది. అప్పుడుగాని ఆనాడు తాను సాధించిందేమిటో కాజిమోవ్‌కు బోధపడలేదు. అలసటతోకంటే ఉద్రేకంతోనే ఎక్కువగా వణకుతున్న శరీరాన్ని సోడాసైఫన్‌కు చేర్చాడు; ఆత్రుతగా సరాసరి నోటిని కుళాయికి అప్పగించి చల్లనిసోడానీరు త్రాగాడు. ఊపిరిపీల్చడం కోసం మధ్యమధ్యఆగుతూ చాలసేపు అలాగే దాహం తీర్చుకున్నాడు. ఆ సోడానీరు తన శరీరం అంతా ప్రాకినట్టయింది. ఎంతోహాయి అనిపించింది. కొంచెం నీళ్ళు తలమీద, ముఖంమీద దోసిళ్ళతో చల్లుకొని మరికొంత రొమ్ముమీద ఆనందంతో రుద్దుకున్నాడు.

మరొకసారి బట్టీ నింపేందుకు సర్వం సిద్ధం చేయాలని తన దళానికి ఆజ్ఞ నిచ్చి, కప్పుక్రింది ఆర్చీలరక్షణ పరిస్థితిని తనిఖీచేయడానికి వెళ్ళాడు. తప్పనిసరిగా ఎప్పుడూ నోట్లో వ్రేళ్లాడే పైపుపెట్టుకొన్న మేస్త్రీ జోరిన్, ఒక మీసాల కరగబోత కార్మికుడు అక్కడకువచ్చి చేరారు.

ఇతడేకాబోలు తమ కార్ఖానాలో ప్రతివారి గౌరవాభిమానాలను చూరగొన్నవ్యక్తి; నిలకడైనవాడు, తగినవాడు; అయినా క్లావ్డియా యితనినేగదా నిరాకరించింది! అతనియెడల కాజిమోవ్ యీ రోజున యెంతో దయగా

ప్రవర్తించాడు—కారణం అతడు నిరాకరింపబడి వుండడం చేత. అయితే ఆ మనిషి తన యెదుట వుండడంవల్ల కాజిమోవ్‌కు క్లాదియా బింబం ప్రత్యక్షమైంది. ఆమె యౌవనంలో, ధీమాగా, ఎంతో అందాన్ని యిచ్చే పూలగౌను ధరించి కనబడుతున్నట్టు భావించాడు. సిగ్గుతో ఆవిడ మోము రాగరంజితమైంది. పైకి కొద్దిగా వొంపు తిరిగిన ముక్కుతో ముఖమంతా ఉత్సాహపూరితంగా వుంది. ఆవిడ కళ్ళు విషాదాన్నిగాని, అలసటనుగాని సూచించడంలేదు. పైగా కాజిమోవ్‌కు ఆ కళ్ళల్లో యేదో వింతైన క్రొత్తభావం ఒకటి ప్రకటిత మవుతున్నట్టు కనబడింది.

"ఏమిటా చిరునవ్వు, టాంక్‌మన్!" అని జోరిన్ అడిగాడు.

"నాకు చాలా హుషారుగావుంది, సైనికుడా! అంతే."

"అవును. అంతే."

అత్యంత వేగంగా ఉక్కును కరగించిన యీ ఫలితాల వార్త కార్ఖానాఅంతటా వ్యాపించింది. అక్కడికి గుంపులు గుంపులుగా వచ్చిచేరిన కార్మికులందరు ఇంతగా, ఇదివరకెన్నడూ కనివిని ఎరుగనంతగా వేడిమిని ఉద్భృతపరచినందుకు కప్పుక్రింది ఆర్చీలు ఏమయినా దెబ్బతిన్నాయేమోనని అనుమానంగా వంగి వంగి చూడసాగారు.

ప్రతిదీ సరిగ్గానేవుంది, మేస్త్రీ కాజిమోవ్ కేసి చూశాడు. ఏదో పలుకబోయినట్టు నోటినుంచి పైపుతీశాడు. కాని ఏమీ మాటాడకుండానే కాజిమోవ్‌ను గాఢంగా ఆలింగనంజేశాడు.

కాజిమోవ్ షిఫ్ట్ అయిపోయింది. అతని దళంవారిచే తయారుచేయబడిన తదుపరి కరగబోతపని మంచిఊపులో సాగిపోతోంది. తనకు బదిలీగా పనిచేసేవాళ్ళకు ఏ విధంగా బట్టీని అప్పగించాడో కాజిమోవ్ గుర్తించనేలేదు. తానేదో కరచాలనం చేసినట్టు, పనిదుస్తులను నేలమీద ఈడ్చుకుంటూ స్నానాలగదులవైపు సాగిపోయినట్టు మాత్రమే అతడెరిగి వున్నాడు. అలసటనూ, తడిసిముద్దయిన గుడ్డలను మరచాడు. స్నేహితులు గౌరవపురస్కరంగా, అమితాశ్చర్యంతో బరపే దృక్కులనుకూడ గమనించలేదు.

కరిగించే సమయంలో తన మెదడును అంత వేగంగాను, అత్యంత సమర్థవంతంగాను పనిచేయించిన ఉద్వేగాన్నే ఇప్పుడుగూడ అనుభవించాడు. అతని హృదయం ఆనందంతో నిండింది; కండరాలన్నీ ఆహ్లాదకరంగా గలగలలాడాయి. స్నానాలగదిలో 'షవర్' వదలాడు. అందులోనుంచి అత్యంత శీతలజలాన్ని విడుదలచేసి దానిక్రింద కిలకిలలాడుతూ, గంతులువేస్తూ, తడిసిన ఒడలంతా చరుచుకుంటూ నిలబడ్డాడు. చాలసేపటివరకూ, తన దళసభ్యులు ఒక్కమారుగా త్రోసుకొని లోపల ప్రవేశించేవరకూ ఆ చల్లని నీటిక్రిందనే వుండిపోయాడు.

"పాంతెలీ పెత్రోవిచ్ ! డైరెక్టరు, కర్మాగారపు కార్మిక సంఘాధ్యక్షులు, మొత్తం జనరల్‌స్టాఫ్ అంతా వచ్చారు. మీ కోసం ఎదురు చూస్తున్నారు ! ఒక విలేఖరి గూడ తయారయ్యాడుసుమా ! ఈ హడావిడిలో ఫొటో

గ్రాఫరు తన కెమేరాను చితకగొట్టుకొనేవా డయ్యాడు గూడ!'' అంతా ఒకసారిగా అరిచారు. ఒక్కొక్కరు తను చెప్పేదే ముందు వినిపించాలని ఎగబడ్డారు.

ఆ స్నానాల గదిలోకి త్రోసుకువచ్చినపుడు వారం దరు సాధారణ దుస్తులు, బూట్లతోనే వచ్చిపడ్డారు. ఆ గదు లపై బాధ్యత చూస్తున్న ముసలితాత, ఇలా తన పుణ్య భూమి పాపపంకిలం గావడంజూచి చకితుడై, కోపంగా అంద రినీ బయటకు తరమసాగాడు :

"సిగ్గులేదూ? ఈ ప్రదేశాన్ని పరిశుభ్రంగా, ఆరోగ్య వంతంగా వుంచడానికి వాళ్ళేమో శ్రమపడుతోంటే— మీరుతయారు... మీ కోట్లూ బూట్లతో బయటికినడవండి!"

"కాని తాతయ్యా! ప్రపంచంలోనే ఇది గొప్ప విజయం! తెలిసిందా?" అని వివరించబోయారు. సమయంలో అడ్డంవున్న ఆ ముసలివానిని త్రోసుకుపోయి అందరూ కాజిమోవ్ వద్దకు చేరాలని ప్రయత్నించారు.

"ప్రపంచంలో విజయాలన్నీ చూపిస్తా నుండండి! సిగ్గులేకపోతేసరి! పదండి!" అని ఒక తడిసిన పాచిగుడ్డను తీసుకొని ఆ వృద్ధుడు వారిమీదికి పోయాడు.

ఈ విధంగా సాయుధుడై ముందుకు ఉరికే శత్రువు ముందు తాళలేక తెలివిగా వాకిట్లోనే తిరోగమనం ఆచరిం చిన కాజిమోవ్ అసిస్టెంటు బయటనుంచీ అరచాడు: "వాళ్ళంతా మీ కోసం ఎదురు చూస్తున్నారు!"

కాజిమోవ్ దుస్తులు ధరించేగదికి నిబ్బరంగా వెళ్లాడు. ఇప్పుడు వేడెక్కిన రక్తము చల్లబారేవరకు ఒంటరిగా వుండడమే అతని అభీష్టం. అయినా అతడు చేయగలిగిందేమీ లేదు. త్వరగా దుస్తులు వేసుకొని బయటకు వెళ్ళాడు.

అతని బట్టీవద్ద ఒక మూలన జనంఅంతా ఎదురుచూస్తున్నారు. ఇతర బట్టీలవద్ద పనిచేసే కరగబోత కార్మికులు వారివారి పనిముట్లతోనే వచ్చారు. అందులో తదుపరి షిఫ్టులో పనిచేయవలసిన కార్మికులున్నారు. వీరందరిపై నుంచీ డైరెక్టరుగారి కొండంతకాయం శిఖరాగ్రంలాగ కనిపించింది. సాధారణంగా ఎల్లప్పుడు ధరించుతూండే గంజిపెట్టిన తెల్లని తెలుపుకాలరు, తెల్లని ఉన్నిబూట్లు వేసుకువచ్చాడు. అక్కడ చేరినవారందరూ ధరించిన పనిగుడ్డల మధ్య యీ దుస్తులు ప్రముఖంగా కన్పించాయి.

ఎవరో అరచారు.

"కాజిమోవ్!"

ఆ వైపే తలలన్నీ తిరిగాయి. మృదువైన పెద్దచేయిని జాచి డైరెక్టరు అతనిని కలుసుకునేందుకు ముందుకొచ్చాడు.

"భలే, పాంతెలీ పెత్రోవిచ్! నా అభివందనాలు. మొత్తం కర్మాగారం అంతటితరఫునా మిమ్మలను అభినందిస్తున్నాను" అని కరచాలనం చేశాడు. అందరినీ చూపుతూ చేయిఫ్రూపాడు; ఆ వూపులో కార్మిక సంఘాధ్యక్షుడు, కాజిమోవ్ యెరుగని యితర కార్మికులు అందరూ చేరివున్నారు. ఘూలుగువంటి సన్నని స్వరంతో తిరిగి అన్నాడు, "మీకు

మొదట్లో ఒక పరిపాలనా పదవిని యివ్వబోయిననాడు మీ రేవిధంగా నా మీద యెగిరిపడ్డారో వీరందరికీ యిప్పుడే చెబుతున్నాను."

"లోకో భిన్నరుచిః" అని కాజిమోవ్ సమాధానం చెప్పాడు. ముందు అక్కడినుండి బైటపడడం యెలాగా అని ఆశ్చర్యపోతున్నాడు. కాని తనచుట్టూ చక్రంకట్టిన జన సమూహం మరింత సన్నిహితంగా కుంచించుకుపోయింది. అతనివైపు చేతులుజాచిన అనేక మందితో కరచాలనం చేయక తప్పలేదు.

చిట్టచివరకు అక్కడ చేరినవా రంతా పల్చబడిన తర్వాత అతని అసిస్టెంటు దగ్గరకు వచ్చాడు. కాజిమోవ్ ఛోకా్కచేతిని పట్టి లాక్కుపోయి నోటీసుబోర్డును చూపెట్టాడు. ఈ బోర్డును చూడడానికే కొలదిమాసాలక్రింద కాజిమోవ్ భయపడేవాడు.

"వి. షుమిలోవ్—5గం. 32ని." అన్నదానిక్రిందనే సుద్దముక్కతో శ్రద్ధగా విపులంగా వ్రాస్తూ ఆ గుండ్రాటి పిల్ల కనిపించింది. "పి. కాజిమోవ్—5గం. 1ని." ఒక్క క్షణం ఆలోచించి, ప్రక్కనే చేర్చింది, "రికార్డు టైం" అని. దానికి మూడు ఆశ్చర్యార్థకాలుకూడ చేర్చింది.

అంత బొద్దుపిల్ల శరీరంలోనుండి ఆశ్చర్యంగొలిపే టంత కీచుగొంతుతో ఆ పిల్ల సన్నగా సాగదీసింది. "అభివందనాలండీ, పాం తెలీ పెత్రోవిచ్."

కాజిమోవ్ ఆమెతో కరచాలనం చేశాడు; ఆ వత్తిడికి ఆ అమ్మాయి ఒక్కసారి ఆవులించింది. మరి ఆ రికార్డుకు మూడు ఆశ్చర్యార్థకాలు తగిపోయే వున్నాయిగదా!

అతని అసిస్టెంటు పొందిన సంతోషానికి అంతులేదు. బిగ్గరగా అరచాడు.

"ఇవ్వాళ షుమిలోవ్‌ను ఏంచేశామో చూశారా? చెట్టెక్కించేశాం! ఈ విషయం తెలియడంతోటే అతనికి పిచ్చెత్తకపోతే పందెం!" అని ఆనందంతో గంతులువేస్తూ అరచాడు.

"నోరుమూయవోయ్, ఇక" అని కాజిమోవ్ కళ్ళెర్ర జేశాడు; కాని అంతలోనే అతని సంతోషంకూడ చల్లబారినట్టు అయింది. అయినా అతని అసిస్టెంటును వారించడం అంత సులభంకాకపోయింది. ఉద్రేకంగా అతడు తమ తరువాత కరగబోతపనికి వచ్చిన కార్మికులను నోటీసుబోర్డువద్దకు త్రోసుకుపోతూ అరవసాగాడు:

"ఏమండోయ్, చూడండి—మరి. అదీ దెబ్బఅంటె! మీరు నేర్వడానికి యింకా మేమిక్కడ వున్నప్పుడే నేర్చుకోండి సుమా! ఇక మీ షుమిలోవ్ అంటే నాకు వెగటేస్తోంది—అతనేదో ఫిలింస్టార్ అనో మరేదో అనుకుంటున్నారేమో! మా పాం తెలీ పెత్రోవిచ్‌తో పోల్చిచూస్తే ఒత్తి కుర్రకుంక!" అని నేలమీద తుపుక్కున ఊశాడు.

"ఆ గంపంత నోరు కట్టేసేయ్, ఇక" అని కాజిమోవ్ ఘనపం ఒకటి చేతబుచ్చుకొని నిజంగానే కొట్టబోయినట్టు

కోపంగా వ్రాపాడు. కాని మళ్ళా అంతలోనే దానిని క్రింద పారేశాడు.

"అది సరేకాని," అని అంటూ ఆ కర్మాగారపు కార్మిక సంఘాధ్యక్షుడు అందుకున్నాడు, "మీకొక మంచి వార్త తెచ్చాను. ఇవ్వాళ రెండు కొత్తభవనాల్లో భాగాలు పంచియిస్తున్నాం. మీకొకభాగం అందులోంచి కేటాయించాం, చూశారా?"

"ధన్యవాదం" అని సాధారణంగా అనేదానికి బదులు కాజిమోవ్, "అవును, చూశాను," అని విచారంగా పలికాడు. అత నంతవరకు అనుభవించిన ప్రబలానందభావం పూర్తిగా శిథిలమై పోయింది. అక్కడినుండి వెళ్ళిపోదామని వెనక్కు మళ్ళాడు.

ఆ సమయంలో అతనికి ఇరవై ఏండ్లనాడు తా ననుభవించిన ఒకానొక విషాదమయ సంఘటన గుర్తు కొచ్చింది. కాజిమోవ్ అనుభవాలనుండి నేర్చుకొనేందుకు లెనిన్‌గ్రాడ్ నుండి వచ్చిన ప్రఖ్యాత కరగబోతపనివాడు ఆ తర్వాత కొద్దికాలంలోనే తన రికార్డును అధిగమించిన విషయాన్ని కేపెట్టి ఒక వదరుబోతు తన నెంతో కవ్వించి ఉక్రోషపరచాడు. ఇప్పుడు వోలోద్యా్యషుమిలోవ్ విషయం ఆలోచిస్తే మళ్ళీ తనేదో నేరంచేసినట్లు ఎందుచేతనో భావించసాగాడు.

కాజిమోవ్ తిరిగి తమ కర్మాగారానికి రావడాన్ని యీ యువకార్మికుడు ఎంతో హృదయపూర్వకంగా ఆహ్వానించాడు. ఆరంభంలో ఎంతో నిస్వార్థంగా తనకు సహాయ

పడ్డాడు. బహుశా ఒకనాటి తనగురువు ఇప్పుడు అప్రతిష్ట పాలుగాకుండ రక్షించేందుకేనేమో కాజిమోవ్ క్రింద అసిస్టెంటుగా పనిచేయడానికి తనంతటతాను వచ్చిచేరాడు. మరి ఇప్పుడేమయింది? ఒక్క హెచ్చరికవాక్యమైనా పలుకకుండా తాను, కాజిమోవ్ పురోగమించిపోయాడు. పైగా ఆపని చేసింది సరిగ్గా మే దినోత్సవానికి ముందు—అందరూ, చివరకు స్నానాలగదుల అజమాషీ చేసే ముసలితాత సహా చాల కష్టపడి పనిచేస్తున్న దినోత్సవానికిముందే ఇలా జరిగింది. ఒక్కమాటైనా చెప్పకుండానే—ఇదీ కాజిమోవ్‌ను అంతగా వేధిస్తున్నది.

"అతని కేమీ హెచ్చరిక అయినా చేయకుండానే గదా! అలాంటి "మామ" నన్నమాట నేను! ఎంతసిగ్గుచేటు... ఇప్పుడు దీనికితోడు ఆ యింట్లోభాగం ఒకటి! అంటే రేపో మాపో, మరో వారానికో నేను బయటకు నడవాల్సిందే—గ్లాద్దియాను, నా స్వంతబిడ్డలను ఎలా ప్రేమించానో బహుశా అంతగాఢంగాను ప్రేమించడానికి అలవాటుబడిన పిల్లవాడినీ వదలి వెళ్ళిపోవాలన్నమాట......ఛీఛీ, ఛీ!"

# 15

బజార్ల వెంటబడి కాజిమోవ్ తనను తానే మరచిన వాడై, దురంతర సంతాపతప్త హృదయుండై కదలిపోయాడు. బజారుకు యిరువైపుల నిలచిన నూతన భవనాల శ్రేణులు గాని, ఆ హిమవత్సాయంసమయ నిర్మలాకాశాన వెలుగొందే అందమైన రోజారంగుల సౌందర్యంగాని, చిన్న చిన్న గోతులలో ఆ రాత్రికిరాత్రే కురిసిన మంచు సూదులులాగ తేలి తన కాలిక్రింద మెత్తగా కరకరలాడడంగాని—ప్రతిదీ అతనికి అగోచరంగానే వుంది. అతనికి చలిమాత్రం వేసింది. దానితో భుజాలను కుదించుకుని వణుకుతూ తనలోతాను గొణగసాగాడు. "సర్వం వికలమే, ఎంతో వికలమై పోయింది...... అంతా ఒకప్పుడు యెంతో బాగుండేది— మరి యిపుడు యిదొకటి........."

వెళుతున్నాడో దేనికి వెళుతున్నాడో తెలియకుండానే నడచిపోయాడు. ఎందుచేతనోగాని యింట్లో కాలుపెట్టడానికి వెనుకాడాడు.

చిట్టచివరకు చలితో పూర్తిగా బిగదీసుకుపోయి, వికలమనస్కుడై, ఆ వేదనలతో క్రుంగిపోయినపుడుమాత్రమే

బారకాసులదగ్గరకువెళ్లాడు. దూరాన్నుంచే విజయార్భాటపు కేకలు విన్నాడు. చూడగా తనకోసం స్లావ్కా బజార్లోనే కని పెట్టుకున్నట్టుంది. కాజిమోవ్ రావడంచూచి, ముందు వసారాలోంచి పిచ్చుకలాగ ఎగిరివచ్చాడు. ఒక్క దూకుతో యెగిరి గంతేసి కాజిమోవ్ మెడ వాటేసుకున్నాడు.

"భలే, భలే అద్భుతం! అద్భుతమంటే అద్భుతం!" గడియారంలో పెండ్యులంలాగ ఊగసాగాడు; అతడి పచ్చని కళ్ళు భాస్వరపు తేజంతో వెలుగొందాయి.

"ఏమిటా అద్భుతం?" అని కాజిమోవ్ అడిగాడు.

ఆ ప్రశ్నలోని వ్యధితస్వరాన్ని విన్నాడు స్లావ్కా. ఆదుర్దాగా అతడి మొహంలోకి చూశాడు :

"మీ రికార్డుసంగతే—అయితే అది నిజంకాదూ?"

ఇప్పటికప్పుడే షుమిలోవ్ కూడ అంతా తెలుసుకునే వుండాలని ఆలోచిస్తూ కాజిమోవ్ ఒకసారి నిట్టూర్చాడు. స్లావ్కాకుమాత్రం యీవార్త యదార్థమేనన్న నమ్మకం కలిగింది. దానితో తిరిగి ఉత్తేజితుడయ్యాడు—తనే దేశా న్నంతనీ ఇంతగా ఆశ్చర్యపరచిన వాడిలాగా.

మేం కూడ వినక చేసేదేమీలేదులే. అప్పుడే రేడి యోలో చెప్పేశారుగూడ—కర్మాగారం, నగరస్టేషన్ల రెంటి నించీ. మంత్రిగారు పంపిన టెలిగ్రాంకూడ చదివాడు. "అఖిలదేశీయ విజయం సాధించినందుకు మా అభినందనలు" అని. ఇంటిలో మనకు అతిథులున్నారు. అబ్బో బోలెడు మంది.

లోపలనుంచి గొంతులు వినిపించాయి.

"ఎవరో వాళ్ళంతా?" కాజిమోవ్ రహస్యంగా అడిగాడు.

స్లావ్కా సమాధానం చెప్పడానికయినా టైం లేక పోయింది. దభీమని తలుపు తెరచుకుంది; ప్రకాశవంతమైన ఆ గది ముంగిట్లో షుమిలోవ్ విగ్రహం గోచరించింది. అతని విశాల భుజస్కంధాలవెనుక బిలియర్డ్సు బంతిలా మెరిసే జోరిన్ గుండుబుర్ర, హిమబిందువులవంటి కళ్ళతో వాల్యా ముఖం—వీరందరికీ వెలుపలగా—క్లావ్దియా అగుపించారు.

తను పొందిన ఆశ్చర్యాన్ని అణచుకొని స్పష్టమైన ఆవిడ కొంటెముఖంలోకి ఆకలిగా చూచాడు కాజిమోవ్. ఆమె ఇప్పుడా పూలుఅల్లిన గౌను ధరించలేదు; తానెన్నడూ చూడని మరొక లేతరంగు గౌనుతొడిగి వుంది. ఆ గౌను దృఢమైన పొందికగల ఆమె శరీరానికి మరింత శోభనిస్తోంది. సాధారణంగా వెలవెలబారే ఆమె చెక్కిళ్ళు ఒక విధమైన రోజారంగు పోసుకున్నాయి. ఫలితంగా ఆవిడ కళ్ళకూ, ముఖకళవళికలకూ మధ్యనున్న "పోటీ" యిప్పుడంతగా కని పించడంలేదు. అర్ధనిమీలితమైన ఆమె నల్లనికళ్ళు క్రిందికి చూస్తున్నమాట వాస్తవమే. కాని ఆనాడు మాత్రం ఆ కళ్ళల్లో సాధారణంగా కానవచ్చే విషాదచ్ఛాయలు కన బడడం లేదు.

"పాంతెలీ పెత్రోవిచ్ జిందాబాద్!" అని షుమిలోవ్ ఒక్క కేకవేశాడు. తన బలిష్ఠ కరములలో కాజిమోవ్‌ను ఎత్తిపట్టి గది మధ్యలోకి మోసుకుపోయాడు.

కాజిమోవ్! మీరు సరైనమార్గాన్నే పయ నిస్తున్నారుసుమా! ఈ కుర్రవాళ్ళకాళ్ళు విరగద్రొక్కి మరీ వెళ్ళాలి. వయసుముదిరి పాతబడినా మనల్ని వాళ్ళేమీ మించిపోలేరని తెలియజెప్పండి. వాళ్ళకేమీ విశ్రాంతి నివ్వ వద్దు," అని జోరిక్ కూడ అరచాడు.

"అలాంటి పని ఏ హెచ్చరికా లేకుండా చేయడం ఏమి ధర్మం?" అని వాల్యా కొంటెగా ప్రశ్నించింది.

"అదేంకాదులే అమ్మాయి! అంతా బాగానే జరి గింది—ఎవరు వెనకబడతారో వాళ్ళెప్పుడు వెనకనే వుంటారు," అని జోరిన్ పలికాడు. "అయితే ఏం, నీ వోలో ద్యానుగురించి మరేం బాధపడనవసరంలేదు. అతనింకా ముసలివాడు కాలేదుగా! నీకు వారసులు కాబోయేవారంద రినీ ఉత్తేజితుల్ని చేయడానికి అతనికింకా చాలకాలంవుందిలే!"

"మీ రనేది ఏమిటి?" అని వాల్యా దిగ్భ్రమచెందిన తన అందమైనకళ్ళను ఒకసారి చికిలించుకుంది. "ఇక మీ సంగతి—కామ్రేడ్ కాజిమోవ్ అదేం ధర్మమో చెప్పండి!"

"టాంక్ మన్! ఆ పిల్ల పలుకులు పట్టించుకోకు. అణగి నంతవరకు త్రొక్కేయండి! జీవితంలో మనపయనం పూర్తి వేగంతో సాగవలసిందే—అందులో గోళ్ళుగిల్లుకుంటూ కూర్చోవ్ఛపనిలేదు.

క్లౌదియా కోపపడుతున్నట్టుగా కాజిమోవ్ వంక చూసింది:

"ఇలాంటి సమయంలో మీరెక్కడకి మాయమై పోయారు? ఎంతోసేపు కాచుకుకూర్చున్నాం మీకోసం.

ఈపూట భోజనమంతా అతిగా ఉడికిపోతుందేమో, మాడి పోతుందేమోనని నేనూ, వాల్యా ఎంత భయపడ్డాం!''

''చూడండిమరి, ఆ పిల్లా ఈమే కలిసి ఏమేమి తయారు చేశారో మీకోసమని. ఇదే మీ కృషిని పరీక్షించే పరిశోధన శాల! ఇలాంటి భార్యను పెట్టుకొని ఇక వొలోద్యా ఆకలితో మాడవలసిన అవసర మేముంది!''

''చూడండి, కామ్రేడ్ జోరిన్! మీకిలాంటి అభిప్రాయం ఎలావచ్చిందో! వొలోద్యా, నేనూ ఒట్టి స్నేహితులం. అంతే,'' వాల్యాచెక్కిళ్ళు ఎర్రగా మారాయి. కళ్ళు మెరిశాయి. ఆవిడ ''కాదు'' అన్నదాంట్లో దృఢాభిప్రాయం ఏమీ లేకపోయింది.

ఆ పిల్లవంక షుమిలోవ్ తదేకంగా చూడసాగాడు. దేవతా సౌందర్యాన్ని వెదజల్లే ఆ కోలముఖంలో ఏ భావం వ్యక్తమయినా వెన్వెంటనే అదేభావం ఇతని ఎర్రటి పెద్ద ముఖంలోకూడ కనబడసాగింది.

హుషారైన సంభాషణలతో తన హృదయాన్నుంచి ఒక పెద్దబరువు తొలిగి: మొట్టమొదటిసారిగా తాసీనాడు సాధించిన విజయంయొక్క ఆనందాన్నిసంపూర్ణంగా అనుభవించగలిగాడు. కాజిమోవ్ చేతిని గట్టిగా పట్టువిడువకుండా పట్టుకుని కూర్చున్న స్లావ్కా ఆ చేతిని తన చెక్కిళ్ళకేసి అదుముకుంటూ, ప్రతివారినీ కోపంగా అసూయతో చూడసాగాడు.

"వీళ్ళంతా ఎంత మంచివాళ్ళు!" అని కాజిమోవ్ ఆలోచించాడు. "వాలోద్యా ముఖంచూస్తే యీ అభినందన లన్నీ తనకేనన్నట్టు వెలుగొందుతోంది. నేనేదో అను కున్నానుగాని........."

"మీ విజయానికి మా ధన్యవాదాలు తెలుపుతూ అప్పుడే ఒక్కొక్కరం అంతా ఒకసారి పుచ్చుకున్నాం. ముక్కలుతరిగిన పుట్టగొడుగుల్నికూడ నంజుకున్నాం" అని జోరిన్ వెలిబుచ్చాడు.

"మిమ్మల్ని ఓడించే అదృష్టం నాకుపట్టాలని మరో సారి పుచ్చుకుందాం," అని ముఖమంతా నవ్వుజేసుకొని పలికాడు షుమిలోవ్.

"నిజం చెప్పాలంటే మూడోసారిగూడ అయిపో యింది—ఎప్పుడూ నిలవదేరి పోవడంగాని, తుప్పుపట్టిపోవ డంగాని జరగకుండా వుండేందుకు దాన్ని పుచ్చుకున్నాం."

"ఇప్పుడిక అన్నింటినీ మించిన అత్యంతముఖ్యమైన 'టోస్టు' త్రాగుదాం, రండి! మీమీపాత్రలు నింపండి అందరూను!" అని కాజిమోవ్ అరచాడు. టేబిల్‌పై పరచిన గుడ్డమీద తాను ఒలకబోసిన ద్రాక్షసారాను ఏమీ గమ నించనేలేదు.

అప్పుడు అతడు ఠీవిగా కనిపించాడు.

"ఇది మన పార్టీకి," అని తనగ్లాసును ఖాళీచేశాడు. గదిలో అంతా నిశ్శబ్దం. అందరూ తమతమ ద్రాక్షసారాను నిశ్శబ్దంగానే త్రాగారు. ప్రతివారి మనస్సులోను ఏవో స్వంత

ఆలోచనలు మెదలుతున్నట్టయింది. అయినా బహిర్గతంకాని యీఆలోచనలన్నీ ఒకేఒకపూర్ణత్వంలోవిలీనమైనట్టయింది.

ఈ పవిత్ర నిశ్శబ్దాన్ని స్లావ్కా భగ్నంచేశాడు. టేబిల్‌మీదనున్న ఒకసారాగ్లాసును అందుకోవాలని చేయి చాచాడు. కాని అంతలోనే అతని తల్లి చేతిమీద ఒక్క చరుపుచరిచింది. అందరు నవ్వారు; కాని స్లావ్కా మూతి బిగించి కూర్చున్నాడు. ఇంత అద్భుతమైన 'టోస్టు'నుగూడ తను త్రాగరాదామె! మొత్తంమీద అందరూకలసి నిష్కారణంగానే అతనియెడల ఏదో నేరంచేస్తున్నట్టు, నిరాదరణ చేస్తున్నట్టు భావించాడు. అలాగే ఉక్రోషంతో కుతకుత లాడుతూ కూర్చున్నాడు. తనంటే ఏమీ పట్టించుకోని కాజిమోవ్‌ను చూచినకొలదీ అతనిలో అసూయ పెల్లుబకిపోసాగింది.

"చూశారూ! మీరన్నారే, ఆ జర్మనువాడిని నా బుర్రలోంచి తొలిగించుకోలేక పోతున్నాను" అని కాజిమోవ్ వైపుకుతిరిగి టేబిల్‌మీదవంగుతూ పలికాడు జోరిన్. "మీరు 'రెడ్‌కార్నర్'లో ఉపన్యసిస్తూ చెప్పారే వాడు; కోతపనిముట్లు దాచేసుకొన్న జర్మనుసంగతి. సిద్ధాంతరీత్యా అదిఅంతా నిజమే—అలాంటివాళ్ళుండేవారు, యింకా వున్నారుగూడ—మరి పెట్టుబడిదారీ విధానం అంటే అంతే గదా! అయినా ఎందుచేతనో అలాంటిమనిషినే నేను ఊహించుకోలేకపోతున్నా." అని తను పలికినమాటలతో ఏమీ సంబంధంలేకుండానే తిరిగి అన్నాడు జోరిన్: "మన

ముందున్న కాలాన్ని తలుచుకుంటూంటే, పాంతెలీ పెత్రో విచ్! మనం ఇప్పటికప్పుడే ఆరోహించిన శిఖరాలను తలుచుకుంటూంటేనే చాలు కళ్ళు తిరుగుతున్నాయి సుమా!''

"అతన్నిగురించే నా ఆలోచనంతా" అని అనుకొని కాజిఘోవ్ ఒకసారి షుమిలోవ్‌వైపు తలపంకించాడు. షుమిలోవ్ మాత్రం యీ ప్రపంచాన్నే మరచిపోయి సర్వాంగాల్యా అయిపోయినట్టు ఆ పిల్లవంక తదేకధ్యానంతో చూస్తూ కూర్చున్నాడు. "అతడేమో నా యింటికి అభినందించాలని వచ్చాడు. అదినిజమే—ఏమీ సందేహంలేదు. కాని నేనేలయితే అలా చేయగలిగేవాడినేనా? ఏం? ఏమిటి మరి, సైనికా?" అని ప్రశ్నించుకున్నాడు.

"మీరన్నది అర్థమయింది. తిరిగి జోరిన్ కంఠస్వరం వినిపించింది. "యూరప్‌లో మీరున్న సంవత్సరాలలోనే యిక్కడ జీవితం ముందడుగువేసింది; ప్రజలు పురోభివృద్ధి గాంచారు. ఉక్కును కరగబోయడంలో మీరు షుమిలోవ్‌ను పల్టీకొట్టించారు—నిజమే. మంత్రివద్దనుండి అభినందనల టెలిగ్రాంనుకూడ మీరు అందుకున్నారు. అయితే వాస్తవంలో మీరు అన్ని విషయాలలోను అతడిని ఓడించలేదు. అవునుమరి—అలా జరగనేలేదు. మనం అలాంటివారికి మార్గాన్ని సుగమంచేశాం; నేలమీది మిట్టపల్లాలన్నీ చదును చేసిపెట్టాం. దానివల్ల వాళ్ళంతా నును పెక్కిన తిన్నటిరోడ్డు మీద ప్రయాణం చేయడం సులభమైంది; ఇక ఎదురుదెబ్బలు తిని ముక్కులు పగలగొట్టుకో నవసరంలేదు... ..."

త్రాగిన సారా జోరిన్ మీద బాగా పనిచేయసాగింది. దానివల్ల అతనికి మరింత హుషారు కలిగింది. టేబిల్ మీద బాగా వంగి, ఆ యువతీ యువకులవైపు కన్నుగీటుతూ ఏవో కుట్ర పన్నుతున్నట్టు కాజిమోవ్ చెవిలో ఊదాడు :

"వాళ్ళకిప్పుడు అంతా సుఖవే—ఎలావున్నారో చూశారా మరి ?... వాళ్ళను అడ్డగించేదేదీ లేదిప్పుడు. నన్ను మొదట్లో పల్లెపట్టుకు పంపించిన సమయం జ్ఞాపక మొస్తోంది. నేనేమో ఫ్యాక్టరీలో పుట్టి పెరిగినవాణ్ణి; పల్లెటూరును సినిమా తెరమీద తప్పించి ఎక్కడా చూడలేదు. సరే, ముందు అక్కడవున్న ఆడవాళ్ళందరినీ ఒకచోట ప్రోగు చేశాను. వాళ్ళతో ఆరంభించాను: 'కామ్రేడ్ మహిళల్లారా! మీ కోళ్ళు రోజుకెన్ని గ్రుడ్లు పెడుతున్నాయి ?' అన్నాను. వారందుకు సమాధానంగా : 'మాకెలా తెలుస్తుంది—ఒక్కొక్కసారి ఒక్క గ్రుడ్డు మాత్రమే పెడుతుంది, లేకపోతే అదీ లేదు' అని చెప్పారు. దానికి నేనన్నాను : 'అక్కడే మీరు తప్పుచేస్తున్నది. గ్రుడ్లను సప్లయిచేసే మీ ప్లానును మీరు నిర్వహించడం లేదు. దానిని పూర్తిచేయాలంటే మీకోళ్ళు ఒక్కొక్కటీ రోజుకు కనీసం రెండు గ్రుడ్లైనా పెట్టాలి." నాకుచుట్టూ అంతా నవ్వే వినిపించింది. నేనేదో చాల తెలివితక్కువగా మాట్లాడి వుండాలని గ్రహించి, వెంటనే బయటపడడానికి ప్రయత్నించాను. 'నేననేది అలంకారార్థమేగాని నిజంగా కాదుసుమా ! నేననే దేమిటంటే కోళ్ళు పెంపకానికి సైన్సును జోడించాలని' తర్వాత మెల్ల

మెల్లగా అక్కడ నేను చాల నేర్చుకోగలిగాను. నేనంటే వాళ్ళు చాలఅభిమానం చూపేవారు. తర్వాత మూడు సంవత్సరాల అనంతరం నేను ఆవూరు వదలిపోతూంటే మొత్తం రైతాంగంఅంతా కట్టకట్టుకొనివచ్చి నాకు వీడ్కోలు ఇచ్చారు. ఇప్పటికీ నాతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతూనే వున్నారు. మరి యీ యువజనం విషయమో?— వారిది మెత్తటి పని, నున్నటిబాట. కావాలంటే వీళ్ళు ఒక్క పరుగున ముందుకు ఉరకగలరు గూడ." మళ్ళీ అతని మామూలు ధోరణిలో ఇంకో విషయాన్ని అందుకున్నాడు: "మీ మీ పరిస్థితులు మార్చివేసినట్టయితే మీరుగూడ వచ్చి ఇలాగే షుమిలోవ్‌ను అభినందించి యుండేవారు. మిమ్మల్ని నే నెరుగుదును. బహుశా కాస్సేపు ఆలోచించేవారు; చెవి వెనుక కొంచెం గోకేవారు; చివరకు రానేవచ్చేవారు. సరే, మరోసారి ఇంకో గుక్కెడు వేసుకుందాం, పట్టండి : ఈసారి ఇది కమ్యూనిజానికి!" అని ముగించాడు జోరిన్.

క్లావిదియా, వాల్యాలు యిద్దరూ కలిసి భోజన సామాగ్రిని తీసిసర్ది, మరో క్రొత్తగుడ్డను టేబిల్‌మీద పరచారు. నీడలువారుతూ మెరిసే "సామోవరీ" టేబిల్‌మీదకు వచ్చింది; తన మామూలు కూనిరాగం ఆలాపించసాగింది. అప్పుడు అకస్మాత్తుగా ఏదో జ్ఞాపకంవచ్చి జోరిన్ తనజేబులు చరిచి చూచుకొని, దేనికొరకనో వెదకసాగాడు.

"ఆగండి, ఆగండి! వోడ్కా అంతా ఖాళీచేశాంగాని అత్యంత ముఖ్యమైంది మీకుచూపడం మరచాను సుమా" అన్నాడు.

చిట్టచివరకు తాను వెదుకుతున్న కాగితాన్ని బయటకులాగి, సర్వలాంఛనాలతో దానిని కాజిమోవ్‌కు బహూకరించాడు :

"ఓ ప్రధాన కార్మికుడా! ఇదిగో తీసికొండి. పాలక వర్గం ఇచ్చిన బహూకరణ యిది—డైరెక్టరుగారే నన్ను స్వయంగా అందివ్వమని ఆదేశించారు. మీకు ఒక ఇంటిలో భాగం కేటాయించారుగదూ? దానిని మంజూరుచేసే ఆర్డరే ఇది. ఆహా! ఏమి ఇల్లండీ! ఏదో స్వప్నంలో కనబడవలసిందే! నేనే స్వయంగావెళ్ళి ఒకసారి చూసివచ్చాను. కిటికీలన్నీ దక్షిణానికే వున్నాయి. రెండు గదులు, పింగాణీపరచిన స్నానాలగది. గట్టికొయ్యతో పేర్చిన నేల. ఇంకేం కావాలి?... రేపే మీ సామానంతా ఒకలారీలో ఎక్కించేసి యిక తరలిపొండి! మీ గృహప్రవేశానికి మళ్ళీ మాకో 'డ్రింకు' దొరుకుతుందన్నమాట, కదూ!"

ఇదంతా ఒక విచిత్రమైన అనుకోనని ఫలితాన్నిచ్చింది. ఏమరుపాటుగానే కాజిమోవ్ చేయిజాచి ఆ కాగితాన్ని అందుకున్నాడు; వెంటనే ఒక్కసారిఅయినా దానిని కన్నెత్తి చూడకుండానే తనముందున్న ప్లేటుక్రింద దోపేశాడు. క్లావియా గడ్డకట్టుకుపోయింది. పైకి స్థిమితంగానే కనిపించినా ఒక కప్పు తీసుకొని దానికి అదేపనిగా పాలిషు పెట్టసాగింది. చివరకు అది పగిలిపోయిందికూడ. ఇక వాల్యా, షుమిలోవ్‌లు అప్పటివరకు అంతగా ఒకరిలో ఒకరు అంత లీనమైపోయి వున్నవాళ్ళల్లా యేదో జరగరానిది జరిగిందని

గ్రహించారు. గ్రహించి అందరినీ దిగ్భ్రమతో కళ్ళప్పగించి చూస్తూ నిశ్శబ్దంగా కూచ్చుండిపోయారు.

జోరిన్ మాత్రం తన బుర్రను ఒకసారిగోక్కుని అర్థవంతంగా అన్నాడు, "అంటే... ...అదీ సంగతి!"

"రెండుగదులు... ..." చివరకు కాజిమోవ్ కూడ నిస్తబ్ధంగా అందుకున్నాడు, "ఒక వృద్ధబ్రహ్మచారికి రెండు గదులు. ఇది చాల వైభోగమేకదా!"

సమావేశమంతా మరోసారి అలసటతోకూడిన నిశ్శబ్దంలో మునిగింది. ఆ కఠిన నిశ్శబ్దంలోనుంచి హఠాత్తుగా స్లావ్కా-స్వరం మ్రోగింది.

"అయితే అమ్మనీ, నన్నూ మీతోకూడ తీసుకు వెళ్ళండి!"

క్లావ్దియా తుడుస్తున్న కప్పు చేతిలోనుంచి జారి ఆమె ఒడిలోంచి దొర్లి, క్రిందపడి పగిలిపోయింది.

"ఇదీ మంచి శకునమే... ..." అని జోరిన్ ఆరంభించాడుగాని అంతలోనే సర్దుకొని తన వాక్చమత్కృతిని ఆపేశాడు. అతని కెంతో ఆప్యాయమైన కాజ్బెక్ సిగరెట్లను వెలికి లాగి ఒకటి ముట్టించుకోసాగాడు.

"కాని నే ననేది నిజంగానే, పాంతెలీ పెత్రోవిచ్! మీతోగూడ అమ్మా, నేనూ వస్తాం" అని ఆ పిల్లవాడు తన కంత అద్భుతమైన ఆలోచన కలిగినందుకు సంతోషిస్తూ వత్తిడి చేయసాగాడు.

"స్లావ్కా!" అని గదురుకొంది అతని తల్లి.

ఆవిడ ముఖంమీద ద్యోతకమైన గందరగోళాన్ని చూడడానికి కాజిమోవ్‌కు విచిత్రంగాను, భయంగానువుంది. ఆత్మ స్థైర్యభావాన్ని ఆమె ఎప్పుడూ—చివరకు ఆనాడు తానా లారీక్రిందినుంచి ప్రాకి బయటకువచ్చిన సమయంలో కూడ—తన చిత్తస్థైర్యాన్ని కోల్పోయివుండలేదు.

కాని స్లావ్కా-మాత్రం ఇదేమీ చూడలేదు. ఎంతో హృదయవేదనతో ఆమె కళ్ళు చిట్లించుకొని పండ్లతో పెదిమను కొరికిపట్టడంగాని, భయంకరమైన బాధను దేనినో ఉపశమింప జేసేందుకా అన్నట్టు బిగించిన పిడికిళ్ళను గుండెకు అదుము కోవడంగాని అతను గమనించలేదు.

"ఎప్పుడూ మనం ఒక్కచోటే ఉందాం. హోంవర్కు చేసుకోవచ్చు; షికార్లు పోవచ్చు. ఏం?"

"ఇక ఆపేసేయ్, పాడువెధవా!" అని స్లావ్దియా అరచింది చివరకు.

లజ్జతో శరీరమంతా గగుర్పాటుచెందగా ఒకసారి అతిథులవంకా, కాజిమోవ్ వైపు చూసింది; హఠాత్తుగా మండిపోయే తన ముఖాన్ని దోసెళ్ళతో కప్పుకొని తెర వెనుకకు పారిపోయింది.

ఇంత జరిగినా స్లావ్కాను ఆపేది యేదీ లేకపోయింది. ఇంత పెద్దస్నేహితుడు—తన చిన్నిజీవితంలో ఎన్నో ఖాళీలను నింపిన అంత మంచిస్నేహితుడు—ఎక్కడ తన సూట్ కేసును చేతబుచ్చుకుని కారెక్కి వెళ్ళిపోతాడోననీ, ఏవో పనికిమాలిన రెండు గదులు, ఒక స్నానాలగదికోసం తా

మందరినీ వదిలివెళ్ళి యీ చిన్ని స్నేహితుణ్ణి ఎక్కడ మరచి పోతాడోననీ—ఇంకా ఘోర మేమిటంటే అక్కడకు వెళ్ళిం తర్వాత యెవరో యితర పిల్లలతో యెక్కడ స్నేహం చేస్తాడోననీ ఆ పసిహృదయం భీతావహంతో తల్లడిల్లి పోయింది. ఎంతో ఆందోళనతో తన తల్లి పెట్టిన కేకనుకూడ విస్మరించి కాజిమోవ్ కోటుచేతిని పట్టుకొని అతని కళ్ళల్లోకి చూస్తూ మెల్లగా ఊదాడు :

"నన్నూ అమ్మనూ మీ వెంట తీసుకువెళతారుగదూ, ఏం ?"

కాజిమోవ్ ముఖమంతా కందగడ్డ అయింది. అతని గుండెలు బద్దలై స్వతంత్రంకోసం బైటపడతాయా అన్నట్టు సమ్మెటపోట్లతో కొట్టుకోసాగాయి. స్లావ్కావలెనే అతడూ యీ సంభాషణలోని వింతదనాన్నిగాని, ఆ గదిలో యితరు లున్న విషయాన్నిగాని గమనించనేలేదు. అతనికి యేది అత్యంత ప్రాణప్రియమో అదిప్పుడు ఒక త్రాసులో తూకం వేయబడుతోంది.

"ఐతే మరి అమ్మ యేమంటుందో! వెళ్ళి అడుగు, మనతో వస్తుందేమో" అని చివరకు బొంగురుపోయిన గొంతుతో నసగగలిగాడు. ఏదో పెద్దబరువు తన గుండెల మీదనుంచి తొలగించినట్టు పెద్ద నిట్టూర్పొకటి విడిచాడు.

వెంటనే స్లావ్కా తెరవెనక్కు దూసుకుపోయాడు.

"అమ్మా, అమ్మ. నీవుకూడ వస్తావుగదు లే. ఏం? ఏం? రావూ? రా, మాతో రా. మరెందుకు యేడుస్తున్నావు?

అంతా భలేగావుంటుంది. నీవుకూడా వస్తున్నావులే— కదూ ?''

తెరవెనుక నిశ్శబ్దంగా వెక్కి-వెక్కి యేడవడం విని పించింది. తా నేదో తిరిగి స్వృహలో పడుతున్నట్టు కాజి మోవ్ గదంతా ఒకసారి కలయజూచాడు.

సాయం సంధ్యాసమయపు కెంజాయ నీరెండ కిటికీ గుండా ప్రవహించి గది నంతటినీ ఒక వింతైన, ఉద్రిక్తమైన వెలుగులో ముంచెత్తింది; గ్లాసుతలుపులమీద మంచువల్ల కలిగిన వింతరూపాలకు బంగరుపూత పూసింది. జోరిన్ కాల్చే సిగరెట్టునుంచి పొగ ఉంగరాలు తిరిగి పెద్ద పెద్ద చక్రాలు చుట్టుతూ కప్పుమీదికి పోతోంది. ఇలా ఊగిస లాడుతూ, తేలిపోతూ, అంతర్ధానమయ్యే యీ పొగ చక్రాల లోనే ప్రపంచంలోని కఠినమైన, క్లిష్టాతిక్లిష్టమైన సకల సమస్యలకు పరిష్కారమార్గం దొరుకుందన్నట్టుగా అతడు తదేకదృష్టితో వాటిని పరిశీలించసాగాడు. ఇక వొలోద్యా, వాల్యాలిద్దరూ ఏదో పాతపత్రికలో గాఢంగా నిమగ్నమై నట్టున్నారు—తాము చదివే పత్రికను తలక్రిందుగా పట్టు కున్నది కూడ గమనించలేదు.

టేబిలుమీద అలారం గడియారం తనవిధిని నిరంత రాయంగా నెరవేర్చుకుంటూ టిక్కు-టిక్కు మంటోంది. ఆ గదిలోనువ్న అందరిలోను అది ఒక్కటే చిత్తస్థైర్యాన్ని చూపుతోంది. ఇక ఆ తెరవెనుకనుంచి వినవచ్చే ఎక్కిళ్ళు ఆ గదిలో తాండవించే నిశ్శబ్దాన్ని మరింత హెచ్చుపర

చాయేగాని మరేమీకాదు. గడియారపు టిక్కు-టిక్కులు సమ్మెట పోట్లులాగ పడుతున్నాయి; కాజిమోవ్ గుండెలు బ్రద్దలవుతాయేమో ననిపించింది.

అతని స్నేహితులనూ సర్వప్రపంచాన్నీ మరచాడు కాజిమోవ్. ఆనాటి ఉదయాన ఉక్కు-కరగబోసే సమయంలో పొందిన ఉద్రిక్తభావాన్నే ఇప్పుడూ అనుభవించాడు. అతని అదృష్టాన్ని నిర్ణయించే ఆ తెరవంక తేరి చూస్తూ అలాగే వుండిపోయాడు.

"అమ్మా! ఏమేఅమ్మా!" అని స్లావ్కా తొందర జేశాడు ఆ తెరవెనుక.

"ష్...ష్, కొంటెవెధవా! అలా వాగకు. ఎంత హఠాత్తుగా జరిగింది!" అన్న క్లావ్దియాస్వరం వినవచ్చింది. "పైగా ఇంట్లో యితరు లున్నారు. వాళ్ళు... ... ..."

కిటికీతలుపులమీద అంతరించిపోయే మంచు చిత్రించిన రూపాలమీద ఏప్రియల్ మాసపు సూర్యాస్తమయకాంతి సమసిపోయింది. నిశ్శబ్దంగా నిశీథం గదిలోకి ప్రాకివచ్చింది.

